జనుల చరిత్ర

# తెలుగు ముత్తరాజుల సంగ్రహ చరిత్ర





గ్రంధకర్త :

చెట్టి లక్ష్మయ్య ముత్తరాజు

1988

ప్రథమ ముద్రణ : 1988 శ్రీ విభవ వైశాఖ.

ప్రతులు : 2000

ముఖచిత్రము : శ్రీ డి. టి. లోహిత్.

పటము (మ్యాప్) : శ్రీ పి. దుర్గయ్య ముత్తరాజు



**వెల : రూ. 20-00**

ప్రతులకు :

శ్రీ చెట్టి లక్ష్మయ్య ముత్తరాజు

H. No. 12-1-286, 287, లాలపేట,

సికింద్రాబాదు - 500 017.

ముద్రణ : చార్మినార్ ఆర్ట్ ప్రింటర్స్,

గంజ్ బజార్, సికింద్రాబాద్-500 003

# ఓం

ఓం భూర్భువస్వః తత్స వితుర్వరేణ్యం,

భర్గోదేవస్య ధీమహీః॥, ధియోయోన ప్రచోదయాత్.

ఓం

# పరిచయం

శ్రీ చెట్టిలక్ష్మయ్యగారు స్వాతంత్ర సమరయోధులు, రైల్వేలో తమ ఉద్యోగాన్ని వదలి వేసి హైదరాబాద్ స్వాతంత్ర సమరంలో దూకారు. ఆ సందర్భంలో వారితో పరిచయం కలిగినప్పటికీ, ఇటీవల స్వాతంత్ర సమర యోధుల ఉద్యమ సందర్భంలో వారితో కలిగిన పరిచయంగాఢమైనది. ఈ ఉద్యమంలోని మా పరిచాయాన్ని పురస్కరించుకొని కాబోలు మిత్రులు శ్రీ లక్ష్మయ్యగారు తాము రచించిన "తెలుగు ముత్తరాజుల సంగ్రహ చరిత్రను" చదువుమని నాకిచ్చారు నేను చదివిన తర్వాత నా అభిప్రాయాలను ఈ పుస్త కానికి తొలిపలుకుగా వ్రాయమన్నారు.

తెలుగు ముత్తరాజుల సంగ్రహ చరిత్రను ఆమూలాగ్రంగా చదివాను, శ్రీ లక్ష్మయ్యగారి పరిశోధన, పరిశ్రమ, ప్రశంసనీయమైనవి. వారి పరిశ్రమకు నేను ఆశ్చర్యపడ్డాను. ఈ పుస్తకం చదవడంవల్ల ముత్తరాజుల చరిత్ర అట్లుండగా, అనేక నూతన విషయాలు తెలుసుకునే అవకాశంనాకు కలిగింది.

ఋగ్వేదకాలంనుండి 20 వ శతాబ్దంవరకు లభించిన ఉపపత్తులనన్నిటి నుండి ముత్తరాజుల చరిత్రను నిర్ధారణ చేయడానికి శ్రీలక్ష్మయ్యగారు కృషి చేశారు. అయినప్పటికి వీరు తమపరిశోధననే చివరితీర్పుగా ఎక్కడా పేర్కొనక పోవడం వీరివినయానికి తార్కాణం.

ఈ పుస్తకం చదువుతుంటె ముత్తరాచలు తెలుగువారయినప్పటికీ తెలుగు దేశంలో కంటే తమిళనాడులోను, తర్వాత కన్నడ ప్రాంతంలోనూ ఎక్కువగా ప్రాబల్యం గడించినట్లు కనుపిస్తుంది. ఒక్కొక్కసారి వీరు ఆంధ్రులా, తమిళులా, అనే సందేహానికి అవకాశంకూడా ఏర్పడుతుంది. ఏది ఎట్లయినప్పటికి, ముత్త రాచలు గతకాలంలో పరిపాలకులుగా ఉన్నారనే అంశం వివాదానికి అతీత మయినది. ఈ పుస్తకంచదివిన తర్వాత ఏమైన సందేహం ఉంటే అది నివృత్తి అవుతుంది. అంతేకాదు-మధుర, తంజావూరు మొదలయిన ప్రాంతాలను పరి పాలించిన నాయకరాజులు ముత్తరాచలే కావడం-ఆంధ్రులకు గర్వకారణం.

విజయనగర సంస్థానాన్ని పరిపాలించిన తుళువ వంశం, ఆరేటి వంశం, ముత్త రాచలని తెలిసి ఆశ్చర్యంవేసినది మొన్న మొన్నటివరకు ఆనె గొందిని పరి పాలించిన సంస్థానా ధీశులు ముత్తరాచలని నా చిన్నతనంలో విన్నాను. కాల ప్రభావంవల్ల పరిపాలకులయిన ముత్తరాచలు వెనుక బడ్డజాతుల పట్టికలో చేరవలసి వచ్చినప్పటికీ, నిన్న మొన్నటివరకు, వారు సైనిక వృత్తిలో ఉన్నా రనటంకూడ అందరికి తెలిసిందే. నా చిన్నతనంలో మా గ్రామంలోగల ముత్త రాచలే వేటాడటం, కావలిగాయడం, మొదలయిన పనులను తుపాకులు ధరించి చేసేవారు. అంతేకాక "దసరా పారువేటలోకూడ వీరే ప్రధాన పాత్రవహించే వారు. ముత్తరాచలలో వివాహ కార్యసందర్భంలో చివరి రోజున కాబోలు, వీరులకు పెట్టడం," అని ఒక తంతును నిర్వహిస్తారు. ఆనాడు ఒక పురుషుడు ఉపవాసం ఉండి వీరగంధం పూసుకొని పూనకంపూని ఊరేగుతాడు. అతని వెంట ధూపం వేస్తూ బంధువర్గం అంతా ఊరి బయటికి వెళ్లి, వీరులకు చేయ వలసిన పూజాది కాలు నిర్వర్తిస్తారు ఇది వీరి క్షాత్ర్యధర్మానికి నిదర్శనం కాబోలు.

ఇటీవల వరకు కూడ వీరు సైనికవృత్తిలోనే ఉన్నారనడానికి, లక్ష్మమ్మ కథ అని నేను చిన్నప్పుడు పిన్న శారద వాండ్ల కథ, (బుర్రకథ) లో లక్ష్మమ్మ భర్త యుద్ధంలో చనిపోతారు, లక్ష్మమ్మ సహగమనం చేస్తుంది. వీరు ముత్త రాచ కులానికి చెందిన వారని జ్ఞాపకం.

ముత్తరాచలలో "బంటు" అనే ఒక తెగఉన్నది. ఈ విషయం శ్రీ లక్ష్మయ్యగారుకూడ ఉదాహరించారు. బంటు, అంటే సైనికుడు అని అర్థం. అట్లే "దండు" అంటే సైన్యం అని అర్థం. పూర్వం వీరు దండులో బంటులుగా పనిచేసేవారు కాబట్టి వీరికి వ్యవహారంలో బంటు అని పేరు వచ్చింది.

ఏది ఎట్లయినప్పటికి సైనిక వృత్తి అయిన క్షాత్రధర్మాన్ని ముత్తరాచలు చాలకాలం అనుసరించారనేది నిర్వివాదమైన అంశం. అయితే ఈ నాడు వారు కాలప్రభావంవల్ల వెనుక బడ్డారు, తిరిగి వారు వృద్ధిలోకి రావలసనే ఉద్యమం కొనసాగవలెనంటే పూర్వ ఔన్నత్యాన్ని స్మృతి పథానికి తీసుక రావడం అవసరమనిపిస్తుంది. ఆంధ్రులలోని అనేకకులాల వారు ఈ విధంగా తమ పూర్వ ఔన్నత్యాన్ని గుర్తుకుతెస్తూ పుస్తకాలు వ్రాశారు. ప్రఖ్యాత

పండితులు దేశారాద్ధకులు. కీ: శే: సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాసిన "రెడ్డి కుల నిర్ణయ చంద్రిక. స్వర్గీయ కొత్త సత్యనారాయణచౌదరి గారు వ్రాసిన "కమ్మవారి ప్రశస్తి" అనే పుస్తకాలు ఇందుకు ఉదాహరణాలు. ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే ఇటువంటి కృషి బహుశా అభివృద్ధి చెంద డానికి అవసరం ఉన్నదనుకుంటాను. జాతి పరంగా చూచినప్పుడు. ఆంధ్ర జాతిని ఉత్తేజ పరచడానికి, ఎన్నో చరిత్రలు ప్రభోధ గీతాలు, గేయాలు, కవులు, పండితులు పరిశోధకులు వ్రాశారు. భారత జాతిని ప్రబోధిస్తూకూడ అనేక రచనలు వెలువడినవి. రెండవ ప్రపంచ యుద్ధంలో, రష్యాలోకూడా జారు చక్రవర్తుల పరిపాలనలోని గత వైభవాన్ని వ్యక్తం చేస్తూ కమ్యూనిస్టు పరిపాలన యేప్రబోధాత్మకమైన శౌర్యరసవత్తరమైన, రచనలు ప్రచురించారు.

శ్రీలక్ష్మయ్యగారు పడ్డ శ్రమను, వారి పట్టుదలను ఎంత అభినందించినా తక్కువయే. కాని ఈ సంధర్భంలో వారికి చెప్పే సలహా ఏమిటంటే ముత్త రాచకులానికి అనుబంధమైన అనేక శాఖలు వేరు వేరు పేర్లతో, ఈనాడు పిలువబడడం జరుగుతున్నది. వృత్తులు విభేదించినా కొద్దీకులాలు పేర్లుకూడ మార్పు చెందుతవి. అట్లే ప్రాంతాలు మారినప్పటి నుండికూడ కొన్ని పేర్లు మార వచ్చును. తను పరిశోధనలో ముత్తరాచలలో ఉండేబంటులు, మొదలయిన పేర్లతో పిలువబడుతున్న అనేక ఇతరకులాలను తిరిగి ఒక కులంగానైనా రూపొందిస్తే, అసంఖ్యాకములైన కులాల సంఖ్యకొంతయినా తగ్గుతుంది. కుల నిర్మూలన సంఘం వంటి సంఘాలు ఉద్యమాలను నిర్వహిస్తున్నా, ఇంత త్వరలో కులాలు రూపుమాసిపోయేట్టు కనిపించదు. కులకట్టు బాట్లు కొంత సడలినప్పటికి, రాచకీయాలు కులాలలో ప్రవేశించి వాటిని సమసి పోకుండా కాపాడుతున్న ఈరోజులలో కులనిర్మూలన అంత తొందరలో సాధ్యంకాదేమో ననిపిస్తుంది అటువంటప్పుడు లెక్కకుమించిన కులాల్లో ఏమాత్రం సంఖ్య తగ్గినా సంతోషించవలసిందే దీనికి శ్రీలక్ష్మయ్యగారు కృషిచేస్తారని ఆశిస్తాను.

వినయకుటిరం వివేకనగరం.
హైద్రాబాద్. 20
తేది. 30-5-1988.

కోదాటి నారాయణరావు.

# అభినందనం

ఆచార్య ఎం. కులశేఖరరావు
అధ్యక్షుడు, తెలుగు శాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

ఇవాళ సాహిత్యంలో వివిధాంశాల మీద పరిశోధనలు జరుగుతున్నాయి. సామాజిక విజ్ఞానం లోతుపాతుల్ని తెలుసుకోడానికి, పదిమందికి అందించడానికి కూడా బహుళంగా పరిశోధనలు కొనసాగుతున్నాయి. సామాజిక విజ్ఞానంలో గుప్తంగా-సుప్తంగా ఉన్న అనేక అంశాలకు ఆధారాలు సాహిత్యంలో లభిస్తు న్నాయి ఆ ఆధారాలకు శాసనాలు, కైఫియ్యత్తులు, చారిత్రక గ్రంథాలు, కట్టడాలు సాక్షాలుగా కనిపించినప్పుడు మార్గం నిష్కంటకమైన పరిశోధకుడు నిగ్గు దేల్చే అవకాశం కలుగుతుంది.

లభించిన అన్ని ఆధారాలతో "తెలుగు ముత్తరాజుల చరిత్ర"ను సమ గ్రంగా అందించే ప్రయత్నంచేశారు శ్రీ చెట్టి లక్ష్మయ్యగారు జానపద సామా జిక విజ్ఞానంలో కులాల చరిత్రల మీద పరిశోధన చేసేవారికి ఈ గ్రంథం ఎన్నో వినూత్న విషయాలనందిస్తుంది.

వైదిక యుగంనుండి ముత్తరాజులున్నారని, భారతంలోని యయాతి పుత్రులు పురుడూ (పురువు) లేదా తుర్వసుడు వీరికి మూలపురుషులని, పాండవులు ముదిరాజులే అని ఈ రచయిత సోపపత్తికంగా నిరూపించారు. పాళెగాండ్లు, వోరుగంట్లు, తెలగనాయళ్లు, పాండ్యులు పల్లవుల సామంతులు, వైదుంబులు, గొంకచోడరాజులు చోళులు, తలవరులు, బంటులు, రామపర మార శాఖీయులు, కావలికారులు మట్లవారు, బొమ్మవారు, పునంతవారు, తుషువ వంశీయులు కోలీలు, ముత్తరయర్లు మొదలైన అనేక నామాలతో ఆయా దేశాకాల పరిస్థితులను బట్టి ముదిరాజులు పిలువబడినట్లు ఈ గ్రంథంలో రచయిత వివిధ సందర్భాలలో తెలియజేశారు.

ఒకే కులం లేదా ఒకే తెగ, ఒకే వృత్తిలో ఉండాలనే నియమమేమీ లేదు. కాలధర్మాన్ని అనుసరించి, పరిస్థుతుల ప్రభావాన్ని బట్టి ఎవ్వరే వృత్తినైనా

చేసట్టవచ్చు. శరీరంలోని వివిధాంగాలు శరీరాభ్యుదయానికే తోడ్పడిన విధంగా ఆయా కులవృత్తులన్నీ సమాజాభ్యుదయానికే తోడ్పడాతాయి. ఇందులో ఒక వృత్తి ఉన్నతమైందని, మరొకటినీచమైందని సంస్కర్తలెవరూ చెప్పలేదు; శాస్త్రకారులెవరూ ప్రవచించలేదు. దేహంలోని ఒక అంగం ఉత్తమమైంది, మరొకటి నీచమైంది అని యెవరూ భావించరు; భావించకూడదు. అదే విధంగా దేశంలోని ఒక వృత్తి ఎక్కువ, ఒక వృత్తి తక్కువ అనే భావన ఉండకూడదు. ఈ భావన ఉండి ఎవరైనా హెచ్చు తగ్గుల్ని ప్రబోధించి పాటించినట్లయితే అది సంస్కార హీనతే అవుతుంది.

ఒక జాతిమీద మరొక జాతి దండయాత్ర జరిపి వశంచేసుకొని, ఆ జాతిని తమబలంతో-జులుంతో అణచివేసి పరిపాలించినప్పుడు ఈ ఎక్కువ తక్కువల్ని పాటించారు; నియంతలుగా వ్యవహరించి ఆజాతి భాషాసంస్కృతుల్ని అణచివేయడానికి ప్రయత్నించారు. కాని నియంతల్ని, సామ్రాజ్య వాదుల్ని సంఘటిత జాతీయశక్తులు ఎదుర్కొని జాతికి విముక్తిని కలిగించి నప్పుడు, దేశంలోని కుల వృత్తులు మళ్లీ స్వేచ్ఛావాయువుల్ని పీల్చుకున్నాయి.

భారత దేశంలో సరిగ్గా ఇలాగే జరిగింది. పారతంత్ర్య భారతంలో అణచబడ్డ జాతీయ శక్తులు స్వాతంత్ర్య భారతంలో పునర్వికసించాయి. తమ వెనుకా ముందులు చూసుకొన్నాయి. వేదకాలం నుండి నేటివరకు తమ స్థానం ఎక్కడా అని ఉనికిని గుర్తించుకొని, సర్వకాల సర్వావస్థల్లో అస్తిత్వాన్ని ఆశిస్తూ ఊర్ధ్వాభిముఖంగా పయనం చేస్తున్నాయి. భారత దేశ సమగ్రత్వాన్నీ-సమైక్యాన్నీ ఆశిస్తూనే ఇవి ఈ దిశలో పయనిస్తున్నాయి. జాతీయ ఏకాత్మత అంతస్సూత్రంగా విశ్వమానవతా పథం మీద పురోగమిస్తున్నాయి.

భారత దేశంలో ముఖ్యంగా దక్షిణభారతంలో చరిత్ర కందిన కాలం నుండి ముత్తరాజుల యోగదానం మరువరానిది. వారు క్షాత్ర తేజాన్ని ప్రదర్శించి దేశపరిరక్షణకు పూనుకున్నారు సేవావృత్తిని స్వీకరించి సమాజ సంక్షేమ నిమిత్తం కృషిచేశారు. "ఒకచో నేలను పవ్వళించు నొకచో నొప్పారు పూసెజ్జపై" అన్న భర్తృహరి భావలకు ఉదాహరణ ప్రాయంగా వారు నిలిచారు

శ్రీ చెట్టి లక్ష్మయ్యగారు ముత్తరాజులను పరితలకీ విధంగా బొమ్మ గట్టించారు. ఈ ఇరవైమూడు ప్రకరణాల చరిత్ర నిర్మాణానికి వారు దాదాపు అయిదు వందల గ్రంథాల్ని అధ్యయనంచేశారు. విరుద్ధాంశాలెన్నో

లక్షించినా ఏకముఖంగా నడపడానికి ప్రయత్నంచేశారు. శాతవాహన, ఇక్ష్వాకుల, చోళ, చాళుక్య. కాకతీయ, విజయనగరాది రాజుల కాలంలో ముత్తరాజుల స్థానాన్ని సముచితంగా నిర్ణయించారు. చిందులూ తదితరులు చెప్పిన జానపదుల కథల్నికూడ సమన్వయించారు. ఈ గ్రంథం నిజంగా ముత్తరాజుల విజ్ఞాన సర్వస్వంగా తీర్చిదిద్దారు.

అయితే ఇంత పరిశ్రమించి నిర్మించిన ముత్తరాజుల విజ్ఞాన సర్వస్వంలో అక్కడక్కడ రచయిత తనవాదానికి బలంగా కొన్ని ప్రసిద్ధ పద్యపాదాల్ని ఉదాహరించడం గ్రంథం ప్రామాణిక స్థాయిని పెంచినట్లు ఉంది. భారత దేశంలో కులాలను గురించి పరిశోధించే వారికిది పరమ ప్రామాణిక గ్రంథమవుతుంది.

మూలపురుషుడైన "ముదిరాజు"నుండి నేటివరకు "ముగ్గులేని ఇల్లు ముత్తరాసలేని ఊరు" కనబడదు అనే సామెత సమాజంలో ముత్తరాజుల ప్రాశస్త్యాన్ని తెలుపుతున్నది. "ముందర ముత్తరాజులు వెనుక యానాదులు" ఉంటే నిజంగానే ఈ దేశం, ఈజాతి, ఈధర్మం రక్షింపబడుతుందని ఆశించడం తప్పేమి కాదు. అందుకే "ఈ ముదిరాజు చరిత్ర ఇంతటితో ముగియలేదు; ఇంక అన్వేషణ చేయవలెను" (పుట 185) అన్న రచయిత మాటతో ఏకీభవిస్తూ, తెలుగులో పరిశోధనా దృక్పథంతో అన్ని కులవృత్తుల చరిత్రలు రావడానికి ఈ గ్రంథం నాందీపలకాలని ఆశిస్తూ, గ్రంథకర్త శ్రీ చెట్టి లక్ష్మయ్య ముత్తరాజు గారిని మనసారా అభినందిస్తున్నాను.

హైదరాబాదు,
1988, మే, 5.

ఎం. కులశేఖరరావు.

# మనలోమాట

కులం, మతం, అస్త్రం, శస్త్రం, రాజకీయం, శాస్త్రం వీటి అన్నింటి కన్న ఉన్నతుడు మానవుడు. మానవుడు మహోన్నతుడు. అతడే కులం, మతం లాంటి అన్నింటినీ సృష్టించాడు. వీటి అన్నింటినీ అతడు మానవుని ప్రగతికోసం క్షేమంకోసం, అతని సుఖశాంతులకోసం సృష్టించాడు. ముందు సృష్టించబడి నప్పుడు సంస్థలు, వ్యవస్థలు అన్నీ మానవుని అగ్రగామిని చేయాడానికే ఉపకరించాయి. అని చెప్పడంలో ఏమాత్రం సందేహం లేదు.

మానవులలోనే స్వార్థపరులు, సంకుచిత స్వభావులూ ఉంటారు. కాలక్రమేణ వ్యవస్థ ఏది అయినా ఈ ప్రబుద్ధుచేతులలోకి రాకతప్పదు. రాకుంటే దాన్ని తమ చేతుల్లోకి తీసుకోవడం వాళ్ళ లక్షణం. వాళ్ళు ఈ వ్యవస్థలను తమ బాగుకు వాడుకుంటూరు. దీనికి మసిపూసి మారేడుకాయ చేస్తారు ఏ ఉద్దేశ్యం కోసం ఆ వ్యవస్థ సృష్టించబడిందో దానిని నాశనం చేసి మానవుని పతనానికి దారితీసేదిగా సిద్ధంచేస్తాడు.

వ్యవస్థ మిగులుతుంది. దాని గుణగణాలు మిగలవు.

రాజకీయులు తాము చేసేదంతా త్యాగం అని నమ్మించడానికి ప్రయత్నిస్తారు. మానవాళిని సర్వనాశనం చేసే యుద్ధం కూడా ప్రజా శ్రేయస్సుకే చేస్తున్నాను అంటాడు. అందుకు కులం, మతం, భాష, ప్రాంతం, దేశం అన్నింటినీ వాడుకుంటాడు. ప్రజలను ఉద్రిక్తులనుచేసి వారుస్వయంగా బలి అయ్యేట్లు చేస్తాడు. ఇందుకు అనంతం అయిన చరిత్ర సాక్ష్యంగా ఉంది.

ఇవ్వాల్టికి లభిస్తున్న రాజకీయ సిద్ధాంతాల్లో పేరుకు ప్రజాస్వామ్యం ఉత్తమం అయింది. – ఉన్నతం అయింది. అది స్వార్థపరుల చేతుల్లోపడి ఏమైపోయిందో మనం చూస్తూనే ఉన్నాం

"కులం, దాన్ని కనిపెట్టినపుడు సృష్టించినపుడు అది మానవునికి అత్యా వసరం అయ్యుండాలి. నాటి సమాజంలో పని విభజన కావలసి వచ్చింది. పనితనం అవసరం అయినపుడు ఆ పని కుటుంబం చేయాల్సి వచ్చింది. కుటుంబమే

శిథిలాగారం అయింది. కులం పుట్టిన కొత్తలో వ్యక్తులు కులాలు మారిన నిదర్శనాలు చాల ఉన్నాయి. అయితే బ్రహ్మర్షి కావడానికి విశ్వామిత్రుడు అనేక అడ్డంకులను ఎదుర్కోవలసి వచ్చింది.

ఈనాటి కులవ్యవస్థ కుళ్ళి, కంపుకొడుతున్నది ఇది ఎంత తొందరగా అంతం అవుతే అంతమంచిది అనుకుంటున్నాం. స్వయంగా ఈ గ్రంథకర్త కులాలు అంతం చేయడానికి వచ్చిన ఉద్యమాలన్నింటిని పేర్కొన్నారు. గౌతమ బుద్ధుని నుంచి గాంధీజీ వరకు వచ్చిన ఉద్యమాలను ఉటంకించారు.

కులాలు వేరు - వాటి చరిత్ర వేరు.

కులాలు ఉండరాదన్న మాటను అందరూ వొప్పుకుంటారు. కాని కులాలను గురించిన అధ్యయనాన్ని కాదనేవారు ఎవరూ ఉండరనుకుంటా.

మిత్రులు లక్ష్మయ్యగారు తమ కులాన్ని గురించి పరిశోధించి ఈ గ్రంథం రచించారు. ఇందుకు వారు చేసిన కృషి ప్రతిపుటలోనూ కనిపిస్తూంది.

ఇది ఒక దశాబ్ద శ్రమ ఫలితం.

ఈ పుస్తకంలో అడుగడుగునా తెలుగువారిని ప్రస్తావించడం జరిగింది. రచయిత ముత్తరాచకులాన్ని గురించి మాత్రమే రాశానని చెప్పినా ఇందులో అనేక విషయాలను గురించి ప్రస్తావించడం జరిగింది. అందుకే ఇది "జనుల చరిత్ర" అయింది.

తెనుగుదేశము మూడు నగముల మధ్యది. త్రినగ తెనుగు అయింది. తూర్పు పడమటి కనుములు వింధ్య-పర్వతం - ఇవి మూడు పర్వతాలు. ఈ మూడు నగముల మధ్యనున్న దేశం కాబట్టి తెనుగుదేశం అయిందని వీరి అభిప్రాయం.

"తెలుగు"ను కూడా వీరు స్వీకరించారు. త్రిలింగాల మధ్యనున్న దేశాన్ని తెలుగుదేశం అన్నారు. అయితే మన భాషకు తొలి పదం తెనుగు అని వీరి అభిప్రాయం. "గ్రంథప్రయోగమునుబట్టి చూచినచో 'తెలుగు' పదముకన్న 'తెనుగు' పదమే ప్రాచీనమానిపించును. వాగనుశాసనుడని కీర్తి వడసిన నన్నయభట్టారకుడు తన మహాంధ్ర భారత పీఠికలో 'తెనుగు' అని ప్రయోగించి ఉన్నాడు.

తెనుగు తెలుగుగా మారడానికి కారణం హూణులు అని వీరి అభిప్రాయం. "సింధు" "హిందు"గా మారినట్లు హూణుల ఉచ్చారణ లోపం వల్ల 'తెనుగు' 'తెలుగు'గా మారినట్లున్నది.

ముత్తరాచలు తెనుగు, తెనగ, తెలగ, తెలిగోద్, తెలింగె, తెలంగా తెలుగోళ్ళు, తెలగ నాయుడు మొదలగు అనేక పేర్లతో పిలవబడుతున్నారు. ఒక కులము ఒక పూర్తిభాషాసమాజానికి సంకేతం కావడానికి సరియైన చారిత్రిక ఆధారాలు ఉండి ఉండాలి. తెలుగునాడు సంపూర్ణముగా వ్యాపించిన మహోన్నత జాతి ముత్తరాచవారు.

"ముదిరాజ పదము సృష్టినుండియే కనపడుచున్నదని తెలియనగును. ముదిరాజ పదానికి మూలం యయాతి. ఇతని కథ భాగవతంలోది. యయాతి శుక్రాచార్యుల కూతురు దేవయాన్ని పెండ్లాడాడు. క్షత్రియ కన్య శర్మిష్ఠను ప్రేమించాడు ఇద్దరికి పిల్లలు కలిగారు. దేవయాని యయాతిని గురించి తండ్రికి చాడీలు చెప్పింది. శర్మిష్ఠను ప్రేమిస్తున్నాడని, శుక్రుడు యయాతిని ముసలివాడవుకమ్మని శపించి, యయాతి బ్రతిమిలాడగా అతని కొడుకుల్లో ఒకడు యవ్వనం ఇస్తే మళ్ళీ వయసువాడు అవుతాడని మార్చాడు. యయాతి కొడుకుల్లో పురువు తప్ప తక్కినవారు తండ్రికి యవ్వనం ఇవ్వడానికి అంగీకరించలేదు. పురువు ముదిమిని తీసుకున్నాడు. అందువలన అతడు ముదిరాజు అయినాడు। ఆ ముదిరాజు సంతతివారే ఈ ముదిరాజులు లేక ముత్తరాచలు.

ఇందుకు శివపరంగా కూడా ఒక కథ చెప్పడం జరిగింది. శివుని ఉంగరం గంగలో పోయింది. శివుడు ముత్తరాజును పిలిచాడు. ఉంగరం తీసి ఇమ్మన్నాడు. వల కావాలన్నారు ముత్తరాజులకు. శివుడు వల ఇచ్చాడు. వారు ఉంగరం తీసి ఇచ్చారు, ఉంగరంతో ముత్యాలు కూడా వచ్చాయి. అందువల్ల ముత్యాలరాసులవారు లేదా ముత్తరాచవారు అయినారు.

ముత్తరాచల ఆదినుంచి నేటివరకు కలిగిన అనేక మార్పులను లక్ష్మయ్యగారు సూచించారు. వారు రాజులయినారు. ఓడించినారు, ఓడింపబడ్డారు కూడా. పాళెగార్లు అయినారు. తలవరలు అయినారు. ఓడిపోయి అడవులలో దూరారు. అక్కడ ఉండిపోరు చానాకాలం. అయాడవి తెగగా మారిపోయారు.

ముత్తరాచల వృత్తాంతం వివరిస్తూ శ్రీకృష్ణదేవరాయల కులాన్ని గురించి చర్చించారు. తుళువ వంశం తుర్వసుని వంశం నుంచి వచ్చిందేమోనని అంచనా వేశారు. కాకతీయులను గురించి చర్చించారు.

ముత్తరాచల విజయ యాత్రలు ఎక్కువగా ఆంధ్రేతర ప్రాంతాలలోనే జరిగినట్లున్నాయి. అయితే వీరంతా తెనుగుదేశం నుంచి పోయిన తెనుగు ముత్తరాజులేనని లక్ష్మయ్యగారు చెప్పారు. వీరు క్షత్రియులు కావచ్చును. వీరిది భరద్వాజ గోత్రంగా చెప్పబడింది.

మిత్రులు లక్ష్మయ్యగారు ఈ పుస్తకంలో చాలాచాలా విషయాలు చెప్పారు. వాటిని అన్నింటిని పేర్కొంటే ఆదొక గ్రంథం అవుతుంది.

ఇంత శ్రమకు ఓర్చి ఈ గ్రంథం ప్రచురించినందులకు లక్ష్మయ్యగారిని అభినందిస్తున్నాను.

సికింద్రాబాదు.
30-4-1988

దాశరథి రంగాచార్య

# అభిప్రాయము

శ్రీ లక్ష్మయ్యగారు జ్ఞానవృద్ధులు. వయోవృద్ధులుకూడ. వారు రచించిన ఈ చారిత్ర కవ్యాసమును ఆములాగ్రము చదివిన ప్రతిపాఠకునకు వారిరచనా నైపుణ్యమద్భుతమనియు, ఎనలేని కృషిసల్పిరనియు తోచును. స్వయముగా వారు సేకరించి, రచించిన ఈ గ్రంథములోని కొన్ని ముఖ్యాంశములను మదభిప్రాయమూలమున విన్నవించుకొనుచున్నాను. గీర్వాణ, ఆంధ్ర, ఆంగ్లాది అష్టభాషా కోవిదులైన శ్రీ లక్ష్మయ్యగారి వ్యాసమును చదువుట యే నాసాహసము పైగా "చంద్రునికో నూలుపోగన్నట్లు" నే నీయభిప్రాయమును ప్రకటించుటగూడ సాహసమే

(1) ముందుగా వీరు వర్ణవిభాగవిషయములను ప్రమాణపూర్వకముగ వివరించుచువారి క్రియావిధానములు వేదోక్తరీతిని నిరూపించిరి. ఆయా వర్ణములకు తగిన కార్యకలాపసరణి యజ్ఞయాగాదులతో ప్రారంభింపబడినదై కన్నులకు కట్టినట్లు తెలుపబడినది.

(2) నాటి సాంఘికాచార వ్యవహారములను, యుగకాల నిర్ణయములను వివరించుట వీరి రచనలోని వైశిష్ట్యము.

(3) మతరహస్యములనుట్టంకించుటలో రచయిత యొక్క ప్రావీణ్యము వర్ణనాతీతము.

(4) కొన్నిశాసనములను ప్రమాణములనాధారముగా గొని "చంద్ర వంశజులే ముదిరాజులని" శేట తెల్లము గావించిరి.

(5) "ముత్త, ముది, రాజ" శబ్దవివరణ పద్ధతి, యమోఘము. ఇంత వరకు మొదటిప్రకరణము.

(6) తరువాత రెండవప్రకరణమున కొన్ని శాసనముల నెత్తిచూపుటయు, మూడవప్రకరణమునగూడ "ముదిరాజ" శబ్దవివరణమును గావించిరి.

(7) నాల్గవప్రకరణమున "ముత్తరాచకులవర్ణన, ఐదవ ప్రకరణమున తెలుగుముత్తరాజులు తమిళాలగుటను వివరించినారు. ఈ విషయములకు విశ్వ నీయములైన ప్రమాణములుగూడ ఉల్లేఖింపబడినవి.

(8) ఆరవ ప్రకరణమునగూడ ఈ విషయమునే వివరించుచు అనూచానముగ కాల నిర్ణయము చేయడమైనది.

(9) ఏడవ ప్రకరణమున ముత్తరాచ-తెలుగు గొంక చోడ రాజుల సంబంధాభావమును విడమరచినారు. ఎనిమిదవ ప్రకరణమున ముత్తయర్లకును పాండ్య, చోళ, పల్లవరాజులకును గల అవినాభావ సంబంధమును రూఢి చేసిరి.

(10) తొమ్మిదవ ప్రకరణమున ముత్తరాజులు పరిపాలించిన దేశమును "ముత్తరయర్ నాడు" అనిరి. అది ఇప్పటి "తమిలనాడు" వలె వ్యవహార యోగ్యము ఆనాడు కూడ "వెలనాడు పాకనాడు" మొదలగు పేళ్ళవలె ఉన్నదనుటలో అతిశయోక్తిలేదు. ముత్తరయర్ నాడు కావేరినదిని పరివేష్టింపబడిన "తిరుచినాపల్లి" అని నిర్ణయింపబడినది. ఆనాటి ద్రావిడప్రబంధముల ననుసరించియు, కొన్ని శాసనములను ఆధారముగా తీసుకొని ఈ నిర్ణయము జరుగుట సమంజసమే. పల్లవుల చరిత్రయును ఈ నిర్ణయమునకు కొంతయాధారమైనది- భూగోళశాస్త్రము ననుసరించి ముత్తరయర్ నాడు ఎల్లలు నిర్ణయింపబడినవి.

(11) మొదట ముందరాజు పట్టణమే చెన్నపట్టణమై కాలక్రమమున మద్రాసుగా వ్యవహరింపబడుచున్నదను నూతనాంశమును రచయిత పదియవ ప్రకరణమున విశదీకరించినారు. తలూకాల నిర్ణయము చేయుచు ముత్తరాజులు మధురను, తంజావూరును కూడ పరిపాలించిరని పదునొకండవ ప్రకరణమున వివరించినారు. అప్పుడు పాలించిన నాయకరాజవంశ వివరణ కూడ ఇందు జోడింపబడినది.

(12) తెనుఁగు శబ్దము చక్కగా నిర్వచింపబడి. "ముత్తరాజులు తెలుగువారే" యని పండ్రెండవ ప్రకరణమున నిశ్చయింపబడినది. భాషాశాస్త్రము నను, తదితర చారిత్రక గ్రంథములందును చేయబడిన తెనుఁగు శబ్దనిర్వచనా సరళివేరు. రచయిత సమర్థించిన తీరును ప్రత్యేకమై కడుంగడు సమంజసమై ఒప్పారుచున్నది.

శ్రీ లక్ష్మయ్యగారు తమ వ్యాసమునందు చివరియంశమున ముత్తరాజులు క్రీస్తుకు రెండవశతాబ్దియందుండినవారో అంతకు పూర్వమున ఉండిన

వారో అని చారిత్రకముగ కాలనిర్ణయమును ఊహించి తమ వ్యాసమును పూర్తి చేయుచు పాఠకుల ఊహకు గూడ చాలవిషయముల నందించినారు.

ఈ గ్రంథమాలాల గోపాలమునకు సులభగ్రాహ్యమై సర్వజనామోదముబడయుననుట నిర్వివాదాంశము.

ఇట్లు

తేది. 30-5-1978 **ప్రతివాది భయంకరం భాష్యకారాచార్యులు**

సంస్కృత B. O. L. తెలుగు M. O. L.

తెలుగు పండితుడు.

శ్రీః

# అభిప్రాయము

మిత్రులు ఆప్తులునగు శ్రీ చెట్టి లక్ష్మయ్య ముత్తరాజుగారు రచించిన "తెలుగు ముత్తరాజుల సంగ్రహ చరిత్ర" యను గ్రంథమును చదివి సంతసించితిని. ఇరువదిమూడు ప్రకరణములు గల యీ గ్రంథమున రచయిత ముత్తరాజులకు సంబంధించి సమగ్రమైన చరిత్రను పొందుపరచినారు. ముత్త రాజులచరిత్ర అంతగా తెలియనివారికి ఆచరిత్రకు సంబంధించిన విషయాలెన్నో తెలుసుకోగలిగామన్న తృప్తిని కలిగించే ఉత్తమ గ్రంథమిది. అందుచేత దీనిని "సంగ్రహ చరిత్ర" యనుటకంటె "సమగ్ర చరిత్ర"యనుట యుక్తము. ఈ యంశముపై ఇంతటి విపుల గ్రంథము ఇంతకు ముందు వెలువడలేదనే చెప్పాలి. ఇంతటి సమగ్రమైన తెలుగు ముత్తరాజుల చరిత్రను అందించిన ఘనత శ్రీ చెట్టి లక్ష్మయ్య ముత్తరాజుగారికే దక్కుతుంది. ఇది వారి నిరంతర పరిశ్రమకు సాహసోపేతమైన కృషికి ఫలంగా వెలువడింది.

కాలం ఒక ప్రవాహం వంటిది. కాలగమనవేగం వంటిదే చరిత్ర. దేశకాల స్థితిగతుల కనుగుణంగా మార్పులను చేర్పులను సంతరించుకుంటూ ముందుకు సాగిపోవటం సైజం. అది దాని జీవ లక్షణం. మానవజీవన సరళి కూడ అట్టిదే మరి. ఈ మతాలు కులాలు జాతులు అనేవి మానవుడు కుబుద్ధితో సంకుచితమైన దృక్పథంతో స్వార్థచింతనతో తనకు తానుగా నిర్మించుకున్న ఇరుకు వాడలు, ఇనుప గోడలు, ప్రకృతిలోని ఏ వస్తువు కూడ ఏ ఒక్క మానవ ప్రకృతికి స్వంతం కాదు. కారాదు. సృష్టిలోని ఏ వస్తువుకు లేని జాతి మత కుల విభేదాలు మానవునికే ఎందుకు పరిమితమైపోయాయి ? అంటే అక్కడ స్వార్థం, అహం, అధికార దర్పం, సంకుచితత్వం ఇవన్ని స్పష్టంగా గోచరిస్తున్నాయన్నమాట.

"చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః" అన్న గీతాచార్యుని వచనంలో అంతర్వాహికగా సర్వకాల సర్వావస్థలయందును సాగిపోయే సమతా వాదానికి, సర్వ మానవతా సమైక్యతకు, పవిత్రమైన వర్ణ

వ్యవస్థకు వక్రభాష్యాలు వల్లించి, కాలానుగుణంగా ఈవ్యవస్థను కులాల పేరిట జాతి మతాల పేరిట వర్గవిభేదాలు సృష్టించి పవిత్రమైన వైదిక ధర్మానికి కర్మాచరణకు అనర్థాలనుగా ప్రకటించినవారు మనవారే కదా! ఇదిఈనాటిది కాదు. అనాదిగా వస్తున్న ఒక దుష్టసంప్రదాయము. దీనికి అంతం ఎక్కడ? ఎప్పుడు? అనేది ప్రశ్న. ఇది కేవలం ప్రశ్నరూపకంగానే నిలిచిపోతూ ఉన్నది.

మనమేమిటో? మన చరిత్ర యేమిటో? తెలియక అజ్ఞానాంధకారంలో పడి అణగారిపోతున్న ఈ నవ సమాజానికి జ్ఞాన జ్యోతిలా శ్రీ చెట్టి లక్ష్మయ్య ముత్తరాజుగారు అందిస్తున్న గ్రంథము ఈ తెలుగు ముత్తరాజుల సంగ్రహ చరిత్ర.

అందఱకు మల్లె ముత్తరాజులకు కూడ చరిత్ర అంటూ ఒకటుంది. దానిని వెలికి తీసి సమాజానికి అందించాలన్న వీరి చిరకాల వాంచ, తపనకు రూపకల్పనయే ఈ తెలుగు ముత్తరాజుల సంగ్రహ చరిత్ర.

ముత్తరాచ శబ్ద నిష్పత్తి(పుట్టుక) నిర్వచనము - విభిన్న మతాలు వివరిస్తు శ్రీ లక్ష్మయ్య ముత్తరాజుగారు నిర్వచించిన నిర్వచనాలు, వాని ఉపనిపత్తులు మిక్కిలి సమంజసములుగా నున్నవి. ఇందుకై రచయిత ఉదహరించిన వివిధ చారిత్రికాంశాలు, ఆధారాలు, భౌగోళిక నిదర్శనలు, శాసన ప్రమాణాలు వీరి నిశిత విషయ పరిశీలనా దృక్పథానికి తార్కాణాలు. విషయ విశ్లేషణపాటవానికి ప్రతీకలు. ముత్తరాచకులం దాని పుట్టు పూర్వోత్తరాలు అందులోని పలు తెగలు దేశకాలపరిస్థితుల కనుగుణంగా వారు చేపట్టిన వివిధ వృత్తులను గూర్చి సరియైన దృష్టాంతాలతో రచయిత ఈ గ్రంథమున చక్కగా వివరించినారు. ముత్తరాజులు-వారి వంశీయులు రాజ్యాధికారాన్ని చేపట్టి, ప్రజాపాలనము సాగించి తెలంగాణముతోబాటు చోళ-పాండ్య దేశములందు తమ రాచరిక ప్రాభవాన్ని ప్రబలింపజేసి దక్షిణ హిందూ దేశాన్ని పాలించినట్టు సప్రమాణముగా విశ్లేషించినారు. అంతేకాక ముత్తరాజుల జీవనసరళి నైతిక ధర్మనిరతి, వైదిక ధర్మ కర్మాచరణ శీలత, సామాజిక జీవన విధానము, సాంఘికాచార వ్యవహారములు, స్థితిగతులు, వృత్తిప్రవృత్తులు కర్మకాండము, పాండ్యచోళ వంశీయులతోటి సంబంధ బాంధవ్యాలు మున్నగునవి చారిత్రికా

ఆధారాలతో వివరించినారు. ముత్తరాజులకు సంబంధించిన విశేషాంశాల నెన్నింటినో రచయిత ఈ గ్రంథమున విపులముగా చర్చించినారు.

మిక్కిలి శ్రమించి, అనేక గ్రంథములను పరిశీలించి ముత్తరాజుల చరిత్రకు సమగ్రమైన రూపకల్పనచేసి నవసమాజానికి అందించిన శ్రీ చెట్టి లక్ష్మయ్య ముత్తరాజుగారు మిక్కిలి ధన్యులు, పుణ్యులు. వీరి కృషిఫలాన్ని అందుకొని ఆ స్వాదించగలిగే సహృదయులు అంతకు మిక్కిలి ధన్యులు పుణ్యులు.

ఈ గ్రంథము సర్వవిధములుగా పండిత పరిశోధకుల మన్ననలకు పాత్రమై సకల జనాదరణకు యోగ్యమై కలకాలం మనగలదని విశ్వసిస్తు రచయిత శ్రీ చెట్టి లక్ష్మయ్య ముత్తరాజుగారిని భగవంతుడు ఆయురారోగ్యములచే కటాక్షించుగాక యని ఆకాంక్షించుచున్నాను.

తే. 30-4-1988

శఠగోపాచార్యులు

**డా॥ ఎన్. జి. రామానుజాచార్యులు**

ఎం. ఎ. పి. హెచ్. డి.

"ఆండాళ్ నిలయం"

2-2-18556, బాగ్ అంబర్ పేట హైదరాబాదు-500013.

# అభినందన

మిత్రులు చెట్టి శ్రీలక్ష్మయ్యగారి "తెలుగు ముత్తరాజు సంగ్రహ చరిత్ర" 1988లోనైనా ముద్రింప బడుతున్నందుకు నాకు చాల ఆనందంగా ఉన్నది.

సుమారు 20 సంవత్సరాలుగా నాకు లక్ష్మయ్యగారు చిరపరిచితులు. ఎన్నో సందర్భాల్లో శ్రీ లక్ష్మయ్యగారు ముత్తరాజుల చరిత్ర రచనా సందర్భంలో నాతో చర్చించినారు. నాకు తెలిసినంతవరకు 10 సంవత్సరాలక్రితమే వీరి గ్రంథాన్ని పూర్తిచేశారు. ఏ విశ్వవిద్యాలయంలో చదువకున్నా ఏ ఆచార్యునితో పొత్తు లేకున్నా లక్ష్మయ్యగారిలో ఇంతటి అసమాన పరిశోధనా సామర్థ్యం చోటు చేసికోవడం ఒక్కొక్కసారి ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

స్థూలంగా పరిశీలిస్తే ఈ గ్రంథాన్ని మరో సాంఘిక చరిత్రగా పేర్కొన వచ్చును. చరిత్ర, సాంఘిక విషయాలను పరిశోధించే విద్యార్థులకు అధ్యాపకులకు లక్ష్మయ్యగారి గ్రంథం చాల ఉపకరిస్తుందనుటలో సందేహంలేదు.

ఈ సందర్భంగా మరో అంశం ఇచ్చట చెప్పదలచాను--"ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వ నిర్వహణలో" కొంతకాలం నేను సుప్రసిద్ధ చారిత్రకులు కీ. శే. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారికి సహకరించిన సందర్భంలో ఒక నాడు తెలుగు గొంకచోడ రాజుల ప్రసక్తి వచ్చింది. అనుకోని విధంగా శ్రీ లక్ష్మయ్యగారు తన ముత్తరాజుల చరిత్ర లిఖితప్రతిని నన్నొకసారి చూడమని ఆ సమయంలోనే నాకు అందించారు. తెలుగుగొంక చోడరాజుల ప్రసక్తిరాగానే నేను శ్రీలక్ష్మీరంజనగారితో లక్ష్మయ్యగారి ముత్తరాజుల చరిత్రను గూర్చి వివరించాను. ఆ సమయంలో లక్ష్మయ్యగారి గ్రంథాన్ని దానిలో తెలుగు గొంకరాజుల చరిత్రను శ్రీ లక్ష్మీరంజనంగారు స్వయంగా చూచి చాల బాగున్న దని మెచ్చుకున్నారు. ఈ విషయం నేను లక్ష్మయ్యగారికి కూడ ఏనాడూ చెప్పి

నట్లు నాకు గుర్తులేదు. తెలుగుముత్తరాజుల చరిత్ర సుప్రసిద్ధ చారిత్రకులు శ్రీ లక్ష్మీరంజనంగారి మన్ననను కూడ పొందిన గ్రంథం, ప్రామాణికమైనదని తెలుపుటకే ఈ విషయాన్ని ప్రస్తావించాను.

ఈ గ్రంథంలోని ఎన్నో అమూల్యవిషయాలను పాఠకుల ముందుంచాలని నేను భావించాను. కాని నేను నా స్వీయభవననిర్మాణ కార్యక్రమంలో ఉండి అలా చేయలేకపోయాను.

మొత్తం మీద శ్రీ లక్ష్మయ్యగారు అపర భగీరథునిలా ఈ గ్రంథాన్ని రచించి, ఆర్థికవిషయాలను కూడ అధిగమించి ముద్రింపజేయ గలిగినందుకు వారిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను.

ఇట్లు
యస్. జి. రామానుజాచార్యులు
28-5-88

# ప్రశంస

ప్రియమిత్రులు శ్రీ చెట్టి లక్ష్మయ్యగారు నాకు దాదాపు ఇరువది యేండ్లుగా స్నేహితులు ఈ గ్రంథమును ఎంతో పరిశ్రమించి వ్రాసినారు. నేను 1969లో తెలుగువారెవరు ? అని యొక వ్యాసమును ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలో వ్రాసియుంటిని. అది దేశమున చాల సంచలనము చేయగా ఆంధ్ర పత్రికవారపత్రికలో పునర్ముద్రితమైనది. ఆ సందర్భమున నా వ్యాసమును చదివి, తమ మిత్రులకు చూపి, దానిని చిన్న పుస్తకరూపమున, తమ మిత్రులు, వదాన్యులునైన శ్రీ పల్లె పాండురంగారావు ముదిరాజుగారి చేత ద్రవ్యసాయము చేయించి ముద్రింపజేసిరి. అది మొదలు వీరికి ఈ విషయమున పరిశోధన చేయవలయు నను ఆశ ఒక ఆవేశమువలె ఏర్పడి, ఎంతో పరిశోధన చేసి ఇన్నాళ్లకు ఈ గ్రంథమును తయారు చేసిరి.

ఇక్కడ ఒక హెచ్చరిక చేయక తప్పదు. వీరి చారిత్రక పరిజ్ఞానము కంటె వీరి శ్రద్ధ మెచ్చుకో దగినది. ఎటువంటివారి కైనను స్వజాత్యభి ఉండుట సహజము. అది మెచ్చుకో దగినది. ఏ జాతియు తనంతట గొప్పదిగాని తక్కువదిగాని కాదు. వైదిక కాలమునుండియు వారువారు తమ వృత్తులను బట్టి జాతులుగా కుదురుకొన్నారు. మొదట చాతర్వర్ణ్యముగా నుండి తర్వాత పద్దెనిమిది కులాలుగా తయారైనది. ఎవరి వృత్తిలో వారు పండితులు. శూద్రశబ్దమునకు తక్కువ కులము వాదను నర్థములేదు. సంస్కారములేని అనగా ఉపనయనముకాని వాడు, బ్రాహ్మణుడైనను శూద్రుడే. అనగా వైదిక సంస్కారము లేనివాడు, అది నూనుకొన్నవాడు, శూద్రకుడని ప్రాచీన చక్రవర్తి, మృచ్ఛకటికానాటక రచయిత, ద్విజుడు, కర్షకునికి వైదిక కార్యములకు అవకాశము లేదు గదా. బ్రాహ్మణులలోనే కొందఱు కార్మికులై విశ్వబ్రాహ్మణులు కాలేదా ! కొందరు బ్రాహ్మణులు రాజమంత్రులు, సేనాపతులునై నియోగిబ్రాహ్మణులని ప్రత్యేకింపబడలేదా, కొందరు క్షత్రియులై అన్నదమ్ములనే ద్వేషింపలేదా, ఇవన్నియు వేలసంవత్సరముల పరిణామముగాని ఒకరు చేసినవి కావు. హిందూమతద్వేషులు

మనలో చీలికలు పెంచుటకు ఇదంతయు ఒక జాతివారి చిద్విషమని ప్రచారము చేయగా మన అనూయక ప్రజలు నమ్ముచు వచ్చినారు కాని కొందరు బుద్ధి మంతులు మేలుకొన్నారు.

అట్టి విద్యావంతులలో మన ముదిరాజు లొకరు. వారిలో మిన్న మన చెట్టి లక్ష్మయ్యగారు, వీరిది చారిత్రక దృష్టి. మన ముదిరాజులు ఇప్పుడున్నట్లే అనాది కాలమునుండియు నుండిరా, లేక క్రమముగా మారిపోయినారా, వీరి భాష ఆదినుండియు తెలుగాకాక మారినదా, వీరి వృత్తియేది, క్షత్రియులు కారా? ఇత్యాది జిజ్ఞాస. వీరికి కొంతముందు ఆంగ్ల విద్యాభ్యాసము చేత కొంతరికి కలిగినది గాని వీరిలో అది ఉత్తేజము పొంది ముదిరాజ సంఘమందే ఒక నూతన చైతన్యమునకు కారకమైనది. వీరి సాంఘిక సేవ మెచ్చుకో దగినది.

ఈ గ్రంథములో దాదాపు 190 పుటలలో ఇరువది మూడు ప్రకరణాలము లలో, వీరు వైదిక కాలమునుండి నేటివరకు జరిగిన పరిణామములను, తెలిపి నారు ప్రాచీన తమిళదేశ చరిత్రలోని చేర చోళపాండ్య రాజులనడుమ సామంతులుగ నుండి, తుదకు ఒక వెలుగు వెలిగిన కొడుంబాలుర్ (తంజావూరు రాజధానిగా) ముత్తరైయర్ రాజుల చరిత్రను సంగ్రహించినారు. వీరు క్రమ ముగా క్షీణించి ప్రజాసామాన్యములో కలిసిపోయి తెలంగాణమునకు వ్యాపించి రని, కాకతీయుల కాలములో ఓరుగంటిలో 6500 ఇండ్ల తెలుగు వారుండిరని, ఇతర రాజకుటుంబాలవారితో వీరికి ఉండిన సంబంధ బాంధవ్యములు–ఇత్యాద్య నేక విషయములను చర్చించినారు. తెలుగు బ్రాహ్మణులలో కూడ ముత్తె రాజను ఇంటి పేరు గలవారున్నారన్నారు. నిజమే, ఈ విధముగా లెక్కలేని సంగతులను గుప్పించియున్నారు. ఆధార విషయములను చాల వానిని చూడ వచ్చును.

కాని ఈ గ్రంథమంతయు విశ్వవిద్యాలయములలో తయారైన చరిత్ర కారులకు వట్టి ఊహలుగా కనబడవచ్చును కారణము రచనా విధానము. వీరు ఆంగ్లములో బి. ఏ కారు. తెలుగులో పండితులును కారు. స్వయంకృషి వలన ఇంత ఎత్తుకు ఎదుగ గలిగినారు. అదియే ప్రధానముగా మెచ్చుకోదగినది.

మరి వీరి రచనలో పొరపాట్లు అనగా చారిత్రక విరుద్ధ విషయములుండ వాయన్న ఉండవచ్చు. అది వారి వారి చారిత్రకజ్ఞానమును బట్టి ఏర్పడును.

మద్రాసు శబ్దమును ముందరాజశబ్దమునుండి సాధింప యత్నించినారు. అట్లుండి ముంద్రాస్, ముద్రాస్ కావలెనుగాని మద్రాసెట్లగును. ముత్తు శబ్దము ముత్తు కుమారస్వామి ఇత్యాదులలోనిది ముత్యములకు సంబంధ పడి యుండవచ్చును. కాని ఇది ముద్దు శబ్దము-ముద్దుపళని, ముద్దళగిరి, ముద్దుకృష్ణలోని ముద్దు శబ్దము తమిళములో అక్షరదారిద్ర్యము చేత ముత్తుగా మారియుండరాదా. కృష్ణదేవరాయలను గురించి వ్రాయుచు ఒక చారిత్రక ప్రమాదమునకులోనై నారు. ఓరుగల్లు 1323లో పడిపోయినదనియు, ఆసమయమున సాళువ నర్సింహ రాయలు పరిపాలనకు వచ్చెననియు వ్రాసినారు. చాల పొరపాటు. 1336లో విజయ నగర స్థాపన జరిగి 1485 వరకు చాల మంది సంగమవంశపు రాజులు పరిపాలించిన తర్వాత సాళువనరసింహ రాయలు రాజ్యమును హరించెను. 150, సంవత్సరములకు తర్వాతి విషయము. రాయలవారి ఆ ముక్త మాల్యద లో విరుదాహరించిన పద్యమునకు వీరు వ్రాసినయర్థము కుదురదు. 'ముత్తారి వీర' ను-వీరు ముత్తరివీరగా దిద్దినారు. అర్థము పొసగదు, ముది = మదించిన, అరి = శత్రువువైన, వీర = వీరులను, ఖండించినవాడని రాయలకు అన్వ యము, తుళువరాజులకును ముదిరాజులకును సాజాత్యము కానరాదు.

యయాతి రాజును ముదిరాజులతో కలుపుట చరిత్రకాదు. అది పురాణ కాలము భాగవత, భారతరామాయణములుగాని పదునెనిమిది పురాణములు గాని నికరమైన చరిత్రకు పనికిరావు. వానిలో పాఠభేదములేగాక ప్రకరణ భేదములు కూడ కోకొల్లలు, వీనిలో తర్వాతివారు తమకు తోచిన ఉపాఖ్యాన ములను వ్రాసి చొప్పించినారు. ముదిమిన ధరించిన రాజు ముదిరాజా. నాటి భాషలో ఈ శబ్దమునకు తావుండెనా, ఆది నుండియు ముదిశబ్దమేగాని వేరొక శబ్దము కనబడదే, తమకు తమిళము తెలియనందువలన, ఇంగ్లీషులోచూచి వ్రాసి కొన్న తమిళపదములు తప్పులుగా పడినవి. కొడుంబాలూర్ అన్నది కొడుంబ లూర్ గాను, అంబలక్కారన్ అన్నది అంబలక్కారన్ అనియు ఈ విధముగా నున్నవి. పరవాలేదు, క్షమింపదగినవి.

ముదిరాజులు క్షత్రియులుగా నుండి మార్పునందినవారన్నది ఒప్పుకోదగి యేయున్నది. మనకు మౌర్యులకు ముందు చరిత్ర కుదురదు. మౌర్యులకు ముందే క్షత్రియులు నశించిరనియు. మౌర్యులు శూద్రులనియు ప్రాచీన గ్రంథములు

చెప్పుచున్నవి. తర్వాతి రాజవంశములకు ఆకాలపు బ్రాహ్మణులు సూర్యవంశ మని, చంద్రవంశమని, అగ్నికుల మని క్షత్రియవంశవృక్షములు నిర్మించినారు. ఇటు వంటి పల్లవ, చాళుక్య, చోళ, పాండ్యరాజ వంశములతో సాజాత్యము గలిగిన ముత్తరాయర్లు వారికి ఎందులోను తగ్గి పోయినవారు కారు. ఇప్పుడు దేశములో ఆ చాళుక్య, చోళ, పాండ్య, పల్లవాదుల సంతతి వారేరీ, వారందరు పోయి, ముదిరాజులుండుట గొప్పవిశేషముగాదా, వీరొక రాజవంశమువారే, రాజ్యమునేలినవారే. ఇంకను పరిశోధించి వీరి చరిత్రను చక్కగా వ్రాయవలసి యున్నది.

ఈ పని సులభసాధ్యము కాదు, దానికి ధనము, ఊరూరు తిరిగి భాండా గారాన్వేషణము ఓపిక, ఉత్సాహము ఉండవలెను. శ్రీ చెట్టి లక్ష్మయ్యగారు తమ శక్తి సామర్థ్యములు పరిమితములని ఎఱిగియుండియు ఇంత దూరము పరి శ్రమించి తమకు దొరికిన, తాము సేకరించిన వస్తుసామగ్రినంతయు చదువరుల ముందు పెట్టు చున్నారు. యువకులు, విద్యావంతులు వీరి రచనను చదివి ఆమోదించినను, ఆక్షేపించినను, రెండు విధముల మంచిదే. ఎందులకనగా వివాదమువలన గదా నికరమైన విషయము తేలును. కాబట్టి యువతరము వారికి మానసోల్లాసము కల్గించుటయే ప్రధానోద్దేశము. ఇంత కృషి చేసిన వీరిని ఎంత శ్లాఘించినను తనివి తీరదు. వీరింకను కృషి చేయుటకు వీరికి భగ వంతుడు ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగుగాకయని ఆసించుచున్నాను.

మదరాసు. వేదము వేంకటరాయశాస్త్రి

# అభిప్రాయము

కాశబోయిన దామోదర్, తేది. 5-6-88

గౌలీపురా, హైద్రాబాదు.

భారత దేశములోని వెనుకబడిన తరగతులలో ఒకటైన ముదిరాజకులము యొక్క పుట్టుపూర్వోత్తరాల గురించి "తెలుగు ముత్తరాజుల సంగ్రహ చరిత్ర" అను పుస్తకమును వ్రాసి సికింద్రాబాదు వాస్తవ్యులైన శ్రీ చెట్టి లక్ష్మయ్యగారు ముదిరాజులందరికి గొప్ప సేవ నొనర్చినారు. ఆర్థికముగ, సాంఘికముగ మరియు విద్యా విషయికముగ వెనకబడి యున్న ఈ కులము వారికి ఈ గ్రంథము కనువిప్పు కలిగించుననుటలో సందేహము లేదు.

నాటి ముత్తరాచలు, తెలుగలు, మృద్రవాచలు, కోలీలు మన్నెవారు మొదలగు నామములతో, నామాంతరములతో ముదిరాజులు నేటికి మన దేశము లోని వివిధ ప్రాంతాలలో వివిధవృత్తులు కలిగి వ్యాపించి యున్నారు. వీరు పాండవసంతతి వారనియు వీరి వంశము చంద్రవంశమనియు, వీరి గోత్రము భరద్వాజ గోత్రమనియు రచయిత తగు ఆధారములతో వివరించినారు. వీరికి అనేక వృత్తులున్నాయనుట సుస్పష్టము. పాలెగార్లగ, వేటవాండ్లగ, రైతులుగ, వర్తకులుగ, గ్రామాధికారులుగ, సామంతులుగ, మరియు రాజులుగ వీరికి వివిధములైన విధులు, వృత్తులు, హోదాలు యుండి ఉండెనని రచయిత పేర్కొనుట సమంజసము

దేశకాల పరిస్థితుల కనుగుణముగ ముత్తరాచలు అనాదిగ మన దేశము లోని గ్రామాలలో, కొండలలో, నదీ పరీవాహక ప్రాంతాలలో, పట్టణాలలో మరియు మహానగరాలలో తమ అస్తిత్వాన్ని గౌరవ ప్రదముగ నిలబెట్టుకొని సంఘానికి పునాదిరాళ్లవలె తమ శక్తి సేవల నొసగిరనుట ఎంతో ముదావహము,

ఈ పుస్తకమును రచించి రచయిత ఒక గొప్ప యజ్ఞము గావించెనని నేను భావిస్తున్నాను. ఆయనకు నా హృదయ పూర్వకమైన అభినందనలు.

మున్ముందు ముదిరాజ యువకులు విద్యావంతులు రచయిత యొక్క స్ఫూర్తినందుకొని ఇట్టి యజ్ఞాన్ని కొనసాగించి క్రొంగ్రొత్త విషయాలను జోడించి తగు విధమైన చేర్పులు మార్పులు చేసి ఈ పుస్తకాన్ని సంపూర్ణమైన మహా గ్రంథముగ రూప కల్పన కావించెదరని ఒక ముదిరాజుగ నేను ఆకాంక్షిస్తున్నాను.

వయోవృద్ధులైన చెట్టి లక్ష్మయ్యగారు ఎంతో ఓర్పు మరియు సహనముతో ఇట్టి రచనను గావించుట ముదిరాజుల దీక్ష కొక నిదర్శనము దృఢమైన సంకల్పముతో నిశ్చలమైన సాధనతో ఇట్టి శుభప్రదమైన కావ్యరచనలో సిద్ధిని పొందుట అపూర్వము.

ప్రతి ముదిరాజవ్యక్తి "కులము నాకేమి చేసినదని తలంపక కులానికి నేను చేసిన సేవ ఏమిటని" ఆలోచించ వలసిన అవసరము ఈ నాడు ఎంతైనా ఉన్నది. అట్టి దృక్పథము కలిగి కులప్రతిష్ఠకు మరియు కులాభి వృద్ధికి పాటు పడినప్పుడే కులము మూడు పూవులు, ఆరు కాయలుగ వికసించును. శ్రీ చెట్టి లక్ష్మయ్యగారు పుస్తకరూపములో కులానికి చేసిన సేవ అమూల్యమైనది. వారికి ముదిరాజులందరు చాలా ఋణపడి ఉంటారని నా అభిప్రాయము

ఇట్లు

కాశబోయిన దామోదర్

ఓం

# తొలిపలుకు

## తెలుగుముత్తరాజుల సంగ్రహ చరిత్ర

దేశచరిత్ర జాతిచరిత్రయొక్క ఆవశ్యకత అధికంగా ఉన్నది. ఏదేశపు ప్రజలకైన, జాతీయతాజ్ఞాన మేర్పడుటకు, వారికి అనాది నుండి వచ్చిన నాగరికతయొక్క వ్యక్తిత్వమే కారణము. తన దేశము తన కులము యొక్క పురాతన చరిత్ర, నాగరికత యొక్క జ్ఞానము వల్లనే మానవునకు తనయందు, తన దేశమందును, తన జాతి యందును విశ్వాసము, ఆత్మ గౌరవము కలుగును.

మనకులములకు సరియైన చరిత్రలంటూ లేవు. చరిత్రాత్మకము లైన గ్రంధములు యున్నట్లు కనబడవు. కాని కులములు వృత్తులతో అవినాభావసంబంధము కలిగి ఉండుటచేత వారి వారి కులచరిత్రలు ఏ సూర్యవంశమునకో, చంద్రవంశమునకో, లేక రాజుల పేరునుబట్టి వారివంశమనియు, లేక ఋషివంశము వారనియు, లేక దేవతలపేరుతో చూపుచు వ్రాసిన వారు బహు కొలదిగాను, విద్యావంతులు గలవారు, వారి వారి కుల మును - నాగరికతజూపుతు పైచూపినవారికి అంట కట్టుచుచూపినవియే కనబడుచున్నవి. కాని అంత నమ్మదగినట్లు కన బడుట లేదు. ఈ జను లలో ఆదినుండి వృత్తితో వచ్చిన వారు కలరు. అట్టి జనులలోని వారు తెనుగువారు లేక తెలుగు ముత్తరాజులు. అనగా (ముదిరాజులు)గా, వారి చరిత్ర వ్రాయుటకు సాహసమే. ఐనను పరమపితయగు, పరమాత్ముడు శక్తినొసంగినందువల్ల సాహ సించి, సంకలనముచేసి వ్రాయడమైనది.

—)x(—

# కృతజ్ఞతలు

కుల చరిత్రలు, సాంఘిక చరిత్రలు, జాతి చరిత్రలు అన్నీ చరిత్రలో అంతర్భాగాలే భారతజాతీయ జీవనంలో వివిధ వంశాలకు చెందినవారు వివిధ రీతులుగా దేశానికి సేవ గావించిన వారున్నారు. అట్టి వారిలో ముత్తరాజులు_ ముదిరాజుల సేవలుకూడ జాతీయ ప్రవంతిలో తక్కువేమీ కావు అనాదిగా వర్ధిల్లుతూ దేశానికి పలుగంగాలలో సేవలనందిస్తూ తమ జీవితాలను ధన్యాం కావించకొన్న ముదిరాజుల చరిత్రను రచించుట దేశ చరిత్రను రచించుట వంటిదే.

దాదాపు పది సంవత్సరాల నిరంతర పరిశోధన, పరిశీలన ఫలితంగా వివిధ సంధర్భాలలో ఆప్తుల, మిత్రుల విద్యార్థిగుల సహాయ సహకారాలతో నేడు తెలుగు ముత్తరాజుల సంగ్రహ చరిత్ర రూపుదిద్దు కొన్నది. ఆయా సందర్భాలలో నాకు అపూరూప సహకారాలనందించిన ఈ గ్రంథ పరి సమాప్తి తోడ్పడిన వారెందరో మహానుభావులున్నారు.

ముదిరాజుల చరిత్ర ప్రధానంగా తమిళ గ్రంథాలలో లభిస్తున్నందు వల్ల ఒక్క పోష్టుకార్డును మదరాసువ్యాస్త్రవ్యులు స్వర్గీయ వదన రాజుగారికి వ్రాయగానే వారు నాపై దయతో కొన్ని ముత్తరాజుల చరిత్ర రచనకు ఉపయోగించు కొన్ని తమిళ గ్రంథాలను, చరిత్ర గ్రంథాలను కూడ నాకు అందించినారు. వారికి నా హృదయ పూర్వక జోహార్లు అర్పిస్తున్నాను. విశ్వ నాధ మరియు నన్నె చోడుల పద్యపాదాలలో జరిగిన శుద్ధ ప్రమాదాలను రెండవ ముద్రణలో సరిచేయగలనని విన్నవించుకొంటున్నాను.

తెలుగు వారెవ్వరు ? అను వ్యాసం ద్వారా నా రచనకు స్ఫూర్తి కలిగించుటే కాక నేను సంప్రదించిన వివిధ సందర్భాలలో నా రచనకు లో దృఢ అమూల్య విషయ పరిజ్ఞానమును అందించి స్వయంగా నా కృషిన్ని ఓపికతో పరశీలించి ఎన్నో సూచనలనుచేసి ఈ గ్రంథపరిసమాప్తికి శ్రీ వేదంవేంకటరాయ శాస్త్రి (జూనియర్) గారు తోడ్పడినారు. వారిప్రశంస దీనికి ప్రకటించినారు.

ఈ సందర్భంగా మొదట్లో నేను దర్శించిన వివిధ గ్రంథాలయాలను నాతో పాటు దర్శించి విషయ సేకరణలో తోడ్పడినవారు మిత్రులు, ఆప్తులు శ్రీ బండారి సత్యనారాయణగారు

కీ. శే. అన్నె కేశవ ఆర్యాశాస్త్రిగారు సైతం ఈ గ్రంథ రచనకు తోడ్పడు ఎన్నో ఆధార గ్రంథాలను, చరిత్ర గ్రంథాలను సమకూర్చినారు.

చిత్తుప్రతిని ఓపికతో పరిశీలించి తమ అమూల్య సలహాలతో నా రచనకు విద్యావేత్తలు డా॥ ఎస్. జి. రామానుజా చార్యులు ఎం. ఏ పి. హెచ్. డి. గారు వన్నెలు కూర్చి సహాయపడుటే గాక దీనిలో అభినందన రూపంలో తమ అభిప్రాయాలను ప్రకటించినారు.

కీ. శే. పిట్టల రాజేంద్ర ముత్తరాజు (ముల్కి) గారు తమ జీవిత కాలంలో సేకరించిన తెలుగు ముత్తరాజుల చరిత్రకు ఆధారాలైన గ్రంథాలను నాకందించి చరిత్రరచనకు తోడ్పడినారు.

ప్రముఖ గాంధీయవాదులు, స్వాతంత్ర సమరయోధులు గ్రంథాల యోద్యమ నాయకులు శ్రీ కోదాటి నారాయణ రావుగారు ఈ రచనను ఓపికతో పరిశీలించి పరిచయ రూపంలో తమ అమూల్యమైన నూతన అభిప్రా యాలను ప్రకటించి దీనికి వన్నెలు కూర్చినారు.

ప్రముఖ విద్యావేత్తలు, ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖ అధి పతులు ఆచార్య డా॥ మడుపు కుల శేఖరరావు ఎం.ఏ. పి. హెచ్ డి. గారు దీనిని పరిశీలించి అభినందన రూపంలో తమ అమూల్య అభిప్రాయాలను ప్రకటించి నారు.

ప్రముఖ నవల రచయితలు బహు గ్రంథ పరిశీలకులు సినీసాహిత్య వేత్తలు శ్రీ దాశరధి రంగా చార్యులుగారు "మనలో మాట రూపంలో తమ అభిప్రాయాలను ప్రకటించి దీనికి నూతనత్వాన్ని కల్పించారు.

స్వర్గీయ మిత్రులు శ్రీ ప్రతివాది భయంకరం భాష్యకారా చార్యులు బి. ఓ ఎల్ (సంస్కృతం) ఎం. ఓ. ఎల్ (తెలుగు) గారు మొట్టమొదట దీనిని చదివి "అభిప్రాయము" రూపంలో ప్రతి ప్రకరణమును పరిశీలించి తమ అభి ప్రాయమును వివరించినారు.

అభిప్రాయముద్వారా దీనిలోని అంశాలను శ్రీ శఠగోపాచార్యులుగారు తేటతెల్లం చేసినారు.

తమిళాంగ్ల గ్రంథాలకు తెలుగు అనువాదలను కూర్చి తోడ్పడిన మిత్రులు శ్రీ సేతురాం శ్రీ రంగారావు, శ్రీ చంద్రమౌళి, శ్రీ భాస్కరశర్మ మరియు కీ. శే సిద్ధాంతి రామయ్య మున్నగువారున్నారు ముత్తరయర్ నాడు యొక్క పఠము (మ్యాప్) వ్రాసిన వారు శ్రీ పి దుర్గయ్య ముతరాజు, మరియు ఈ గ్రంథమునకు ముఖ చిత్రమును చిత్రించినవారు శ్రీ డి. టి. లోహిత్, వన్నె తెచ్చిరి.

ఈ విధంగా వివిధ సందర్భాలలో నాకు సహాయ సహకారాలందించి తోడ్పడిన ప్రముఖ విద్యావేత్తలకు, మిత్రులకు, అభిమానులకు పఠము ముఖ చిత్రము అందించిన వారికి నాహృదయ పూర్వక కృతజ్ఞతా పూర్వక నమస్కృతులను సమర్పించుకొనుచున్నాను.

ఈ తెలుగు ముత్తరాజుల గ్రంథం అచ్చువేయుటకు ఆర్థికంగా తోడ్పడి సహాయ సహకారాలందించిన వారందరికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాను.

చెట్టి లక్ష్మయ్య

రచయిత

# సంక్షిప్త పరిచయము

**ముత్తరాచకులము :** ముత్తరాచకులము శబ్ద నిర్వచన, అర్ధములో కూడు కొనియున్న ఈ ముత్తరాచకులము లేక తెగల గురించి శ్రీ ఎడ్గర్ థ్రస్టన్ పండితుడు, దక్షిణ భారత దేశము తెగలు మరియు కులములు అనే గ్రంధమందు నీవిధముగా చూపెను.

ముత్తరాచ అనే పేరు స్వల్ప భేదముతో ముత్తరాచ, ముత్తిరాజులు, ముత్తరాసర్, మరియు ముత్రాచలని కూడ కలదని వ్రాయబడినది. మరియు నిజాం రాష్ట్రము కులములు లేక తెగలును, శ్రీ సర్ సిరాజుల్ హాసన్‌గారు వీరిని గురించి ఈ విధముగా వ్రాసినారు. ముత్రాసి, ముతరాజ లేక మోది రాజ, కోలీ, నాయక్, బంటు, తెలంగోడ్, తెనుగోడ్, తెలగ, ఒక పెద్ద వ్యావసాయ ముని వేటాడువారు.

తెలుగుదేశములో ఈ కులము పైన పేర్కొనబడిన యేదైన ఒక పేరుతో నున్నది. తమిళదేశములో ఈ కులమువారికి ముత్తరయర్, పళయకరన్ లేక (పాళెగార్లు) అని పేరు గలదు. ఈ ముత్తరాజులు పాండవవంశమునకుజెందిన వారుగా తెలుగు ముత్తరాజులు లేక (ముత్తరాచలు) :- ముత్త అనగా పూర్వపు లేక ముది, యనియు, -రాచ అనగా రాజు, అనియును అన్వయించవచ్చును. ముత్తరాచలనే ముదిరాజులనికూడ వ్యవహరించిరి. ముత్తశబ్దము- ముది యగుటలో ప్రతిపత్తిలేదు. ఇక రాచ-రాజు శబ్దములు ఒకటే కదా! ముది లేక (ముడి) శబ్దమునకు తమిళమున కిరీటమను అర్ధము కలదు. కనుక ముత్తరాచలు సార్వభౌమాధికారము గల కిరీటధారులగు రాజులు అను అంశము కూడ నిరూపితమగుచున్నది, ముత్తశబ్దమునకు పూర్వమనియును అర్ధము చెప్పుకొనవచ్చును అప్పుడు ముత్తరాచలనగా పురాణా రాజు (పూర్వపు రాజు)లను అర్ధము వచ్చును. అనగా ముత్తరాచలు పురాతనులైన రాజవంశమువారని తేలినది. ఇదియేగాక (పురజనులలో) మాదిగవారిండ్లలో వివాహము జరిగినప్పుడు (ఆకు-పోక) అనగా 'విడము' ముత్తరాచలగురించి మర్యాదసూచకముగా నుంచువారు. తెలంగాణ గ్రామములందు విజయదశమి నాడు ప్రభుత్వముజెండావద్ద ఒక మేకను తన కత్తితో బలి చేయుట వీరికి ఆచారము గలదు. ఆమేకను, చాకలి వెనుక కాళ్ళు పట్టుట, మంగలి ముందు కొమ్ములు పట్టుట గలదు- గ్రామ కరణముగారు వచ్చిన పెద్దలకు

కులచౌదరిలకును, మరియు పెద్దముత్తరాచవారికి మర్యాద సూచకముగా ఇతర సుగంధములతోపాటు విడమును ఇచ్చుట ఈనాటికి కలదు. అంటే వీరు పెద్ద మర్యాదకులమువారని తేలినది. ఇదియునుగాక ముత్త అనగా ముత్యము (ముక్త) -రాచ-రాజు అనగా అధిపతులు, అనగా ముత్యములవలె స్వచ్ఛత కలిగే సత్ చరిత్రులైన రాజులనియు మరియు ముత్యములను తీసి విక్రయించేటి వారిపై ఆధిపత్యము కలిగియుండేవారని ముత్తరాచలను అందురు. ముత్త రాచ-ముత్తరయర్ = ముత్యములకు ముత్తు + అరైయర్ - రాజు కాన ముత్తరయర్ అనగా ముత్యములు దొరుకునట్టి పాండ్యదేశమునకు అధి పతులు యని అర్థము. లేదా చేర, చోర, పాండ్యరాజ్యములను మూడింటిని జయించిన కారణమున ముత్తరయర్ (తరై - ధర భూమి - రాజ్యము) మూడు రాజ్యముల కధిపతులని పేరు వచ్చియుండవలెను. లేక ముత్తరాజు అనగా రాజులలో ముఖ్యుడుగా యని యుండవలెను. మరి వీరు తెలుగుదేశము నుండి పోయి చోళ, చేర, మరియు పాండ్యరాజులను ఓడించి, మూడు రాజ్య ములను ఏలినట్లు శాసనములవలన కనబడుచున్నది. ముత్తరాచల పూర్వాపర ముల నించుక పరిశీలించవలసియున్నది. వీరి చరిత్రము ఎచటనుండి మొద లగునో, ఎచట అంతమగునో తెలుపుట కష్టసాధ్యము. దీనికి నేటివరకు వెలసిల్లిన సుప్రసిద్ధ చారిత్రక గ్రంథములు కూడ మిక్కుటముగా పేర్కొనలేదు. తామర ఆకులపైని. జలబిందువులవలె వీరు చరిత్రలో అచ్చటచ్చట మిలమిల లాడుచుందురు. ముత్తరాచలు ఏచోటినుండి వలస వచ్చినది సుందర భరతా వనిలో ఎచ్చటెచ్చట పాదుకొని ఉండిరో కూడ తెలుపుట ఇంచుక ప్రయా సమే యగును. మరి వీరిని కృతయుగమున, ముద్రవాచ లేక (ముద్రరాజ) యనియు రామాయణ కాలమునకు పూర్వము వేదకాలమున కనబడుచున్నది. తర్వాత (ముంద్రా) ముందాయని త్రేతాయుగమున కనబడిరి. ఉత్తరభారత ములో ముంద్రాజ్ లుగా కనబడుచున్నారు. ఇదియేగాక కులకట్టు ధర్మశాసన ములో "మృత్ రాచ" యని కలదు. ఈ శాసనము ౧౪వ శతాబ్దమునకు చెంది నది. ఈ మృత్ రాచనే 'ముత్తరాచలు' గా పిలువసాగిరి. శ్రీ హెచ్. ఎ. స్టూఆర్టుగారు ముత్తరాచలగురించి ఈ విధముగా వ్రాసియున్నారు. ఈ కులము వారు తెలుగువారుగా పేర్కొనబడియున్నారు. ఈ విజయనగరరాజులు - ముత్తరాజులను సరిహద్దుప్రాంతములను రక్షించుటకు కాపలదారులుగా నియ

మించిరి. వారికి "పాళెగార్లు" అని బిరుదము నిచ్చిరి. ముత్తరాచ అను పదము నకు మరియు ద్రవిడభాషలో 'ముది' అనగా ముసలి లేక (పూర్వపు) మరియు 'రాచ' అనగా 'రాజు' లేక పరిపాలించువాడు. ఈ ప్రకారముగా తెలుగు దేశముయొక్క యేదైన భాగమును పరిపాలించినవారు ముత్త రాచలుగా పేర్కొనబడిరి. నేటికి చంద్రగిరిలో (దొరలు)గా చలామణి అయ్యేడివారు. పాళేగార్ల పాలనక్రిందవున్న చాల గ్రామములలో ముత్తరాచవారే పాళె గార్లుగా పరిపాలించెవారు. ఈ ముత్తరాచలు తెలుగుదేశమునుండి తమిళ నాడుకు వలసపోయినవారిలో మొట్టమొదటి కళభ్రలు లేక కళభ్రప్రభువులుగా పల్లవచరిత్రలో కనబడిరి. ఈ కళభ్రప్రభువులు మొదటి శతాబ్దమునకో లేక రెండవశతాబ్దమునుండియో, వీరు ముత్తరయర్ రాజులుగా పిలువబడు చున్నారు. వీరు కళభ్రజాతికి జెందినవారని, వీరుండేచోటు ప్రస్తుతపు 'కాళహస్తి' నుండి ఏవిధముగా రాజులుగా మారి దక్షిణాదియైన మధురైకు వలస పోయినకాలము క్రీ. శ. ౨౦౦ నుండి ౬౦౦ వరకు, చోళదేశము, పాండ్య దేశమును పరిపాలించిరని కనబడుచున్నది. ఈ కళభ్రలు అరవై ముగ్గురు శైవభక్తులలోని మూర్తినయనార్ యొక్క సంతతివారని తెలుపుకొనిరి. ఇక్ష్వాకులరాజైన విజయాలుడు మధురైకి వచ్చినప్పటికి, ముత్తరవంశమురాజు యుండినట్లును, మరియు ముత్తరవంశ కన్యను వివాహమాడినట్లు కనబడు చున్నది. ఈ మూర్తినయనార్, ముత్తరవంశీకుడై యుండవలెను. ఇతనుకర్ణా టకుడనియు, శ్రీ వెంకయ్యగారు తెలిపిన విషయమును శ్రీ ఎ. నీలకంఠశాస్త్రి గారు చూపిరి. ఈ కళభ్రలలో ప్రఖ్యాతి జెందిన రాజులు.

బుద్ధదత్తుడను బౌద్ధసన్యాసి పాళీభాషలో వ్రాసిన అభిదమ్మవత్తరం అను పుస్తకమును బట్టి "అచ్యుతవిక్రమత్తమ్" అను కళభ్రరాజు చోళనాటని, పుహార్‌ను రాజధానిగా చేసుకొని పరిపాలించెను. పెరియపురాణమును బట్టి "కుట్రువ-నయనార్" కళభ్రరాజనియు, ఇతను శివునిచే కిరీటమును ధరించి ఆశీర్వదించబడినవాడు అని తెలియుచున్నది. తర్వాత ఇతను సన్యాసము స్వీక రించెను. ఇతను సౌత్ ఆర్కాటు (**South Arcot**) పాలించెను. మరియొక సన్యాసి 'ఇడైయన్ కలి-నయనార్'. ఈయనకూడ కుదంబలూరును పరిపాలిం చిన కళభ్రరాజనియు తెలియుచున్నది. పెరియపురాణము. తొండైపురాణము మాదిరిగ, శైవపురాణము తెలుగు శైవభక్తుడైన పాల్కురికి సోమనాథుడు

రచించిన (బసవపురాణము)లో ఇద్దరు శైవభక్తుల గురించి వ్రాసినకథలలో జాతి వాచకముగా ప్రయోగించియున్నాడు. ఇది చరిత్రకు అందినను అందకపోయినను ప్రత్యక్షముగా కనబడుచున్నది. 'తెలుగు జోమ్మయ్య లేక బొమ్మయ్య మరియు కన్నప్పగార్లు'. శ్రీ జోమ్మయ్య శ్రీశైల మల్లికార్జునుని పూజించేవారు. వారిది కళ్యాణదుర్గము. శ్రీ కన్నప్ప కాళహస్తి దేవుని పూజించేవాడు. అతనిది కాళహస్తి కొండ ప్రాంతమువాడని చూపియుండిరి. వీరేగాక ఓరుగంటిలో తెలుగువాండ్రు ౬౫౦౦ ఇండ్లవాండ్రు ఉండిరని పేర్కొనబడినది. కళభ్రలు క్షీణించినతర్వాత పాండ్యులతోను మరియు పల్లవులతోను కలసి సామంతులుగా నుండినట్లు కనబడుచున్నది. వీరి తర్వాతవారే ముత్తరయర్లు, అనగా ముత్తరాజులు లేక ముదిరాజులు, పల్లవసామంతులైనవారు, పాండ్యులను జయించి మధురై నేలినవారిలో పెరుంబిడుగు "ముత్తరయన్ – (అలియాస్) సువరన్–మారన్ ప్రసిద్ధుడు." వీరు ముత్తరాజులు అనగా ముదిరాజులు. మూడుతరములవారు, వీరు పల్లవ సామంతులైయుండి పాండ్యులను అణచిపెట్టియుండినట్లు తెలియుచున్నది. చందలై (తంజావూరు జిల్లా)లో దొరికిన దేవాలయశాసనముబట్టి, ఈ కళభ్రలే తర్వాత ముత్తరయర్లు అని పిలువబడిరనియు, చోళనాటిలో పరిపాలించిరనియు తెలియుచున్నది. ఈ చందలై శాసనము బట్టి దేవాలయస్థంభము మీద చెక్కబడిన రాజుల పేర్లు ఈ విధముగానున్నవి. (౧) శ్రీ పెరుంబిడుగు ముత్తరయర్ (అలియాస్) కువహన్ మారన్ (౨) శ్రీ ఇలంగోవతి అరైయన్ (అలియాస్) మారన్ – పరమేశ్వరన్. (౩) శ్రీ పెరుంబిడుగు ముత్తరయన్–11 (అలియాస్) సువరన్–మారన్. ఈ మూడవ రాజుకు ఇతర బిరుదులు, శ్రీ మారన్, శ్రీ కళ్వార్ కావలన్, శ్రీ శత్రుకేసరి, శ్రీ కళభ్రాకావలన్, శ్రీ అభిమానాధిరాన్, అతిసాహసాన్, తమరలైయాన్ శ్రీ శేరుమారన్, వెల్ మారన్, వన్ మారన్, మరియు సత్తాన్ మారన్, యని యుండెను. యుద్ధములు అయినతోడే ఈ పైయుద్ధనామములు ధరించియు, పెక్కు విధముల పేర్కొనబడియున్నాడు. ఈ రాజులు పాండ్యులను జయించిన వెంటనే 'మారన్' అనుపేరు పెట్టుకొనిరి, ఇక్కడ మూడవరాజునకు శ్రీ కళభ్రకావలన్ అను బిరుదు కలదు. మరి వీరు కళభ్రజాతికి చెందినవారు గదా ! వారు వారి బిరుదమును ఎట్లు ధరించిరి ? ఈ కళభ్రలు పాండ్యుల సామంతులుగా నుండుటచే, వారి బిరుదును ధరించి యుండవలెను. మరియు

ముత్తరయర్‌లకును - కళభ్రులకు సంబంధము లేనట్లు కనబడుచున్నది. దీనిని చదువరులే పరిశీలించి నిర్ణయించవలెను. ఈ ముత్తరయర్లు క్రీ. శ. ౬౦౦ నుండి ౯౦౦ వరకు తంజావూరు, త్రిచ్చినాపల్లి, మధురై మూడు భాగములను పరిపాలించిరి. శ్రీ పెరుంబిడుగు ముత్తరయన్ V, తొమ్మిదవ రాజును, చోళవిజయాలుడు ఓడించి ముత్తరయర్-నాడును స్వాధీనముచేసికొని చోళరాజ్యములో కలుపుకొనెను. నాటినుండి ముత్తరయర్ల జాడ కనబడలేదు క్రీ. శ. ౩౦౦ శతాబ్దమున తమిళ 'నాలడియార్' అను జైనగ్రంథమందు సం. ౨౦౦, ౨౪౬, మరియు ౨౯౬ వ పద్యములలో పెరుముత్తరయర్ రాజునుగురించి పేర్కొనబడినది. అది పాండ్యనాటిని క్రీ. శ. ౩౨౦ - ౪౨౦ AD లో ముత్తరయర్ పాలించిన కాలమున, మధురైలో జైన సమావేశము జరిగెను. పై చెప్పబడిన (నాలడియార్) పద్యములు జైనసన్యాసులు ముత్తరయర్ రాజులను పొగుడుచు వ్రాసిరి.

దక్షిణభారత చరిత్రలో క్రీ. శ. ౯౦౦ నుండి ౬౦౦ AD, ఈ మధ్యగల కాలములో (ముత్తరయన్) ముత్తరాజుల వంశావలిని గురించిన సందర్భములు అనేకములుగా కనబడుచున్నవి, ఈ వంశస్థులు చోళరాజ్యంలోని అంతర్భాగమైన ఒక ప్రదేశమును 'సెందలై' లేక (చంద్రలేఖ) మండలమును రాజధానిగా చేసుకొని పరిపాలించిరి. ఈ రాజధానియందలి శివాలయములో గల రాతిచక్కడంలో కొన్ని కొన్ని ముత్తరయర్ల పేర్లు మనకు తెలియుచున్నది. అందులో ముఖ్యమైనటువంటివి ఈ విధముగా నున్నవి.

౧. శ్రీ పెరుంబిడుగు ముత్తరయర్-1 (ముత్తరాజు) అలియాస్ కువహన్-మారన్
౨. శ్రీ ఇలంగోవతి అరైయన్ (ముత్తరాజు) (అలియాస్) మారన్-పరమేశ్వరన్
౩. శ్రీ పెరుంబిడుగు ముత్తరయన్ II ,, సువరన్ -మారన్
౪. శ్రీ విడెల్‌విడుగు శత్తాన్ - మారన్
౫. శ్రీ విడెల్‌విడుగు ముత్తరయన్ III
౬. శ్రీ శత్తాన్ పళియిలి
౭. శ్రీ మార్పిడుగు
౮. శ్రీ శత్రుభయంకర ముత్తరయన్ IV
౯. శ్రీ విడెల్ విడుగు ముత్తరయన్ V

దక్షిణభారతదేశములో ముత్తరయర్ రాజులు క్రీ. శ. ౬౦౦ ADనుండి ౯౦౦ AD వరకు చెరిగిపోని ముద్రవేసిరి శ్రీ తెలుగు చోళ విజయాలుడు శ్రీ విడెల్ విడుగు ముత్తరయన్ Vను ఓడించి వారి రాజ్యమును చోళరాజ్యములో కల్పుకోవడముతో ఈ ముత్తరయర్ పరిపాలన అంతమొందినది. (ముత్తరయర్–నాడు చూడుడు)

ముత్తరాచలతో ముత్తరయర్లు వేరయని, వారు నాగవంశమునకు జెందినవారని శ్రీ శ్రీనివాసయ్యంగారు తమ తమిళ స్టడీస్‌లో ఈవిధముగా వ్రాసియున్నారు.

1891 నాటి సెన్సస్ లెక్కలను బట్టి చూచినచో ముత్తరాచలకు, అంబలకరన్, ముత్తరయర్, కల్లర్, కురంబున్, మొదలగువారు నాగజాతికి జెందినవారని, అప్పట్లో పల్లవరాజ్యసీమ అయిన తొండమండలములో నివసించెడివారని తెలియుచున్నది. వారియొక్క విజయపరంపరలు దక్షిణాదిన, త్రిచ్చినాపల్లి వరకు సాగేననియు మనకు అర్థమగును. ఈ పల్లివులలోని కల్లర్ మరియు ముత్తరయర్ జాతులు చోళదేశమునకు వలసపోయిరని తెలియుచున్నది. పల్లవ సైన్యంలో ముఖ్యముగా, ఈ కల్లర్ జాతికి జెందిన వారే ఎక్కువగా నుండినవారు. ఇందులో కొంతమంది పల్లవరాజుల క్రింద రాజ్యపాలకులుగా పనిచేసిరి. వారి కొంతమంది వారియొక్క వంశవృక్షము శివునితో ప్రారంభమైనదని చెప్పుచున్నారు. మరికొంతమంది పల్లియులు (వహానిక్షత్రియులు) మని చెప్పుకొనుచున్నారు. (పల్లి) లేక పల్లవజాతీయులలోని ఒక భాగము. 'ముత్తరాపలు' (తెలుగు ముత్తరాచలు) చేర, చోళ, మరియు పాండ్యప్రాంతమును పరిపాలించిరి. 'పల్లియులు వేరె, తెలుగు ముత్తరాచలు వేరే' పల్లియులు వహానుని క్షత్రియులని, వారి కులచరిత్రలో వ్రాసుకొనిరి. మరియు వారే పల్లవులమనికూడ వ్రాసుకొనిరి. కాని తెగలు-కులములు అను గ్రంథములో శ్రీ ఎడ్గర్ థర్స్టన్‌గారు నిరాకరించిరి తెలుగు ముత్తరాచలు నిషాదుని వంశీయులనికూడ, తెగలు లేక కులములుయను గ్రంథములోచూపిరి. కాని నిషాదులు వేరు. వారు బోయ కొట్టములును యేలినటువంటివారు. పల్లవచరిత్రలో చూడుడు, తెలుగు ముత్తరాచలు మొదట పల్లవ సామంతులుగా నుండిరి, ఈకాలములోను, ముత్తరాచ పాలకుల ప్రోత్సాహముతో, జైనసన్యాసులతో 'నాలడియార్' గ్రంథము రచింపబడినది. కాన వీరు

నాగులు అయినచో అరవలని పిలువబడువారు, 'అరవ' అనగా 'పాము' ముత్తరాచలను అరవవారని తెలుపబడలేదు. వీరు తెలుగు ప్రాంతమునుండి వచ్చినవారు, పల్లవులకు సామంతులుగా నుండి చోళులను, మరి పాండ్యులను ఓడించి మధురైని పరిపాలించిన సాక్ష్యాధారములు కనబడుచున్నవి. వీరందరి కంటే ముఖ్యుడైనవాడు 'కడక్కముత్తరయర్' కంచిలో జరిగిన, నందివర్మII పల్లవమల్ల పట్టాభిషేకము సందర్భములో అతిముఖ్యపాత్ర వహించి పేరును సంపాదించెను. ఈతని శాసనములు పెక్కు గలవు. ఈతనికన్న పూర్వము, వైయందిప్పిరియర్ రాసర్' అను సామంతరాజు, పల్లవ మహేంద్రవర్మ 1 కాలమున వల్లం అను రాజ్యము పాలించుచున్నట్లు కనబడినది. వల్ల రికార్డు S-I 1-5 partX pp. 340-10)· ఇతను ముత్తరయర్ వంశమునకు జెందినవాడని తెలియుచున్నది. "శ్రీ కోలంగో ముత్తరయర్", బిరుదు వహించిన ముత్తరయర్ చోళనాటిని తన పరిపాలనలోకి తెచ్చెను. ఈ విషయమునే చోళదేశములోని తిరుక్కోడి కావేల్ వద్ద దొరికిన ఆధారమును బట్టి తెలియుచున్నది. 'శ్రీ కడవడియరైయన్ (అలియాస్) ఫడిధీరన్ ముత్తరయర్', ముత్తరయర్-నాడుకి పశ్చిమములోనున్న విలా-నాడులోని కుక్కురు గ్రామస్థుడని తెలియుచున్నది- 'శ్రీ కాడవెట్టి ముత్తరయర్' ఇతని రాజ్యము తెలియరాలేదు శ్రీ మారన్-జడయన్-౧౦-౧౬ సంవత్సరములయొక్క రెండు రికార్డులనుబట్టి తెలియుచున్నది గదా! తెల్లూరు గ్రామమును గెలుపొందినవాడు. "శ్రీ అప్పుడినయనార్" అరువదిమూడు శైవభక్తులలో నొకండు. ఇతను ఏడవ శతాబ్దము AD. తర్వాత కోదంబలూరు ముఖ్యపట్టణముగా ఏర్పరచినవాడు. 'శ్రీ ఇదంగలీనయనార్' ముత్తరయర్ వంశస్థుల చిన్నసామంతరాజుగా కనబడుచున్నాడు. 'శ్రీ పుదికళిరి (అలియాస్) అమురుశ్రీ ముత్తరయన్' పూవలి-కుడి రికార్డులను చూచినట్లు అవుతే ఇతను ఈ వంశమునకు ముందువాడు రాజుగా కనబడుచున్నాడు. 'శ్రీ పెరుముత్తరయర్', ఇతని గురించి "నాలడయర్" అను గ్రంథమందు చూపిన విషయము, ముందు పుట. ౩౦-౩౭లో చూడుడు. 'శ్రీ విజయాలయముత్తరయన్', ఇతను పెరుగుచున్న చోళరాజ్యములో (తంజావూర్ ( తంజాపురము సమీపమునమున్న ముత్తరాసనల్లూరు అధిపతి, ఇతను చోళరాజైన కులతుంగ-1 సమయమువాడని కనబడుచున్నాడు. ఈతను ముత్తరయర్ వంశములోనివాడని తెలియుచున్నది.

శ్రీ నంబాన్-పెరుంబిడుగు ముత్తరయన్, ఇతను వచ్చిల్ రాజు.

శ్రీ అనపాయ ముత్తరయన్-ముత్తరయర్-నాడు.

శ్రీ పరాంతక ముత్తరయన్-ముత్తరయర్-నాడు.

పై వారు పదముగ్గురు రాజుల యొక్క వంశ వృక్షము, పెరుంబిడుగు ముత్తరయర్, సందలై శాసనములో చేర్చనందున, మరి వారియొక్క వివరములు అక్కడక్కడ దొరుకుటచేత, నొకచోట జతపరచి చూపబడినది. ఈ ముత్తరయర్ వంశమునకు జెందినవారు, అరితేరినవారు, మారన్-బిరుదము లుండుటచే, వీరు పాండ్యులకు జెందినవారనియు, లేక ఈ వంశమునకు జెందినవారని చెప్పుట కష్టము. ముత్తరయర్-నాడు చూడుడు. వీరుయునుగాక తర్వాత వారు శ్రీ తిరుమంగై మన్నన్, లేక (తిరుమంగై ఆల్వార్) అను వైష్ణవ సన్యాసి చోళనాటిలోని ఒక భాగమైన (అలనాడు) అనే ప్రదేశమును క్రీ. శ. ౮ ఎనిమిదవ శతాబ్దమున పరిపాలించెను. ఇతను కళభ్రవంశస్థుడని (దివ్య సూర్య సరిదమ్) బట్టి తెలియుచున్నది.

పై చూపినదానినిబట్టి క్రీ. శ. మొదటి శతాబ్దము లేక రెండవ శతాబ్దమున కళభ్ర ప్రభువులుగా, తమిళనాడులో ప్రవేశించి రాజులై తర్వాత తంజాపూరు, మధురైలో పరిపాలించినట్లు కనబడుచున్నది. తర్వాత వారు క్రీ. శ. ౬ ఆరవ శతాబ్దమునుండి క్రీ. శ. ౯ తొమ్మిదవ శతాబ్దమువరకు తంజాపూరు, ట్రిచ్చినాపల్లి, మధురైను పరిపాలించినట్లు శాసనములవలనకనబడుచున్నవి. వీరు తెనుగుదేశమునుండి పోయినవారు 'తెలుగు ముత్తరాజుల' (ముత్తరయర్లు) వంశమునకు జెందినవారని, విశదమగుచున్నది. కాన శ్రీ టి.వి. సదాశివపండరాత్తర్ అన్నమలైగారు చూపిన ఆధారమునుబట్టి ముత్తరయర్లు పూర్వపు రాజవంశమువారని తెలుపుటచే వీరు రాజవంశము క్షత్రియులని తేలినది. మరియు వీరు తెలుగుదేశమునుండిపోయిన తెలుగు ముత్తరాజులు. అనగా తెలుగు ముదిరాజులు.

పై విషయములనుబట్టి చూచినచో, తెలుగు ముత్తరాజులు అనగా ముదిరాజులు, పూర్వపు రాజవంశీయులనుట నిక్కవము. వీరు తెనుగుదేశమున నాగులు రాక పూర్వము తెనుగువారుగ దక్షిణ మధ్య జనపథమున జనులుగా కనబడిరి. ముత్త అనగా గ్రామపెద్ద, లేక కులపెద్ద, వీరిని ముత్తిరయను

పదవి నలంకరించినవారు, తర్వాత రాజులుగా మారి ప్రజల రక్షణ, మృగముల వేటాడుట, న్యాయ ప్రభువులుగ కొలువుతీర్చుటచే, వీరు క్షత్రియులుగా కొనసాగిరి. వీరి వృత్తి నేటికి సైన్యములో సిపాయిలుగానో, మరి పెద్దపెద్ద పదువులమీద కనబడిరి. మరియు రాజ బంధువులు (**Feudales**) అనగా పాళె గార్లు లేక సామంతరాజులుగా శ్రీకృష్ణదేవరాయల సమయమున కూడ కన బడినవారు. వీరు క్రీ. శ. మొదటి శతాబ్దముననో లేక రెండవ శతాబ్దముననో, తెనుగు దేశమునుండి వలసపోయి, కంచి, తంజావూరు, త్రిచ్చినాపల్లి, మధురై రాజ్యపాలకులుగా ముత్తరయర్ - పెరుంబిడుగు, విడెల్ విడుగు అను బిరుదము లతో రాజ్యము అలంకరించినవారు. కాన వీరు తెలుగు ముత్తరాజులు, ముత్తరయర్ గా దక్షిణదేశమున కనబడినవారు. తెలుగు కులము ముత్తపదవి నలంకరించి రాజ్య పరిపాలించిన రాజు, కనుక తెలుగు ముత్తరాజులని తెలియు చున్నది. ఈ చరిత్రమును ముందుచూచినచో మీకు తెలియనగును.

చెట్టి లక్ష్మయ్య - ముత్తరాజు

ఈ తెలుగు ముత్తరాజుల సంగ్రహ చరిత్ర గ్రంథ ప్రచురణకు ఆర్థికంగా సహాయ, సహకారాలను అందించిన ఆప్తులు, మిత్రులైనవారి వివరాలు ఈ దిగువచూపబడినది, వీరందరికి నాహృదయ పూర్వక నమస్సులు.

| | | |
|---|---|---|
| 1 | సర్వశ్రీ. యన్. ఆర్. స్వామి మైలార్‌గూడ సికింద్రాబాద్ | 1000- |
| 2 | శ్రీ బీడీల కాశయ్య, రిజిమెంటల్‌బజార్ సికింద్రాబాద్ | 1000- |
| 3 | శ్రీ సీ. మాణిక్యారావు, అమీర్ పేట్ హైద్రాబాద్ | 1000- |
| 4 | శ్రీ యన్. మల్లేశం, మైలార్‌గూడ సికింద్రాబాద్ | 1000- |
| 5 | శ్రీ గోవిందురాములు, అంబరపేట హైద్రాబాద్ | 1000- |
| 6 | శ్రీ బి. శివయ్య. బండిమెట్టు సికింద్రాబాద్ | 1000- |
| 7 | శ్రీ యల్. రాములు. నల్లగుట్ట సికింద్రాబాద్ | 1000- |
| 8 | శ్రీ యస్. పి. పాండురంగారావు, మ్యాకలబండ, హైద్రాబాద్ | 551- |
| 9 | శ్రీ బాబులాల్, మంగల్‌హాట్, హైద్రాబాద్ | 551- |
| 10 | శ్రీ సేనాపతి బాలక్రిష్ణ, కార్వాన్, హైద్రాబాద్ | 500- |
| 11 | శ్రీ దేశం దుర్గయ్య, అంబరపేట హైద్రాబాద్ | 500- |
| 12 | శ్రీ క్రిష్ణ స్వామి, సాబాష్టిన్‌రోడ్, సికింద్రాబాద్ | 501- |
| 13 | శ్రీ జి. నర్సింగరావు గాస్‌మండి, సికింద్రాబాద్ | 501- |
| 4 | శ్రీ పురం పాండురంగారావు, సీతాఫల్‌మండి | 500- |
| 5 | శ్రీ కోటి శ్రీనివాసరావు, బన్సీలాల్ పేట సికింద్రాబాద్ | 500- |
| | శ్రీ బండారి సత్యనారాయణ, లాలగుడిబజారు సికింద్రాబాద్ | 300- |
| | శ్రీ వల్లభ్ లక్ష్మయ్య నాలాబజార్, సికింద్రాబాద్ | 250- |
| | శ్రీ నాగరాజ్, బాంబే, | 251- |
| 9 | శ్రీ కుమారస్వామి, రాజమొహల్లా, హైద్రాబాద్ | 250- |
| 0 | శ్రీ ఎ, జంగయ్య, శాలిబండ, హైద్రాబాద్ | 250- |

21 శ్రీ పి సత్యనారాయణ (ముల్కి) మల్కాపేట, హైద్రాబాద్ 100-

22 శ్రీ వరదరాజులు, అమీర్ పేట, హైద్రాబాద్ 100-

23 శ్రీ తోట పండరినాథ్, హైద్రాబాద్ 250-

24 శ్రీ ఆర్. భాస్కరరాజు వెంగల్ రావునగర్ హైద్రాబాద్ 500-

25 శ్రీ యన్. లక్ష్మినారాయణ, కొత్తబస్తి, బీర్ బాన్ బాగ్, హైద్రాబాద్ 251-

26 శ్రీ ఎల్. శ్రీనివాస్, షాలిబండ, హైదరాబాదు 500-

27 శ్రీ పి. జ్ఞానేశ్వర్ రావు ఓల్డు బోయిగూడం,
సికింద్రాబాద్ 251—

ఓం

జనుల చరిత్ర

# తెలుగు ముత్తరాజుల (ముదిరాజు) సంగ్రహ చరిత్ర

## విషయ సూచిక

# తెలుగు ముత్తరాజుల సంగ్రహ చరిత్ర

## మొదటి ప్రకరణము

"కులశబ్దము" జాతివాచకముగా, బిరుదముగా, వంశమునకు పర్యాయ పదముగా వ్యవహరింపబడుచున్నది. ఈ జాతియను వట వృక్షము ఊడలు నాటుకొని, పెద్దచెట్టుగా పెరిగి, అరణ్యములుగా అవతరించి, ఉత్తర భారతమునుండి దక్షిణ భారతము మరియు లంకా, (Ceylone) వరకు వ్యాపించినది.

### స్థూలముగా పరిశీలించినాచో నాల్గువర్ణములు

(1) బ్రాహ్మణ, (2) క్షత్రియ, (3) వైశ్య, శూద్రులు. చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః। అను గీతావాక్యము కూడా ఇందులకు ప్రమాణము, గుణకర్మ విభాగము ననుసరించి వర్ణములు సృష్టించ బడినవనీ గీతా వాక్యార్థము. అనగా వారివారి వృత్తుల ననుసరించి పవిత్రానుయముతో సృష్టింపబడిన యీవ్యవస్థ, రాను రాను 'జాతి' యనుపేరుతో పిలువబడి, సమాజమును వర్గవర్గములుగా విభజించినది. ఇట్టి వర్ణవ్యవస్థ నాటినుండి నేటివరకు భారతదేశమునకు పెను భూతమై పట్టి, వికటాట్టసహాము చేయుచున్నది. శూద్రజాతి వారు వైదిక కర్మకు అనర్హులుగా ప్రకటింపబడినవారు. ఆసేతు శీతనగ పర్యంతము, ఈ జాతివారు లేనిమూల లేదు. కాలక్రమమున శూద్రజాతి కొన్నివందల ఉపభేదములతో దేశమున వ్యాపించినది.

వేదకాలముకన్న పూర్వము రాతియుగమున, మానవుడు కొంత జ్ఞానశక్తిని సంపాదించుకొని జీవన ఆధారమునకు కావలసినవి సృష్టించినప్పటి కాలమునుండి వీరికి ఒకే వృత్తులను నేర్పరుచుకున్నవే ఈనాటి కులములు లేక జాతులు.

వేదకాలానంతరము ప్రజాపతియైన బహ్మ అంశమున బుట్టిన వారిలో మొదటివాడు 'మరీచి' అతని తనయుడు సూర్యుడు. సూర్య వంశము వాడైన 'మను' మహారాజు రాజ్యములో నాల్గువర్ణములుగా వ్యవస్థలుగా ఏర్పరచెను. అప్పటినుండి వచ్చినదియే క్షత్రియ త్వము. నాడు ప్రజారక్షణ, మృగములను వేటాడుట, పాడిపంటలను కాపుచేయుట, రాజులులేని కాలమందు 'నాయకుని'గా పేరునొంది క్షత్రియులుగా భావించి మరి తమతమ జీవన వృత్తులలో యుండిరి. ఈ కులములు గుణకర్మముల వలన మరియు వృత్తుల వలనను గలిగినది. అవియే బిరుదములుగా వ్యవరిహంపబడినవి. నాటినుండి నేటివరకు తొమ్మిది కులములు, వృత్తులతో గలవు. అందు ఉపశాఖలు యెన్నియో పెరిగినవి. నాడు ఒకే ధర్మము, ఒకే ఆచారము, ఒకే భాషగా (One Religion-one Culture and one language) యుండెను. దీనికి నిదర్శనము వేదయజ్ఞము-ఉద్యోగులు,ను చూడుడు౧

**వేద యజ్ఞము - ఉద్యోగులు :**

కొన్ని సంవత్సరముల కొక్క పర్యాయము ద్విజులు దాతలైన ధనవంతులు లేక వ్యాపారులు, లేక భూ కామందుల సహాయమున మిక్కిలి పవిత్రమైన యజ్ఞమును జరుపుచుండిరి. మహాయజ్ఞములు వ్యవహారమున కనబడుట లేదు. యజ్ఞాయాగధులు, ఇంకను సామాన్య ప్రజలచే గౌరవింపబడుచున్నవి. ఇట్టి యజ్ఞములు గావించుటకు ఉత్సాహవంతులు మరియు ఆచార సంపన్నులు నైన జనసమూహము అవసరము చాలవరకు ఇట్టి యజ్ఞములను ప్రజల విరాళములతో కావించు

౧. స్వంత.

చున్నారు. నమ్మకముగల హిందువులు మతాచార ప్రకారము తమ సహకారమును తెలుపుచు, శక్తికొలది విరాళముల నొసగుచు యజ్ఞమును విజయవంతము కావించుటలో తోడ్పడుచున్నారు.

**పలుయజ్ఞములు** : యజుర్వేదములో సుమారు ౨౦ యజ్ఞములు చెప్పబడినవి. క్రిందటి శతాబ్దములో ౭ లేక ౮ క్రతువులు మాత్రమే ఆచరణ యోగ్యముగా నున్నట్లు తలంచిరి. సామాన్యమైనవి మాత్రమే ప్రజలు ఆచరిస్తూ యుండేవారు. ఈ యజ్ఞములు ఒక్క దినము నుండి ఒక్కవారము వఱకును; ఒక్కనెల నుండి నాల్గునెలల వఱకును, మరికొన్ని ఒక సంవత్సరకాలమును బట్టును. పూర్వకాలము పెద్ద పెద్ద యజ్ఞములు రాజులు చేసేడివారు. ఋత్విజ్ఞులు, కర్మకాండముల యందు నిష్ణాతులై ప్రతి విషయమున జాగరూకత వహించి కార్యములను నిర్విఘ్నముగా పూర్తి కావించెడి వారు.

**పనివాండ్రు మరియు శిల్పులు** : బ్రాహ్మణులు, క్షత్రియులు మాత్రమే ఈ యజ్ఞములందు అవకాశము గలదు, నేటిభావము పొరపాటు. ఈమధ్యకాలములో పైభావమును, అజ్ఞానులలో ప్రచారము చేయుట జరిగినది. ఈ దుష్టప్రచారము తొలగించుటకు నవీనకాలమున పరిమిత భావమున వేద క్రతువులను గూర్చి అజ్ఞానులకు తెలియబర్చుట జరిగెను. వేదములను అవలోకించినచైన ఈ క్రతువులయందు వివిధ వృత్తుల ప్రజలు ఎంతమంది అవసరమో, ఎంతమందిని వినియోగించెడి వారో తెలియును. ఏ యజ్ఞమైనను ౮ జాతుల పనివాండ్రు మరియు శిల్పులు లేకుండగ జరుపబడెడిది కాదు.

**కొండజాతి ప్రజలు తెగలు** : యజ్ఞముల యందు 'సోమపానము ముఖ్యము'. సోమవృక్షమునుండి దీనిని సంపాదింతురు. ఇది ఇత్తు-విత్తి పెంచెడిదికాదు. కొండలయందును, గుట్టలయందును మాత్రమే పెరుగును. అడవిజాతుల వారు దీనిని తీసి బ్రాహ్మణులకు

అమ్ముచుండెడివారు. శ్రౌత్రసూత్రానుసారము వీరిని 'సోమవిక్రయులు' అందురు. సోమకట్టకు బదులుగా ఈ క్రింది వానిని ఇవ్వవలయునని కలదు.

అవి. యేవన (౧) ఆవు, (౨) క్రొద్దిరోజుల క్రితమే ఈనిన సంతానవతియైన ఆవు, (౩) ఒక పెయ్యదూడ (౪) ఒక కోడెదూడ, (౫) బండిలాగ గల ఎద్దు (౬ + ౭) కోడె మరియు పెయ్య, (౮) దుస్తులు, (౯) బంగారము, (౧౦) గొఱ్ఱెలు, ఋత్విజునకు ఒక్క ఆవు మాత్రమే దక్షిణనివ్వగా, సోమరసమును తెచ్చువారికి పైన చూపిన వన్నియు దక్షిణరూపమున లభించును. ఆచార్యునకు వెయ్యి ఆవులను దక్షిణఇవ్వగా సోమరసమును తెచ్చువాండ్రకు(౧౦)సోమరసకట్టలకట్టెకు ౩౦ ఆవుల ఖరీదును ఇచ్చెడివారు. అటవికులు, ఆవులు, గొఱ్ఱెల పెంపకము వలన లాభమును పొందెడివారు. శ్రౌత్రసూత్రాములందు వారిని 'అశ్వ, ప గోపాల్, అజయపాల్'లుగా, గుర్తింపబడిరి.

**కుండలు ఇటుకలు :** ముఖ్య మరియు సహాయక హోమ గుండములకు ఇటుకలను వాడెడివారు. బౌద్ధాయన శ్రౌత్రసూత్రము ప్రకారము ఒక్క హోమగుండమును శయనాకరమున నిర్మించుటకు వెయ్యి ఇటుకలు అవసరమగును. మట్టితో తయారైన అనేక పెద్ద పాత్రల నిండుగా నీళ్లు నింపి పందిరి మూలలయందుంచెడివారు. ఒక యజ్ఞములో ఋత్విజుడు ఒక పెద్దకుండతో నీటిని నింపుకొని ఒక ప్రదక్షిణము చేయవలయును. ఈ కుండలను, ఇటుకలను తయారు చేయుటకు 'కుమ్మరులు' అవసరమయ్యేవారు.

**నిపుణులైన రైతులు :** వరి, గోధుమ, బార్లీ మరియు పప్పు ధాన్యములు చాల అవసరమైనది. నాగటి చాలునందు నెయ్యి చిలికి విత్తిన విత్తులకు నీరు పెట్టి పండించిన వారిని మాత్రమే 'కర్షకులని' పిలిచెడివారు, అని తైత్తిరీయ సంహితలో. కలదు. నాగటిచాలు

లోతుగ నుండుటకై ౬నుండి ౧౨ ఎద్దులను, నియోగించెడివారు. ఓ కర్షకులారా, జాగ్రతగ మెడపట్టెళ్ళను ఎద్దులకు కట్టుడు. ఎద్లు అలసినప్పుడు పరిశుభ్రమైన నీటిని త్రాగింపుడు. ఓ నిపుణులారా జాగ్రతగా శుభముగా మీమీ నాగళ్ళను పట్టి దున్నండి అని కలదు. నిపుణతతో సేద్యము చేయగ పండిన మంచి పంటవిధానమును గూర్చి ఋగ్వేదములో పొగడబడినది. దీనివలన 'రైతులకు' కూడ యజ్ఞములయందు ప్రముఖ స్థానముగలదని తెలియుచున్నది.

**స్వర్ణకారులు :** వెండి, బంగారు అభరణములనుకూడ యజ్ఞములయందు ప్రయోగించెడివారు. సోమయజ్ఞమునందు గుండ్రని బంగారు, వెండి రేకులను వాడెడివారు. యజమాని లేక కర్త ౨౧ గుర్తులు గల బంగారు పతకమును మెడచుట్టును ధరించ వలయును. 'వాజపేయము', ప్రకారముకర్త ఒక ప్రత్యేకమైన బంగారునెక్లెస్సును మెడచుట్టున ధరించవలయును. హోతలేక కర్త వజ్రములతో పొదగబడిన బంగారు తామరపూవు ఆకారముగల ఒక చైను (గొలుసు)ను ధరించవలయును. రాజసూయ యజ్ఞమునందు కట్టె పీఠలపై బంగారు నక్షత్ర రూపమున కోనలయందు అమర్చబడిన పీఠములయందు కూర్చుండవలయును. "దాశపేయము" నందు పాల్గొనువారికి బంగారు నగలను నొసంగుట కలదు. యజ్ఞములందు స్వర్ణకారులకు" ఎంత పాత్రకలదో ఇందుమూలముగా తెలియుచున్నది.

**మోచీలు :** జంతు సంబంధమైన తోళ్ళు కర్మకాండలయందు బంధింపబడినది. యజ్ఞకుండములను తయారు చేయువారు లేడి చర్మమును ధరించవలయును. బౌద్ధయాన శ్రౌత్ర సూత్రము ౧౨-రాజసూయయజ్ఞములో రోజు పవిత్ర స్నానమును పెద్దపులి చర్మముపై చేయవలయును. మృత్యుశవకర్మ యందు చర్మకారులచే పెద్దపులి చర్మముతో తయారు చేసిన పాదరక్షలను ధరించవలయునని కలదు.

ఈ పాదరక్షలను తయారు చేయువారిని (అజన - సంధాయుల అందురు. తైత్తిరీయ బ్రాహ్మణలో 'అజన'-అనగా చర్మమ మరియు 'సంధాయ' అనగా అతుకుట అని అర్థము.

**నేతపనివారు :** యజ్ఞ యుపస్థంబమునకు ఒక ప్రత్యేక బట్ట చుట్టబడును. ఒక యజ్ఞములో నల్లని అంచులు గల బట్టలను ధరిం వలయు, ఎఱ్ఱని అంచులగల దోవతులను, తలపాగాలను ధరించవలయ నని కలదు. కావున 'నేత పనివాండ్రు' కూడ ఈ కృతువుల యం( పాల్గొనెడివారు.

**వడ్రంగి :** పనివారు పందిరి స్థంభములను మరియు చెక పాత్రలను తయారు చేయుటలో నియోగింప బడెడివారు. ఇను కుండలు, మరియు పట్టుకారులు కూడ అవసరమై యున్నవి. 'వడ్రం మరియు కమ్మరులు' ముఖ్యమైన వారు. ఈ విషయములను మరిం పొడిగించి, వివరించి చదువురలను విసగించును. పైనుదాహరించి విషయమున ప్రజాసాంఘికమైన క్రతువునందు నమ్మకము, ఉత్సాహావ కలవారియొక్క సహాయసహకారములు ఎంతయేని అవసరమో అనె విషయము ఎవ్వరికైనను సంతృప్తి పరుప జాలునని తలంతును.౨

పై యజ్ఞమునకు, ఏ ఏ కులము వారు నుపయోగపడుదురో వారిని(౯) తొమ్మిది కులములుగాను మరి వారివారి వృత్తులనుబట్టి ( కనబడుచున్నదిగా చూపనైనది. హిందు విశ్వపత్రిక అక్టోబర్ 197 vol. 10. నం. 7 (పుట. 13-15).

**కులము :** 'కులము' అనగా 'కుటుంబము' 'జాతి' అన 'దేశము', 'వర్ణ' మనగా 'రంగు', లేక వృత్తితో కూడుకున్న వ్యవ( నాడు భారతదేశమునకు ఆర్యా వర్తమని పేరుండెను. ఆర్యుడన శ్రేష్ఠుడు. ఆర్యావర్తము నందుండు వారు ఒకే కుంటుబము. ఒ దేశము-ఒకే భాషగల్గి వివిధ వృత్తులతో జీవించిరి. ఆనాడు అంటరా

---

౨. వేదయజ్ఞము-ఉద్యోగులు లేక పనివాండ్రు, (విశ్వహిందు. Vol. No. 10 సం. 7. పుట.13-15).

తనమే లేకుండెను. కనుక ఈ దేశవాసులు శ్రేష్ఠులుగా, ఋషులుగా, మునివర్యులుగా, సిద్ధులుగా, భగవద్భక్తులుగా, ప్రభుప్రేమికులుగా, నుండుచు ఆర్యులని పిలువబడిరి. వృత్తువర్తనే అను ధాతువునుండి నిష్పన్నమైనది - వర్తశబ్దము. వర్తనము, సంచారము అని దానికి అర్థములు. ఆర్యుల సంచరణమునకు నిలయమైన భూమియే ఆర్యావర్తము. నాటి ఆర్యులలోనివారే దానవులుగా, దస్యులుగా, ద్రవిడులుగా, అసురులుగా, కిరాతకులుగా, యితరత్ర నామములతో పిలువబడిరి. మరియొకచోట మూడు వర్ణములనే చూపినారు. (౧) బ్రాహ్మణ (౨) క్షత్రియ, మరియు (౩) వైశ్య. వీరిలో తొమ్మిది కులములు వృత్తితోను మరియు వ్యాపారము కూడుకొనియున్న (**Occupation and trades**) జనులు. పై జూపిన యజ్ఞమునకు సంబంధించిన వారు. మరి పై జూపిన వారు కులవృత్తితో వుత్పత్తి చేసి, విక్రయించువారు. కాన వీరు మూడవ తరగతి అనగా వైశ్యులతో సమానులు, కాని శూద్రులతో లెక్కించిరి౩ - (స్వంత).

మనపూర్వపు కూలీలు అనే గ్రంధమందు చూపినప్రకారము మూడువర్ణములు ౧) బ్రాహ్మణ, ౨) క్షత్రియ ౩) వైశ్య. ఈ వైశ్యలకు జెందినవారు నేడు వృత్తులు మరి వ్యాపారములు చేయువారు (**occupation and trades**) అనగా సరుకును వుత్పత్తిచేసి మరియు అమ్మువారు లేక విక్రయించువారు. వీరు యజ్ఞమునకు - పని సంబంధించినవారు. కాన వీరిని పై ఆధారములు ననుసరించి ఈ దిగువ నుదహరించబడుచున్నాను, చదువరులు పరిశీలించగలరు.

| | |
|---|---|
| ౧. వైశ్య లేక (శెట్టి) · | సరుకులు కొని అమ్మువారు (వ్యాపారులు) |
| ౨. కృషిక్ (కాపు) | వ్యవసాయముచేయువారు. ధాన్యము పండించి విక్రయించువారు (కృషీవలలురు) |

---

౩. స్వంత.

౩. మట్టిపనివారు (కుమ్మరి) : కుండలు, యిటుకలు, పెంకులు చేసి విక్రయించువారు (కుమ్మరులు).

౪. నేతపనివారు (సాలె) : బట్టలు నేయువారు, విక్రయించువారు. (సాలీయులు)

౫. (అ) బంగారము పనులు (సువర్ణకారులు) బంగారునగలు చేయుట, అమ్ముచూపువారు (విశ్వబ్రాహ్మణులు) లేక విశ్వకర్మలనియు గూడ పిలుతురు.

(ఆ) కర్రపనిముట్లు : (వడ్రంగి) కర్రపనిముట్లు చేయుట, విక్రయించువారు. వడ్రంగులు,

(ఇ) ఇనుముపని (కమ్మరి) ఇనుప పనిముట్లు తయారుచేసి విక్రయించువారు (కమ్మరులు).

(ఈ) ఇత్తడి-రాగి పని (కంచరులు) ఇత్తడి-రాగి వస్తువులు తయారుచేయువారు, విక్రయించువారు (కంచరులు)

(ఉ) శిల్పిపని (సిలిపి) : శిల్పి అనగా బొమ్మలు చెక్కువారు. (శిలిపిలు).

ఈ పై ఐదుగురు ఒకే కోవకు జెందినవారు. పంచదాయలు లేక విశ్వబ్రాహ్మణులని- బ్రాహ్మణకోవకు చెందినవారు కాని వుత్పత్తి చేసి విక్రయించుటచేత యిందు చూపనైనది. వేదయజ్ఞములు - పనివారులో చూడుడు.

౬. పశువులకాపరి : (గొల్ల) పాడిపశువులు మరి వ్యవసాయము చేయువారు. పాలు, పెరుగు విక్రయించువారు (గొల్లలు) యాదవులనిగూడ చెప్పుకొందురు.

౭. చేపలు పట్టుట : బెస్త, గంగపుత్ర, బోయిలు, వీరు చేపలుపట్టుట,

అమ్ముటవలన బెస్తవారు అనిరి. Fishing Hunters).

౭. సోమపానము తీయుట: సోమ విక్రయిలని, వేదయజ్ఞము పని వారలలో చూపినారు. ఇప్పుడుకనబడుట లేదు. కాని వీరి బదులు సురాపానకము అనగా (కల్లు) తీయుట, విక్రయించుట, గౌడులని గౌండ్లయని యున్నారు. వారేవీరై యుండనోపు.

౯. తేలి : (నూనెతీయువారు) అనగానూనెగానుగలో తీయువారు, మరి విక్రయించువారు. (తేలీలు). వీరు తిలియని కూడ పిలువబడుదురు. తిలియనగా నువ్వులు. తేల్ అనగా నూనె (తేలి) యని యందురు. అనగా తిలాః-నువ్వులు-దానినుండి వచ్చినది తైలము. దీని అపభ్రంశరూపము తేల్.

౧౦. చర్మకార్మికులు : (మోచి). పశువుల చర్మము తీయుట, చర్మవస్తువు తయారుచేయుట - విక్రయించుట వృత్తి వారు (అజన సంధాయ) లనికూడ అంద కాని వీరిని శూద్రులనిరి.

పై చూపిన యజ్ఞకాలమునుండి వచ్చిన విధము - వివిధ వృత్తులలోగల కులములను చూచినాము మరియు యుగములయందు చూడవలెను.

**యుగములయందు - జనులు :**

౧. కృతాయుగము: కృతంయుగము అనగా సృష్టి (Golden Age)అందరు ఐక్యముగా కనబడిరి.

౨. త్రేతాయుగము : త్రేత అనగా ఈ కాలమునందు అగ్నిహోమములు, అనగా యజ్ఞయాగములుచేసిన కాలము. (Silver Age) నాటినుండి ఉత్తరాదివారని దక్షిణాదివారని ప్రాంతభేదము లేర్పడినవి. మరియు -

౩. ద్వాపరయుగము : ద్వాపర - అనగా పాపభూయిష్ఠమై కాలము. (Sinful or Bronage or Copper Age) నుండి కలియుగము వరకు వ్యవస్థలో భిన్నత్వమేర్పడినది.

౪. కలియుగము : కలి అనగా కలిపురుషుడవతరించిన కాల అంతిమకాలము (Iron Age) న వర్ణవ్యవస్థలలో ఆచారములు, నీతులు ఎక్కువగా ప్రబలుటవల్ల సమాజమున అంతస్తులు అంటరా తనము(అస్పృశ్యత) ఎక్కువగా ప్రజ్వలించెను. అంతస్తులే కులములు అంటరానితనమే వివిధజాతులుగా లేక తెగలుగా మారినవి. అంటరా తనమును రూపుమాపుటకు ఎందరో మహాత్ములు, ఋషులు, సం సంస్కర్తలు (Reformers) పుట్టిరి. అందులో మొట్టమొదటివా కలియుగమున శ్రీ భగవాన్‌డు గౌతమబుద్ధుడు.

౫. భగవాన్ గౌతమబుద్ధుడు : శాక్యక్షత్రియ కోలీవంశమున చెందినవాడు. గౌతముడు బోధిసత్త్వులలో నొకడు. బౌద్ధమతము ఉద్ధరించినవాడు. తాను జగము నెరిగిన తర్వాత అప్పటికున్న బ్రాహ ణులు ఆచరించు అంటరానితనమును పోగొట్టుటకై వర్ణాశ్రమ ధర ముము వ్యతిరేకించెను. వేదములనుకూడ నమ్మేవాడుకాడు. 'సత్యమే సర్వము' అని చాటుచు "సత్యం శరణం గచ్ఛామి" యని బోధించుచ కులమతములను లేకుండాచేసెను. ఇతడు నిర్యాణము జెందిన తర్వా ఇతని మతము బౌద్ధమతముగా పెక్కుదేశములలో వ్యాపించెను.

౬. ఇంచుమించు సమకాలికుడు జైనమత వ్యవస్థాపకుడు 'మహ వీరుడు జైనుడైనాడు'. ఇతడు క్షత్రియజాతికి జెందినవాడు. ఇతని సమయమునకు బౌద్ధమతము మంచి ప్రచారములోనుండెను. తర్వాత బౌద్ధమును, ఇతర మతములను గాక కులములను వ్యతిరేకించుచు 'సర్వము జైనము' యని చాటినాడు.

౭. తదుపరి క్రీ. శ. ఏడు లేక ఎనిమిదవ శతాబ్దమున శ్రీ జగద్గురు శంకరాచార్యులు అంతయు "అద్వైతము"లో నున్నదని నిరూపించెను.

౮. తదనంతరము వీరశైవులలోని మొదటివాడు 'బసవేశ్వరుడు' ఇతను శైవులకన్న మించి వీరశైవమే ఆదిమూలము అనియు మరియు అన్నికులములవారిని కలుపుకొని వీరశైవమే అనగా 'లింగాయత్)' అను నొక మతమును సృష్టించి, అంటరాని తనమునే రూపుమాపెను. నేటికి వీరశైవులలో కనబడుచున్నది.

౯. క్రీ. శ. పదకొండవ శతాబ్దమున, లేక పన్నెండవ శతాబ్ది మధ్యకాలములో 'భగవాన్ రామానుజా చార్యులు,' కులమతముల వ్యతిరేకమునకు పోరాడెను. భగవద్రామానుజులవారు నాటి, వైదిక మతమును, అద్వైతమును వీరశైవమును, జైనధర్మమును, బౌద్ధ ధర్మమునకు బదులు "విశిష్టాద్వైతమును", సర్వము 'వైష్ణము' గా ప్రచారము చేసెను. తర్వాత అది అన్ని కులముల యందు నొక మతముగా మారినిలిచెను. వీరి మతమును స్వీకరించిన వారిలో బహ్మ నాయకుడు, మొదలగువారు గొప్పవారు. నేటికి మనకు 'శివ' మతము మరియు 'వైష్ణవ' మతము, ఆచారములుగా ప్రతి కులములో కనబడుచున్నది.

౧౦. కీ. శ. పదినెనిమిదవ శతాబ్దమున 'మహర్షి దయానంద సరస్వతి' పూర్వపు ఆర్య మతమును పునః స్థాపించి, కుల మతములను ఎదుర్కొనెను, కాని వర్ణాశ్రమ వ్యవస్థను పునరుద్ధరించెను. అందు ఈ కులములను గుణకర్మముతో వచ్చినట్లు వేదముల నుండి చూపి వ్రాసినాడు.

౧౧. ఇటీవల పందొమ్మిదవ శతాబ్దమున గాంధిమహాత్ముడు అంటరాని తనమును నిర్మూలించడానికి కృషి చేసినాడు.

కనుక పై పేర్కొనిన సంఘసంస్కారలైన, ఋషిలు, మునులు, మహాత్ములు, మహానీయులు కులములు లేక జాతులను వ్యతిరేకముగా మరి అంటరాని తనమును పోగొట్టిరి. కాని వారివారి మతములు నేటికి ప్రతి కులముతో పాటు నిలిచిపోయెను. (స్వంత).

మనుమహారాజు వర్ణవ్యవస్థ గుణకర్మ వృత్తులతో పరిశీలించెను. ప్రజారక్షకుడు, వేటకాడు, అను అర్థములలో క్షత్రియ శబ్దమును వాడెను. అట్టి క్షత్రియులు నాల్గు విధముల విభజింపబడిరి. (1) అగ్ని వంశ క్షత్రియులు (2) సూర్య వంశ క్షత్రియులు, మరియు (3) చంద్ర వంశ క్షత్రియులని, అని క్షత్రియుల నుండియే (4) అసురులు అను మరియొక తెగ జనించెను. చంద్రవంశమునకు చెందిన రాజులలో ద్వాపరయుగమున ఆర్యరాజులు పాండవులు. వారిసంతతివారే తెలుగు ముత్తరాజులు, ముత్తరయర్లు, తాము చంద్రవంశజుల మనుసంగతి తెలుగు ముత్తరయర్లు, తెలుగు గోంకచోడలు, గంగవాడిముత్తరాసర్‌లు, వైదుంబ ముత్తరాసర్‌లు, వారివారి శాసనములలోచెప్పుకొని యుండిరి.

౧౨. చోళులు. సూర్యవంశమని చెప్పుకున్నారే గాని, వారి శాసనములో మాత్రము చంద్రవంశమునకు జెందిన దుష్యంతుడు, అతని కుమారుడు భరతుడు అని పేర్కొనబడిరి. భరతుని చరిత్రను పరిశీలించినచో నతడు సంతతిలేనివాడు. అతనికే 'చోళ' చెరాదులు' జన్మించి రనివారు తమ శాసనములలో పేర్కొనిరి. ఇది యెట్లు పోసుగును ? చోళులెట్లు సూర్యవంశము వారగుదురు? అని ప్రశ్నించు కొనినచో, ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోవును. ఈ పాండవ వంశమునకు జెందినవారు "తెలుగు ముత్తరాజులు లేక (ముత్తరాచ)లు." ముత్త అనగా పూర్వపు లేక ముదియనియు - రాచ అనగా రాజు అనియును అన్వయించ వచ్చును. ముత్తరాచలనే - ముదిరాజులని కూడ వ్యవహా

రించిరి. ముత్త శబ్దము - ముదియగుటలో విప్రతిపత్తి లేదు, ఇక రాచ-రాజు శబ్దములు ఒకేటేకదా; ముది లేక ముడి శబ్దమునకు తమిళమున కీరీటమను అర్థము కలదు. కనుక ముత్తరాచలు సార్వభౌమాధికారముగల కీరీటధారులగు రాజులు అను అంశముకూడ నిరూపితమగుచున్నది. ముత్త శబ్దమునకు పూర్వమనియును అర్థము చెప్పకొనవచ్చును. అప్పుడు ముత్త రాచలనగా పూరాణా రాజు (పూర్వపు రాజు) లను అర్థము వచ్చును. అనగా ముత్తరాచలు పూరాతనులైన రాజ వంశము వారని తేలినది. ఇదియేగాక, మాదిగవారిండ్లల్లో వివాహము జరిగినపుడు (అకు-పోక) అనగా 'విడెము' ముత్తరాచల గురించి, మర్యాద సూచకముగా నుంచువారు". అంటే వీరు పెద్ద మర్యాద కులము వారని తేలినది. కులములు-తెగలు దక్షిణహిందు దేశము అను గ్రంథమందు చూడుడు. ఇదియేగాక ముత్త-అనగా ముత్యము (ముక్త) రాచ-రాజు అనగా అధిపతులు, అనగా ముత్యముల వలె స్వచ్ఛత కలిగేసత్ చరిత్రులైన రాజులనియు మరియు ముత్యములను తీసి విక్రయించేటిపై ఆధిపత్యము కలిగియుండేడి వారని ముత్తరాచలను అందురు. ముత్తరాచ-ముత్తరయర్-ముత్తు ముత్యములకు + అరైయర్-రాజు, కాన ముత్తరైయర్, అనగా ముత్యములు దొరుకునట్టి పాండ్యదేశమునకు అధిపతులు యని అర్థము.

లేక చెర . చోళ, పాండ్యరాజ్యములలోని మూడు ప్రాంతములను జయించిన కారణమున ము + త్తరైయర్ ముత్తరయర్, (తరై-ధర-భూమి రాజ్యము) మూడు రాజ్యములకధిపతులని పేరు వచ్చియుండవలెను. మరి వీరు తెలుగు దేశము నుంచి పోయి, చోళ, మరి పాండ్యరాజులను వోడించి, మూడు రాజ్యములను ఏలినట్లు శాసనములవలన కనబడుచున్నది. ముత్తరాచల పూర్వాపరముల నించుక పరిశీలించవలసి యున్నది. వీరిచరిత్రము ఎచటనుండి మొదలగునో, ఎచట అంతమగునో తెలుపుట కష్టసాధ్యము. దీనికి నేటివరకు

విలిసిల్లిన సుప్రసిద్ధ చారిత్రక గ్రంథములు కూడ మిక్కిటముగా పేర్కొనలేదు. తామర ఆకులపైని, జలబిందువులవలె వీరు చరిత్రలో అచ్చటచ్చట మిలమిల లాడుచుందురు. ముత్తరాచలు, ఏచోటినుండి వలసవచ్చినది సుందరరభాతావనిలో ఎచ్చటెచ్చట పాదుకొనియున్నది కూడ తెలుపుట ఇంచుకప్రయాసమేయగును.[౪] స్వంత.

౧౩. ముత్తరాచకోలీ : ఉత్తరభారతమునందు "మధుర" అను నదికలదు. అచట కోలీ రాజ్‌పుత్ వంశీయులు ఎక్కువగా గలరు. ఇచటనేగాక, ఉత్తరప్రదేశము, మధ్యప్రదేశము, రాజాస్థానము, మహారాష్ట్రము మరియు మైసూరు మొదలగు రాష్ట్రాలలో కనబడుచున్నారు. రెండుకోట్లు పై చిలుకుగ యున్నట్లు 1941 సెన్సస్ రిపోర్టు యందు కనబడుచున్నారు. ముత్తరాచలకు కోలీలకు సంబంధమున్నట్లు తెలంగాణా ముత్తరాసలను కోలీలుగా 1941 సెన్సస్ రిపోర్టుయొక్క హైదరాబాదు స్టేటులోని కొన్ని జిల్లాలయందు చూపినారు. మరియు బరోడా రాజైన గైక్వాడ్‌కు సామంతరాజులుగా 'అంఘాడ్' అనే గ్రామమందు కనబడిరి. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము ఆంఘాడ్ అనే చరిత్ర యందు చూడుడు. కోలీలలోని ఒక తెగనే 'ముందాలు' అని వ్యవహరించిరి. కోలీతే కోలార్యన్లు, ద్రావిడులు, ఆస్ట్రేలియా నుండి వచ్చినవారని ఊహ. ఆస్ట్రేలియాను తృణుబిందురాజు పరిపాలించెను. మరియు ఇతను ఆంధ్రమునుండి పోయినటుల పండిత రఘునందన శర్మ తమ వైదిక సంపత్తిలో చూపియుండిరి.

౧౪. ముందా : 'ముందా' సం॥ శబ్దము, మరియు గ్రామాధికారి (munda village-Head) యని అర్థము చెప్పునని శ్రీ ఆర్. వి. రస్సెల్ పండితుడు తన సెంట్రల్ ప్రావిన్స్ ఆఫ్ క్యాస్ట్ అండ్ ట్రైబ్స్ (Central Province of Caste &Tribes)లో చూడుడు.[౫]

---

౪. స్వంత.

౫. తెగలు లేక కులములు మధ్యప్రదేశము (Central Province of Caste & Tribes).

ఈ ముండాలనే త్రేతాయుగమునకూడ యున్నట్లు శ్రీ శరత్ చంద్రరాయ్ ముండాలు-వారిదేశము(mundas and their country) అనే గ్రంధమందు చూపినటుల శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు రామాయణ విశేషములో చూపినారు. (ముండాస్ అండ్ దేర్ కంట్రీ) చూడుడు.

ఈ కోలీలు కపిలరాష్ట్రమునుండి వెలసి, పరిపాలించినట్లు కోలీ రాజైన అంజన్ కోలీ చక్రవర్తి వారివద్ద ఎనభైనాల్గు మంత్రులు మరియు రాష్ట్రములుండినట్లు కనబడుచున్నది. మరియు ఉత్తరమధుర లోనుండి, అక్కడ నుండి పశ్చిమదిశకు, తూర్పుకు, దక్షిణాదికి వ్యాపించినట్లు కనబడుచున్నారు. అంజన్ కోలీచక్రవర్తి శకము గౌతమ బుద్ధుని పూర్వముకు 161 సంవత్సరములు ముందువాడని చూపినారు. కనుక 'ముండా' అనగా పదవి. కోలీల నుండి 'పదవి' ధరించినవాడే ముండాయని, అదియొక తెగగా త్రేతాయుగమున నుండినవారుగా కనబడుచున్నారు. ఇప్పుడు ఛోటనాగపూరులోనున్న వారు.[౬] ఈ ముండాలే మృద్రవాచలై యుండవలెను.

౧౫. మృద్రవాచ : మృద్రవాచ రామాయణ కాలమునకు పూర్వము వేదకాలమున, మృద్రవాచ అనే శబ్దము, భాష యొక్క విషయము, ఏవర్ణము వచ్చినదో, అది మూలనివాసుల గురించి కాదు. వేదములయందు వచ్చిన అనార్యుల శబ్దమని అనుచున్నారు. విచారించితే నిజముకనబడుటలేదు. వారు అనార్యుల భాష విషయమున యున్నది.

Note : In any case, the sence of the word (मृद्वाच) మృద్రవాచ mudrawacha is too un certain to admit of our refering it, with confidence to any peculiarity in the speech of the oboriginies. (pp ) Sanskrit-text book page378 -vidiek sampathi page -344)

---

౬. కోలీరాజపుత్రవంశావలి చరిత్ర. (కొత్తఢిల్లి).

శ్రీ మూర్ ఇట్లు చెప్పినారు, ఇక్కడ మృధ్రవాచ అనగా మేఘములనుండి వచ్చె శబ్దమని, ఋగ్వేదములో చెప్పబడినది.

సవృతహేంద్రః కృష్ణయోనిః = వృతిప నిజముగా నిశ్చయముగా నిశ్చయ పూర్వకముగా కృష్ణయోనిగా నుండును.

"దానోవిషహింద్రమృధ్రవాచః" ఋ 1/1911/20. ఇంద్రుడు వృతములయందు జొచ్చుకొనిపోయి 'మృధ్రవాచ చెప్పును'. అనగా మేఘములయొక్క (ఉరుములు-వాటిశబ్దము) నే మృధ్రవాచయని తెలుసుకొనవలెను లేక 'పిడుగు' యని గ్రహించవలయునని శ్రీ పండిత రఘునందన్ శర్మగారు తమ వైదిక్ సంపత్తిలో వ్రాసియున్నారు. మరియు (ఋగ్వేదములో మృత్ వాచ యని యున్నది. మేఘములను జొచ్చుకొనిపోవుదానిని పిడుగు యని చెప్పుదురు. ఈ ముత్తరయర్లకు 'పిడుగు' అనే బిరుధములు కలవు).

మృత్- అనగా మన్ను లేక భూమి (వై. స. పుట 442). ఇక్కడ మృత్ - భూమి వాచ (రాచ)లేక రాజు అయి యుండవలెను. ఈ మృత్‌రాచ అనే శబ్దము, ముత్తరాచ కులకట్టు ధర్మశాసనములో కనబడియున్నది. 'మృత్', లేక మృధ్ర' పర్యాయపదముగా కనబడు చున్నది. మరియు ఈ మృత్ పదముతర్వాత తెలుగులో 'ముత్త' అయి నట్లు కనబడుచున్నది. ఉత్తరభారతముననున్న మత్తురను, మత్తుర- ముత్తర, మధుర యని నేటికి పిలువబడుచుండిరి. మృత్ నుండి ముత్తరగా దంతోత్సరము మారినట్లు కనబడుచున్నది. (వై. సం.)[౨]

౧౮. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు రామాయణ విశేషములో ఈ విధముగా చూపినారు :

మృధ్రవాచలు ఆర్యులకు శత్రువులుగా, ఋగ్వేదములో నానా విధములుగా వర్ణింపబడియున్నదని వ్రాసినారు. ఋ 8-21-50. మృధ్ర వాచలతోపాటు శబరులు, యతులు, సవరులు, నుండెడివారని, వీరితో

---

౨. వైదిక్ సంపత్తి - శ్రీ రఘునందన్ శర్మ

పాటు కృష్ణత్వక్కులనియ, ఘోరదృక్కులనియు, విస్రవులనియు అనాసులనియు, శిశుదేవులనియు, మరియు అయజ్వనులనియు, దూషింపబడ్డవారని శరత్ చంద్రరాయ్ ముందాలు అనే గ్రంథములో తెలిపినట్లు చూపినారు.[౮]

ఇక్కడ రామాయణకాలమునాడు శబరులతోపాటు ముందాలు ఉన్నట్లు చరిత్రకారులు ఒప్పుకొంటున్నారు. ఈ మృద్రవాచలే ముందాలుగా పిలువబడియుండవచ్చునని ఊహ. ముంద్రా లేక ముంద్రాజ్ కోలీలు చోటనాగపూర్ లో ఉన్నట్లు కనబడుచున్నది.

-:0:-

౮. రామాయణ విశేషము – శ్రీ సురవరం ప్రతాప రెడ్డి.

# రెండవ ప్రకరణము

ముత్తరాచకులకట్టు ధర్మశాసనము, కడప జిల్లా రాజంపేట వాస్తవ్యులైన శ్రీ పోలి సుబ్బనార్యుల వద్ద లభించినది.

-o-

శ్రీ గురుభ్యోనమః శ్రీ సీతారామార్పణమస్తు.

శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాంత ప్రవర్తకులైన, కాంతశమదమాద్యనంత కళ్యాణగుణపరిపూర్ణులై వేంచేశియుండే శ్రీమాన్ భద్రాచలం తిరుమలకొమార వేంకట రంగాచార్యుల అయ్యవార్ల గార్కి మహారాజ రాజే శ్రీ మల్లెవారి సంస్థానం-అనంతరాజు, పునంతరాజు, మాకరాజు, బొమ్మరాజుగార్ల యెదట రాజేశ్రీమృత్ రాచవెళ్లై యేడు పాళెగారు కులం కుల పెద్దలు శాలివాహన శక శతాబ్దః సం 1495 రంభావనామ సంవత్సరం, కార్తీక శుద్ధ ౧౫ పౌర్ణమీలు సోమవారం రోజు ప (అనగా క్రీ. శ. 1570) వ్రాయించి యిచ్చిన కుల కట్టు ధర్మశాసనం మా కులంలో మాకు జరిగించవలసిన పద్ధతులు యేమంటె మా కులం యంతమట్టుకు వున్న వట్టికిన్ని ఆలుమొగడు సంసారానికి సంవత్సరం ౧కి ఆ ౫ పళ్ళ బియ్యం రూ. ౧పెళ్ళికి రు ౧ యీ నిర్ణయ ప్రకారం మీ పుత్రపౌత్ర పారంపర్యంతరం మా పుత్ర పౌత్రపారంపర్యంతరం జరుపుకుంటూ వుండగలవారము యీ నిర్ణయ ప్రకారం జరపని యెడల నల్లముంతతో నీళ్ళు యివ్వకుండా కులానికి వెలిగా వుంచవలసినదే. మా కులంలో తప్పవొప్పులున్నయడల మీరూ వచ్చినదాక ఆడులో వుంచగలవారమూ. యిది మాసమ్మతిన వ్రాయించి సమర్పించిన కులకట్టు ధర్మశాసనం.

శ్రీ శ్రీ శ్రీ రాయిందుకు సాతులు .

ఆనంతరాజు వ్రాలు - డెబై యెడు పాళెగార్ల వ్రాలు.

పునంతరాజు వ్రాలు - కులంచేశిన వ్రాలు.

బొమ్మరాజు వ్రాలు - కులపెద్దలు వ్రాలు.

యీ శాసనం చెక్కినది శ్రీ విరాట్టు విశ్వకర్మ పరబ్రహ్మా పంచ ముఖోద్భవులైన యజన యాజన ఆద్యాయన, ఆద్యాపక దానదాన ప్రతిగ్రిహాషట్కర్మ నిరతులైన శ్రీమహామ్మేరు సమాన దీరులైన చింతోజు నాగలింగం కొమారుడు వేంకటప్పయ్య చేశినది యీశాసనం. సమార్పణమస్తు శ్రీ శీతారామార్పణమస్తు.౧



పై చూపబడిన ప్రకారముగా వీరు వైష్ణవమతాచార తత్పరులు, ముద్రదారకులు, వైష్ణవమత సాంప్రాదాయకులు, విష్ణుభక్తులు, ధర్మశాసనకర్తలు, క్షత్రియ కి అనున ఏట్లు ఆర్య షట్ కర్మములు అనుష్టింపబడునో అట్లే వీరును ఆ ధర్మములను అనుష్టించిరని స్పష్టము.

1. శ్లో. ముద్రాధారయతే శ్రీమాన్, విష్ణుభక్తి పరాయణః,
క్షత్రియస్యకులె జాతః, భానువంశ ప్రకీర్తితః,
ధనుర్వేదె । చ । నిరతః, వైష్ణవాచార తత్పరః ॥

౧. కులకట్టు ధర్మశాసనం, రాజోలిబండ శ్రీ సుబ్బనార్యుల నుండి లభించినది.

2. శ్లో॥ ముద్రాధారయతే శ్రీమాన్, ముదిరాజస్యధీమతః,
ధనుర్వేదార్థ తత్వజ్ఞః, ధర్మాధర్మ విచక్షణః,
ధనుర్వేదే । చ । నిరతః, విష్ణుభక్తిపరాయణః,
ఇక్ష్వాకుల సంభూతః, క్షత్రియస్య గుణాన్వితః,
మండలాధిపతిం, శ్రీమాన్-ముదిరాజస్య ఇతి స్మృతః ॥

నాటి సూర్యవంశ, చంద్రవంశ క్షత్రియులు, శుక్రాచార్యుల శాపమునకు బలియై, రాజ్యములను విడిచిపోయిరి· ఆచారములు. దేశ సాంఘిక ధర్మములననుసరించెను. స్వధర్మములను పాటించక అన్యమత ఆచారధర్మప్రవర్తకులగుటచేత మతములు స్థిరమైన బునాధులయందు నిలిచియుండలేదని గ్రహింపవచ్చును.౧

౧ స్వాంత.

# మూడవ ప్రకరణము

## ముత్తరాచశబ్దనిర్వచనము మరియు భిన్నాభిప్రాయములు:

-౦-

౧. ముత్తరాచ :- ముత్తరాచ అనునామము స్వల్ప బేదముతో ముత్తిరాజు, ముత్తరాజు, ముదిరాజు. మోదిరాజు, ముందరాజు, మృత్ రాచ, ముత్రాచ. ముత్తరాసన్, ముత్తరాసర్, ముత్రాస అని కూడ వ్రాయబడినది. తెలుగుదేశములో వీరికి ముత్తరాచ లేనని వ్యవహరింతురు. తమిళదేశములో వీరికి ముత్తరయన్ (ముత్తరయర్) ముద్దురాజులు, ముత్తురాజు, మరియు పాళెగార్ (పాలయక్కరన్) అని పేర్లుగలవు.[౧] దక్షిణ కెనరా కన్నడదేశములో గంగవాడి ముత్తరాజులను ముత్తరాసర్ అనియు;[౨] కేరళదేశమున ముత్తతాంబిరాన్ (ముత్తువ) యని గలదు.[౩] ఉత్తరభారతదేశములో ముంద్రాజ్ లేక (ముంద్రాజ్ కోలీ) యని గలదు.[౪] మహరాష్ట్రమందు ముత్తరాసకోలీ యని సామంతరాజులు కనబడిరి.[౫]

ఇవియేగాక విభిన్న తెగలు కూడ గలవు.

౬. ముత్త-పూర్వపు-రాచ-రాజు (mutha-old-Racha-king) old king అనగా పూర్వపు రాజులు.[౬]

౭. ముత్త : ముత్యము (ముక్త) - రాచ-రాజు, అధిపతులు అనగా ముత్యములవలే స్వచ్ఛత కలిగే సత్ చరిత్రులైన రాజులనియు మరియు ముత్యములను తీసి విక్రయించేటిపై ఆధిపత్యము కలిగియుండెవారని, ముత్తరాచలని అందురు.[౭]

---

౧ నుండి ౫. తెగలు లేక కులములు దక్షిణ భారతము by ఎడ్గర్ థర్స్టన్.

౬. తెగలు లేక కులములు దక్షిణభారతము by ఎడ్గర్ థర్స్టన్.

౭. స్వంత ఊహ.

౮. ముత్తరాచ:-ముత్తరయర్ -ముత్తు (ముత్యము) లకు + ఆరైయర్ (రాజు) కాన ముత్తరైయర్ - అనగా ముత్యములు దొరుకునట్టి పాండ్యదేశమునకు అధిపతులు యని అర్థము. లేదా౮

౯. చేర, చోర, పాండ్యరాజ్యముల లోని మూడు భాగములని జయించిన కారణమున ముత్తరయర్‌గా పేరు పొందియుండవలెను. తరై -ధర - భూమి-రాజ్యములకధిపతులని పేరు వచ్చియుండవలెను. మరియు (mukta came from the Tamil word mutha).౯ స్వంత.

౧౦. ముత్తిరాచవాండ్లు : ముత్తరాజులు. N, S. A tribe of Soodra descanded from రాజులు or Lords, Squires, or Gentlemen by descent.

ఆ) ముత్తరాచ : Adj. Appctaining to a tribe of Hindu descendedants From Feudel tenants, who were holders in Black mail, a Species of milctia who ofton are free Booters. (seepage 815 Journal5-83).౧౦

౧౧. ముత్తరాచ - దే. వి. గ్రామ కోత్వాల్.౧౧

౧౨. ముత్తద - ముత్త అనగా గ్రామాధికారి, Mutuda wood seems to be the village Headman.౧౨

౧౩. ముత్తరాస = ముత్త - పెద్ద - రాస - రాజు, అనగా రాజులలో ముఖ్యుడు. శ్రీ పురుషముత్తరాస, శివరామముత్తరాసర్

---

౮. వేదం వేంకటరాయశాస్త్రి, తెలుగువారెవరు ?
స్వంత. + ,, ,,

౯. దక్షిణ భారత దేశ చరిత్ర, శ్రీ నీలకంఠశాస్త్రి.

౧౦. బ్రౌన్ నిఘంటువు - పుట. (815-816).

౧౧. నిఘంటువు.

౧౨. దక్షిణ భారతదేశ చరిత్ర, శ్రీ నీలకంఠశాస్త్రి.

గంగవాడి, ముత్తరాస, వైదుంబముత్తరాస, కాడు వెట్టి ముత్తరాస-అనగా రాజులలోముఖ్యుడు.[౧౩]

౧౪. ముత్తు - (ముత్తు - తా) పెరల్ (మోతి) అనగా ముత్యము, కొన్ని చిన్నజాతులవారు శౌరిముత్తుయనిపిలువబడును.[౧౪]

౧౫. ఈ 'ముత్తద' లేక 'ముతిద', శాలంకాయణ శాసనములో ఈ విధముగా నున్నది.

(౧), విజయ-వెంగిపుర-బప్ప-భట్టారక.
(౨). పద-పరిగ్గహితస్స మహారాజ.
(౩). శ్రీనద్ధివంస-వాచన-పి
(౪). దిహో-గామముత్తిదా-ప్ప-మహో-గామో
(౫). సవు-సమగ్గో సవు-ఐయోగ-పెసణ
(౬) కులపుతా-బద్ధా-మనుస బహనితవ్వ
(౭) ఇహహిమ-దమ్మ-ఆయు-బాల-వద్ధా
(౮) మాత (మ) బాలక-మహారాజకుమారా.

పై ముత్త పదమునకు కన్నడసాహిత్య వర్ణనమందు, గోంక చోడలు మరియు ఇతర రాజులకాలమునాటి శాసనములు, గ్రామముల ద్వారకన బరచినవి. దక్షిణ భారతదేశము శాసనములు. vole. III.[౧౫]

౧౬. తిరువమత్తూర్-మహారాజ పరకేసరివర్మన్ ప్రభువు మిగ మల్లగండరాదిత్యుడు. పల్లవరాయనుడు, మూడవ సంవత్సర కాలమున తిరువమాత్తూరు దేవరకు కరపుణ్ణి. నాడు, ఇది 'ముత్త-నాడు'

---

౧౩. స్వంత.

౧౪. శబ్దార్థ దీపిక - నిఘంటువు.

౧౫. EPI Inscription of South India. శాలంకాయన శాసనము.

లో పది బంగారు (pons) (coins) పెట్టిరి. సూర్యచంద్రాదు లున్నంతవరకు యనియున్నది (S. I. I. No 95). ౧౬

౧౭. తిరుమలై దగ్గర పోలూరు - నాల్గు సంవత్సర మహారాజ పరకేసరి వర్మన్ సమయమున (౭) కడుట్టాలై గ్రామయిరుచి మదిచోళ (కన్నడిగ) కన్నడ దేశము మరియు మధురాంత కారంబులర్, సోమ నియాన్-నందియాన్ అనేవారు జైన దేవాలయమునున్న జైనులకు యిచ్చిన Note సరియైన పదము 'విడెల్ విడుగు' అంటే వారి బిరుదు. తెల్లారెరిందనన్ ద్రిప్రోత్తరయర్. (S. I. I. No 6606). ౧౭

౧౮. తిరుచ్చందురై. మహారాజపర కేసరివర్మన్, పరాంత కుడు తిరుచ్చంధ్రురైలో ఒక శివాలయమును కట్టిచ్చినాడు, పుడి ఆదిచ్చి పిడియార్ అనే ఒక రాణి, 'తెన్నెవాన్ ఇలాంగో వెలార్' అంటే (మారన్ పుడియార్) ముత్తరయర్ రాజులకు జెందినవాడు, రాజు కూతురగు మహారాణి అరికులకే సరియార్ చోళరాజు ౬౦ బంగారు కలింజులు దానముగా నిచ్చెను. అనగా చోళులకు ముత్త రయర్లకు సంబంధమున్నట్లు కనబడు చున్నది. (S. I.I. no 96) ౧౮

౧౯. మధుర నేలిన- మహారాజపర కేసరి వర్మన్, ౩౩ సంవత్సర కాలమున మధుర నేలిన వారి అధికారియైన, 'మరుదురుదియార్' ఆరునిది కళ్యాణది. ౧౮ ఇలాతులు సంవత్సరమునకు యిచ్చిన. 'కిల్ ఇరన్యముత్తర్' అనేవాడు అనగా ఇలంగోవతి ఆరైయన్ ముత్త రయర్ రాజుయని తెలియుచున్నది. (S. I. I. no. 106). ౧౯

౨౦. తాయనూర్ - 'తిరున్ మదియాన్' అని యున్నది. (S. I. I. no 175). ౨౦

౨౧. వెలిచ్చెరి దేవాలయము - భూమికొని దానముచేసిన వారు "ముత్రసి" వాసులమని చెప్పుకొనిరి. (S. I. I. no 191). ౨౧

౬ నుండి ౨౧ వరకు దక్షిణభారత దేశము శాసనములు Vol. III.

బడును. దానికి ప్రాచీన లింగమిదియేయని తెల్పు
గుణముగా దనరి నివేదికలో శ్రీ మెకన్జీ, "ముది-
వర్ణించెను, అనగా (ముదిమల్లికార్జున) యని ఆ
(A. S. S. 11 917 పుట 2512) Asiatic R
132). గాన ఈ ముది శబ్దము నాటినుండి తెనుగు
చున్నది. ముదియనగా పూర్వమనియు, ఇంతకు
నాము. ఇక్కడ శకములయందు కూడ కనబడుచున్న

౭౩. పూర్వవు శకముల ప్రకారముగా, యా
మేరకు సృష్ట్యాదిశ, శకమును లెక్కించుచుందురు.
"Anno-mudi" A. M. అనుచున్నారు. Anno
త్సరమని అర్థము. మున్ + ది -ముంది లేక ముది
యని అర్థమగుచున్నది. కాన ఈ ముదిరాజు లేక మ
డియే కనబడుచున్నారని తెలియనగును. ౭౪

## గోత్రము : భరతమహారాజు చరిత్ర

భరతమహారాజు పురువు వంశమున పుట్టి, త
దత్తుగావచ్చిన దుష్యంత మహారాజునకు - శకుం
పుత్రుడు. ఇతనికి భరతుండను పేరు గలదు, ఇతనికి
నము కలుగకపోగా, భరద్వాజ మహాముని శిష్యు
'భమన్యుడు' లేక (హతమన్యుడు) ను సుతుని బడసె
రాజుల చరిత్రము గాన భారతమని పేరయ్యెను. భా
గులు, పురువు- లేక తుర్వసుని వంశమువారని, భ
యున్నది. భరద్వాజ గోత్రికులే 'ముత్తరాజులు' లేక

---

A. S. S. 119. p. 2512 Vol. B. 132. శ్రీ మెక
ఆంధ్ర విజ్ఞానము Vol. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి
•. ఆంధ్రవిజ్ఞానము Vol. శ్రీ కట్టమంచి రామలింగారె

నేటి ముత్తరాజుల ఇంటిపేరు గల నియోగి బ్రాహ్మణుకు భరద్వాజ గోత్రికులని యున్నది.[౭౩] కాన ముత్తరాచ, ముత్తరాస, ముత్తరాజ లేక ముదిరాజుల కులమువారు పాండవ, వంశమువారని శాసనకర్తలు చూపినట్లుచూచి యుంటిమిగదా.[౭౪] కాన నేటి ముత్తరాచలు భరద్వాజ గోత్రికులని తెలియనైనది.

---

౭౩. నియోగిబ్రాహ్మణుల మాసపత్రిక.

౭౪. చందతై శాసన - విమర్శన - EPI Inscription of South India Vol XIII-1915-16 (page 134).

## నాలుగవ ప్రకరణము

# ముత్తరాచకులము

ముత్తరాచకులము : ముత్తరాచకుల శబ్ద నిర్వచణ, అర్థముతో వివరించిన తర్వాత, ఈ ముత్తరాచకులము లేక తెగలను గురించి శ్రీ ఎడ్గర్ థస్టన్ పండితుడు, దక్షిణభారతదేశము తెగలు లేక కులములు అనే గ్రంథమందు నీ విధముగా చూపెను.

ముత్తరాచ అను పేరు స్వల్పభేదముతో ముత్తరాచ, ముత్తి రాజులు, ముత్తరాసర్ మరియు ముత్రాచలనికూడ కలదని వ్రాయ బడినది. తెలుగుదేశములో ఈ కులముపైన పేర్కొనబడిన యేదైన ఒక పేరుతోనున్నది. తమిళదేశములో ఈ కులమువారికి ముత్తరయన్ లేక పలయకరన్ లేక (పాళెగార్లు) అని పేరు గలదు.౧

౨. శ్రీ హెచ్. ఏ. స్టూఆర్టుగారు ముత్తరాచల గురించి ఈ విధముగా వ్రాసియున్నారు. క్రిష్ణా, కడప, ఉత్తర ఆర్కాట్ నెల్లూరు జిల్లాలలో ఈ కులమువారు తెలుగువారుగా పేర్కొనబడియున్నారు. విజయనగర రాజులు ముత్తరాజులను సరిహద్దుప్రాంతములను రక్షించు టకు కాపలదారులుగా నియమించిరి. వారికి పాళెగార్లు" అని బిరు దము నిచ్చిరి. ముత్తరాచ అనుపదమునకు మరియు ద్రవిడభాషలో 'ముది' అనగా ముసలి లేక పూర్వపు) మరియు 'రాచ' అనగా 'రాజు' లేక పరిపాలించువాడు. ఈ ప్రకారముగా తెలుగు దేశము యొక్క యేదైన భాగమును పరిపాలించిన వారు ముత్తరాచలు పేర్కొనబడిరి. చంద్రగిరిలో (దొరలు)గా చలామణి అయ్యేడివారు పాళెగార్ల పాలనక్రిందవున్న చాల గ్రామములలో ముత్రాచవారే పాళెగార్లుగా పరిపాలించేవారు.

---

౧. కులములు లేక తెగలు దక్షిణభారతము (పుట. 127-131).

ఈ కులమువారు విజయనగర రాజుల కాలములో తెలుగు దేశమున ప్రవేశించినట్లు కానవచ్చుచున్నది. విజయనగరరాజులు వారిని 'కావలి' గార్లుగా నియమించియుండిరి.

1891 మద్రాసు జనాభగణన నివేదిక, ఉత్తర ఆర్కాటుజిల్లాలోను, చంద్రగిరికి, నెల్లూరు జిల్లాలోను, ముత్తరాచలు, ఉరలీయొక్క ముత్తరయున్‌గాకూడ వ్రాయించిరి. తెలగారీలు - తెలగారీలు కూడ ముత్తరాచలవంటివారు. ఒక పేరు కొన్ని ప్రదేశములలో ముత్తరాచలకు మరియు గొల్లల మధ్య సంబంధములుండెను. అవి రెండు కులములు (Left Hand section) ఎడమ భుజముకు సంబంధించినవి. గొల్లల మరియు మాదిగల వివాహములు జరుగునప్పుడు బెడసియుండెడివి. "ఆకు-పోకలు - ముత్తరాచలకొరకు గౌరవసూచకముగా తీసిపెట్టే వారు." తెలుగుదేశములో ముత్రాచలకు జెందిన రెండుతెగలు గలవు. వారు 'పాళెగార్లు' మరియు 'ఓరుగంట్లు' అనగా (ఓరుగంటిరెడ్డి) వారియింటిపేర్లలో కొంతసమన్వయము కలదు. కొందరు ముత్తరాచలు చిన్నచిన్న పరిపాలకులుగా నుండుట, ఆధారముపై వారు క్షత్రియులనికూడ చెప్పుకొనిరి.[౨]

Note : In some places, the relation between the mutha racha and Gollas, both of which castes belong to the left hand section are strained on occasion of marriage among the madigas, some pan-suprai (betal leaves and aroccanuts) is set apart for the mutharachas as a mark of Respect" (p127-138) and see in themadiga caste History.

౩. మధ్యప్రదేశము సెంట్రల్ ప్రావిన్స్‌కు జెందిన, చాందా, నాగపూర్, ఇతర మహారాష్ట్ర జిల్లాలో నున్న ముత్తరాచలను,

---

౨. కులములు లేక తెగలు దక్షిణభారతము **Voi. V** (పుట. 127-131)

శ్రీ ఆర్. వి. రస్సల్ పండితుడు వీరు క్షత్రియులని, పై సమాచారము మాదిరిగా పేర్కొనినాడు.౩

౪. శ్రీ సయీద్ సిరాజుల్ హసన్ గారు, కులములు లేక తెగలు నిజాం డొమినియన్ హైదరాబాద్ గ్రంథమందు 'ముత్రాసి' లగురించి ఈ విధముగా వ్రాసినారు.

"ముత్రాసి, ముతరాజ లేక మోదిరాజ, కోలీ, నాయక్, బంటు తెలుంగోడ్, తెనుగోడ్, తెలగ, ఒక పెద్ద వ్యవసాయ మరి వేటాడు వారు." మరియు కూలీలుగా నుండు ద్రవిడజాతులనుండి వచ్చినవారు. వీరిని గ్రామ కావలి (watchman) మన్నెవారు అనే బిరుదుతో గ్రామ తలయారీ లేక (తలారీ)గా ఉండెడివారు. వీరు బహుకాలము క్రిందట సైన్యమునయొద్ద యోధులుగా, సిపాయిలుగా లేక బంట్లుగా కొలువుం డెడివారు.' వీరుండు స్థలము ఈ తెలుగుదేశము తెలుగు మాట్లాడె జిల్లాలు. వీరు అడవిజాతులమాదిరిగా నుండిరి. మరియు తెలుగు నాడు సంపూర్ణముగా వ్యాపించిన మహోన్నత జాతి ము త్తరాచవారు. అన్నిరంగములందును అన్ని పనుల లోను, ఇతరులతో కన్న దేశము నకు చాల ఆరివారినవారు. పాత నమ్మకము గలవారు. ఈ విషయము చూచినట్లు అవుతే, వీరు నిజముగా మొత్తము తెలంగాణ, మరియు తెలుగుజాతీయులు, తెలుగు మాట్లాడె జిల్లాలలో నుండువారు.౪

౫. ద్రవిడులు - ఎవరు ?

ద్రవిడులనగా ఎవరు ? అని ప్రపంచ చరిత్రకారుడైన శ్రీ హార్మ్ స్ గారు చూపినది, వైదిక్ సంపత్తిలో శ్రీ రఘునందన్ శర్మ 'రు చూపిన సమాచారమును ఈ దిగువ చూపుచున్నాము. ాబిడులు- తెలగాలు- ద్రావిడులు దక్షిణ భారతములోని ఆది

౩. కులములు లేక తెగలు సెంట్రల్ ప్రావిన్స్ (పుట.౩౯౨).

౪. నిజాం డొమినియన్

వాసులు. వీరు అనార్యులు, నైజాము పరిపాలనలోని తెలుగు వారు లేక తెలింగాలు, తమిళులు, కన్నడలు, మలబారులోని మలయాళీలు, ఈ ద్రవిడ జాతికి చెందినవారు. వింధ్యపర్వతములలోని, గోండ్లు, సిలోనులోని, సింహళీనులు, వడ్డాలు మంగోలి జాతీయులు, మొదలగు వారు, కాకేసిక్ మాదిరిగా పోడుగున రక్తసంబంధ. సమానముగా కలిసి యుండినవారు.

Note- Dravidions. Indigenous, non Aryan Inhabitant of South India including the telingas or Telugu of the Nizams' dominion, the Tamil, karnatic and Cylone, the kanaras of Mysore, the malayalim of malabar cost, those wildhunters, the gonds of vindya hills, the Sinhalies of Cylone and perhapes the Veddahas mongolid - race, origionally which been a as miliated to the caucasic type by long inter mixture of blood. (H. W. H.W p. 326) (Vidic sampathy p 185)

శ్రీహర్మవర్త్ గారు పైచూపిన ద్రవిడుల సమాచారము సత్య దూరమై యుండవచ్చును. కాని తెలుగువారిని గురించి వ్రాసినది సరి కాదు. తెలుగువారు మధ్య దక్షిణాపథములో రామ ప్రమార రాజు క్షత్రి యుడు రాక పూర్వము వున్నట్లు కనబడుచున్నది. వీరు ఆర్యవంశీకులని, ఆర్యశూద్రులని చరిత్రకారులు చూపుటకద్దు. ద్రవిడులు ఎవరు? ద్రవిడ పదమునకు అర్థము 'తరమబడినవారు.' (Drived peoples) కదా మరి తెనుగువారు రామప్రమారరాజులకు సహాయపడినట్లు రామ ప్రమారరాజు చరిత్రలోయున్నదిగదా! మరి నాగులు మొదటివారా, లేక రామప్రమారరాజు మొదటివాడ, రామప్రమారశాఖలోని శ్రీశాలి వాహానుడు ఏడవవాడు. అప్పటికి నాగులు దండకా అరణ్యము, మాలవ రాజ్యములోయున్నట్లు, అట్టి నాగకన్యను శాలివాహానుడు వివాహాము

చేసుకొన్నట్లు చూచితిమిగదా! మరి నాగులు మణినాగపురమునుండి వచ్చినట్లు దక్షిణాదిన స్థిరనివాసములు చేసుకొన్నట్లు శ్రీనాగభీమరాజు తనశాసనములో చూపినాడు. కాన ఈ నాగులను ఉత్తరాదివారు తరిమినట్లును, దక్షిణాదిలో తెనుగువారితో పోట్లాడి వెనుకకుపోగల మాయని, దక్షిణ జనపథములో స్థిరనివాసము ఏర్పాట్లుచేసుకొన్నందు వల్ల, వారు "తరుమబడినవారు." కాన నాగులు ద్రవిడులని తెలియు చున్నది. ద్రావిడులగురించి మూల నివాసులు - వారి మౌలిక రహస్యము చూడుడు. - (వైదిక్ సంపత్తి).[౫]

౫. హార్మ్స్‌వర్త్ - హిస్టరి వరల్డ్ . (పు. 326). వైదిక్ సంపత్తి పుట-185.

ఐదవ ప్రకరణము

# కళభ్రులు

ముత్తరాచలు తెలుగుదేశమునుండి వలసపోయి, తమిళదేశములో ముత్తరయర్లు. పాళెగార్లుగా పిలువబడునట్లు, తెగలు లేక కులములు (Caste & tribes of Southern India) అనే గ్రంధమందు చూపినాడు.

తమిళనాడుకు వలసపోయిన వారిలో మొట్టమొదటి కళభ్రులు లేక కళప్రభువులు, అని డా॥ రాజమానిక్యంగారు తమ పల్లవచరిత్రలో ఇట్లు వ్రాసినారు.

౧. ముత్తరాచలు-కళభ్రులు,కళభులు లేక కళప్రభువులు, మొదటి శతాబ్దము నుండియో లేక రెండవ శతాబ్దమునుండియో, వీరు ముత్తరయర్ రాజులుగా పిలవబడుచున్నారు. వీరు కళభ్రజాతికి (tribes) చెందినవారని, వీరుండేచోటు ప్రస్తుతపు "కాళహస్తి" కొండలుగల అరణ్యప్రాంతమని, వారు ఏ విధముగా రాజులుగా మారి, దక్షిణాది యైన మధురైకు వలస వచ్చినారో ఆశతాద్ధమును ఈ క్రిందపొందు పరుచుచున్నాను.

(౧). క్రీ. శ. ౨౦౦ నుండి ౨౨౫ A. D. — ప్రస్తుతము నెల్లూరు మండలములోని దక్షిణభాగము తమిళనాడులోని ఉత్తర ఆర్కాటు జిల్లాలోని కొంత భూభాగము చంగల్‌పట్టు జిల్లాలో వుండబడిన యంత యును తొండైనాడు ప్రదేశమునకు అప్పట్లో వలస వచ్చిరి.

(౨) క్రీ. శ. ౨౨౫ నుండి ౨౫౦ A. D. — ఈ తొండైనాడు నుండి చోళనాడుకి వలసపోయిరి. సోలినాడు అనగా చోళ

నాడు (ఉత్తర ఆర్కాట్టు) దక్షిణ ఆర్కాటు, తంజావూర్, ట్రిచ్చినాపల్లి కలసినభాగము.

౩. క్రీ. శ. ౨౨౫ నుండి ౫౭౫ A.D.(౨౫౦-౨౭౫) కళభ్రులు రాజులై చోళమండలములోని కొన్ని ప్రదేశములు పరిపాలించిరి.

౪. క్రీ.శ. ౨౫౦ నుండి ౩౦౦AD (౨౭౫-౩౧౦) చోళనాడునుండి పాండ్యనాడుకి వలస పోయిరి. ప్రస్తుత మధుర, రామనాధజిల్లా పాండ్యనాడులోనిది. టిరుల్‌వెళ్ళి జిల్లాలు ఈ చోళనాటిలో కలసియుండెను.

(౫). క్రీ. శ. ౨౫౦ నుండి ౫౫౦ A.D(౩౦౦-౫౫౦) కళభ్రులు పాండ్యనాడుని పరిపాలించిరి.

(౬). క్రీ. శ ౫౫౦ AD తర్వాత కళభ్రుల పరిపాలనలో క్షీణదశ పొంది, పదవశతాబ్దమువరకు, పల్లవులు, పాండ్యురాజుల క్రింద సామంతులుగా నుండిరి. తమిళదేశముపై కళభ్రులు లేక కళప్రభువులు, మొదటి క్రీస్తు శతాబ్దము నుండి – ఆరవ శతాబ్దము చోళులు మరి పాండ్యులు కళభ్రుల దాడికి గురిఅవుతు వుండిరి. ఈ కళభ్రులయొక్క సంతతివారే తర్వాత ముత్తరయర్లు. వీరే పల్లవులసామంతపరిపాలకులు. ప్రస్తుతము 'కల్లరు' అనబడు తమిళ శాఖ ఒకటి కళభ్రాల యొక్క వంశస్తులే యని శ్రీ ఏ. యస్. పరమశివ ఆనందగారు తమిళనాడు చరిత్రలో చూపిరి. (పుట. ౧౭౬-౧౭౮) ౧ పై కాలమానము సరియైనదిగా చూపబడలేదు.

౭. ఈ కళభ్రుల గురించి శ్రీ దివాన్ బహద్దుర్ డా॥ క్రిష్ణ

---

౧. పల్లవుల చరిత్ర డా॥ రాజమాణిక్యం (పు. ౩౭-౪౪).

స్వామి అయ్యంగార్ M. A. తమ దక్షిణ హిందుదేశ చరిత్రలో ఈ విధముగా చూపినారు.

దక్షిణహిందుదేశచరిత్రలో కళభ్రల గురించి పరిపరి విధములుగా కనబడుచున్నది. వీరిని పల్లవ విరోధులైనవారితోపాటు కలిపి చూపి నారు, అనగా ఈకళభ్రలు పాండ్యులతోపాటు వ్రాసిన చరిత్రలలోను, పాండ్యులు పడిపోయిన తర్వాత వీరు రావడము, పల్లవులతోనుండినట్లు కనబడుచున్నది.[౨]

౩. స్వర్గీయులైన వెంకయ్యగారు ఉద్దేశమును చూస్తే వీరు ఎక్కడి తెలియనివారు. కాని వీరు కర్ణాటకజైనులు అని "పెరియా పురాణము"లో చూపిన "ముర్తినయనార్" లేక (ముత్తినయనార్) జీవితచరిత్రలో పాండ్యులను పడద్రోసిన, మధురనేలినవాడని కనబడు చున్నది. ఈ ముత్తనయనార్ యొక్క సంతతే కళభ్రలు, ఈ కళభ్రలే ముత్తరయర్లుగా వెలుగెత్తినవారు. ఆ కళభ్రలలో ప్రఖ్యాతిజెందిన రాజులు.[౩]

౪. బుద్ధదత్తుడను బౌద్ధసన్యాసి పాళిభాషలో వ్రాసిన (అభిదమ్మ వత్తరమ్) అను పుస్తకమునుబట్టి "ఆచ్యుతవిక్రమత్తమ్" అను కళభ్ర రాజు చోళనాటిని, పుహర్‌ను రాజాధానిగా చేసుకొని పరిపాలించెను. ఇది యిప్పుడు తంజావూరు జిల్లాలో ఒక చిన్న కోటగా కనబడు చున్నది. పై చెప్పిన బౌద్ధసన్యాసి క్రీ. శ. ౩౫౦ ప్రాంతములో నివసించి నట్లుగా తెలియుచున్నది. ఈ రాజుయొక్క పేరు తమిళ గ్రంథములో "యాపేరుంగళకారియగై" పద్యకావ్యమున కలదు. పుహర్ కావేరి నదికి ఉత్తరమున, సముద్రమునందు కలియుచోటు, పెరియపురాణ మును బట్టి "కుట్రువనయనార్" కళభ్రరాజనియు, శివునిచే కిరీటమును

---

౨. దక్షిణ హిందుదేశ చరిత్ర – డా॥ క్రిష్ణస్వామి ఆయ్యర్ M.A.

౩. పల్లవ చరిత్ర డా॥ రాజమాణిక్యం (పుట ౩౭-౪౪) మరియు హిందుదేశ చరిత్ర-శ్రీ నీలకంఠశాస్త్రి

ధరించి ఆశీర్వదించబడినాడు అని తెలియుచున్నది, అతను చోళదేశ మును స్వాధీనము చేసుకున్న తర్వాత ఇతడు సన్యాసము స్వీకరించెను. మరియొక సన్యాసి "ఇడైయన్ కలినయనార్" ఈయనకూడ కొడుంబ లూర్గును పరిపాలించిన కళభ్రరాజనియు, తెలియుచున్నది. కొడుంబలూరు కావేరినదికి దక్షిణమున యున్నది.

(౧) ముర్తినయనార్ (ముత్తనయనార్) మధురైనాడు
(౨) అచ్యుతవిక్రాంధన్ పుహార్
(౩) ఇడైయర్-కలినయనార్ కొడుంబలూరు
(౪) కుట్రవనయనార్-చోళనాటిని గెలిచి పరిపాలించెను.
తర్వాత ఇతను సన్యాసము తీసుకొనెను.[4]

(**పల్లవ చరిత్ర**): పెరియపురాణము, తొండైపురాణము మాదిరిగా శైవపురాణము, తెలుగుశైవభక్తుడైన పాల్కురికి సోమనాథుడు రచించిన (బసవపురాణము)లో ఇద్దరి శైవభక్తులను గురించి వ్రాసిన కథలలో జాతివాచకముగా ప్రయోగించియున్నాడు. ఇది చరిత్రకు అందినను అందకపోయినను ప్రత్యక్షముగా కనబడుచున్నది. తెలుగు జోమ్మయ్య లేక బొమ్మయ్య మరియు కన్నప్పగార్లు, అంబలకరన్ అనువారు ముత్తరాచలటువంటివారు, వారు కన్నప్ప వంశస్తులమని కులములు లేక తెగలు దక్షిణ హిందుదేశ చరిత్రలో వ్రాసుకొనిరి.

పాల్కురికి సోమనాథుడు కాకతీయ ప్రథాపరుద్రరాజుల కాలమందు బసవపురాణమును రచించెను. సిద్ధేశ్వర చరిత్ర, బసవపురాణము లలోను, ఆంధ్రదేశమున తెలగ నాయుళ్ళు గాక ఓరుగంటిలో తెలుగు వాంద్రు ౯౨౦౦ ఇండ్లువాంద్రు ఉండిరని పేర్కొనబడినది. మరియు

౪. పల్లవ చరిత్ర మరియు పెరియా పురాణము.

పండితారాధ్యచరిత్రము, పర్వతప్రకరణములో కొన్ని దేశముల గ్రామ సంఖ్య ఇట్లు వివరింపబడియున్నది.

జానొందనవలి పంచద్రావిశములలో, నవలక్ష "తెలుంగు" దీనికిని యిమ్మడిముమ్మడి యితర దేశములు అనగా పంచద్రావిడ దేశములలోని, తెలుగుదేశమున: నవలక్ష గ్రామములుండినట్లు చూపినాడు.[౫] మరియు శ్రీ విద్యానాథుడు తమ ప్రథాపరుద్రీయంలో ఈ విధముగా చూపినారు. నవలక్ష ధనుర్ధరాధి నాథేపృథివీం శాసతి వీరరుద్ర దేవే, అనగా తొమ్మిదిలక్షుల విలుకాండ్రకు ప్రథాపరుద్రుడు అధిపతి అని శ్లోకములో కనబడుచున్నది.[౬]

౫. బసవ పురాణము, సిద్దేశ్వర చరిత్ర-పండితారాధ్య చరిత్ర శ్రీ పాల్కూరి సోమనాథుడు.

౬. శ్రీవిద్యానాథుడు.

# చోళనాడు-కళభ్రలు-ముత్తరయర్లు

కళభ్రలు లేక కళప్రభువులలో ఐదవశతాబ్దమున పల్లవసామంతులైనవారు. పాండ్యులను జయించి మధుర నేలినవారిలో "పెరుంబిడుగు ముత్తరయన్ - సువరన్ - మారన్ ప్రసిద్ధుడు." వీరు ముత్తరాజులు అనగా ముదిరాజులు, మూడుతరముల వారు, వీరు పల్లవసామంతులై యుండి పాండ్యులను అణచిపెట్టియుండినట్లు తెలియుచున్నది.[1]

౨. ఈ కళభ్రలకు క్రీ. శ. (౬) ఆరవ శతాబ్దమున పల్లవులు, పాండ్యులు మాటిమాటికి అడ్డుపడుచుండిరి. అందుచేత వారు పాండ్యులకు, పల్లవులకు సామంతులుగానుండవలసివచ్చెను.

చందలై (తంజావూరు జిల్లా)లో దొరికిన దేవాలయ శాసనముననుబట్టి, ఈ కళభ్రలే తర్వాత ముత్తరయర్లు అని పిలువబడిరనియు, చోళనాటిలో పరిపాలించిరనియు తెలియుచున్నది. ఈ చందలై శాసనము బట్టి, దేవాలయ స్థంభము మీద చెక్కబడిన రాజుల పేర్లు ఈ క్రింది విధముగా నున్నవి.

(౧) శ్రీ పెరుంబిడుగు ముత్తరయన్ (అలియాస్) కువవాన్-మారన్.
(౨) శ్రీ ఇలంగోవాళ్ ఆర్యనార్ ,, మారన్-పరమేశ్వరన్)
(౩) శ్రీ పెరుంబిడుగు ముత్తరయన్ ,, సువరన్-మారన్

ఈ మూడవరాజుకు ఇతర బిరుదులు, శ్రీ మారన్, శ్రీకళ్వర్ కావలన్, శ్రీ శత్రుకేసరి, శ్రీ కళభ్రకావలన్, శ్రీ అభిమానాధిరాన్, అతిసాహసాన్, తమరలైయాన్, శేరుమారన్, వెల్మారన్, వన్ మారన్, మరియు సత్తాన్ మారన్. యుద్ధములు అయినకొద్దీ ఈ పై యుద్ధనామములు ధరించియు, పెక్కు విధముల పేర్కొనబడి

---

౧. తెలుగువారెవరు ? - శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి

యున్నాడు. ఈ రాజులు పాండ్యులను జయించిన వెంటనే 'మారన్' అను పేరు పెట్టుకొనిరి.

ఈ విధముగా చూచినచో కొడుంబాలూరు ముత్తరయర్ రాజులు పాండ్యులకు సామంతులుగాను, చందలైలోనున్న ముత్త రాజులు, పల్లవ సామంతులుగాను వుండినట్లు కనబడుచున్నది. మరియు 'తమిళనాలడియార్' అను జైనగ్రంథమందు నం॥ ౨౦౦, ౨౪౩ మరియు ౨౬౯వ, పద్యములలో పెరుముత్తరయర్ రాజుల గురించి పేర్కొనబడినది. పాండ్యనాటిని క్రీ. శ. ౩౦౦-౪౨౦ AD. లో ముత్తరయర్ పాలించిన కాలమున, మధురలో జైనసమావేశము జరిగెను. పై చెప్పబడిన (నాలడియార్) పద్యములు జైన సన్యాసిలు ముత్తరయర్ రాజులను పొగుడుచు వ్రాసిరి.౨

౮. శ్రీ టి. యస్. బాలసుందరం పిళ్ళై వ్రాసిన(నాలడియార్) గ్రంథములో దొరికిన పద్యమునం॥ ౨౦౦ (పుట ౧౫౭)తమిళ శబ్దములో ఈ విధముగా నున్నది.

౧ ౨ ౩ ౪

పెరు - ముత్తరయర్ - పెరిత్తు - యువందు - ఈయమ్.

౫ ౬ ౭

కురుతైచోరు ఆరవార్ కైయావార్.

అర్థము : పెద్దముత్తరయర్ వారు, చాల సంతోషంగా, ఇచ్చెట్టు మిన్నకూరగాయలతోటి వండిన అన్నము, తిని బ్రతుకుతున్న వారు-తగ్గినవారు, (౭) కైయావార్ అనే తమిళప్రజలైన చిన్న పరిమాణ ముతో తినియుండెడివారని కనబడుచున్నది.

పై పద్యకావ్యమును చూచినచో, తక్కువ పరిమాణమునకు జెందిన ప్రజలు శ్రీ పెరుముత్తరయర్" (ముత్తరాజు) సంతోషముతో

---

౨. పల్లవచరిత్ర. (పుట. ౩౭-౪౪) డా. రాజమానిక్యం.

పెట్టిన రుచిగల పదార్థమును తిని యుండెడివారు. తా. శ్రీ పెరు ముత్తరయర్" (ముత్తరాజు) ను ప్రజల పిలుపులో వారు, చాల గొప్ప ధనవంతులని, మరియు దానధర్మములు చేయువారని, మరియు (పెద్దమర్యాదగల కులమునకు జెందిన వారని వాడుకొందురు). "పెరు ముత్తరయర్ (ముత్తరాజు) అనువారు గొప్పగా జీవించిన పిదప బీద తనము వచ్చిన వేళలో, ధనవంతులకు చేలుజాపని వారని పొగుడుచు వ్రాసినారు.

పద్యము నం॥ ౨౯౬. మల్లన్-మాన్యాలత్-వాల్-ఓవరుల్-ఎల్లామ్,
సిల్వరెనినమ్-కుడాదవల్-నలుకురుందార్,
నల్కురుందాకన్నమ్ - పెరుముత్తరయరే,
సిల్వరై - చంద్రయిర - వాదవల్.

పై పద్యమువలె, తమిళ (నాలడియార్) గ్రంథములో 'శ్రీ పెరుముత్తరయర్' ఒక గొప్ప దానకర్ణుడని, తన పరిస్థితి దిగజారినప్ప టికి, ధనవంతుల సహాయము ఆపేక్షించకుండ యథావిధముగా బీదలకు నిరాటంకముగా, నిత్యాన్నదానము చేసెడివాడని మనకు తెలియు చున్నది, ముత్తరయర్ పాండ్యరాజ్యములో ఒక దక్షిణభారతదేశ చరిత్రలో ముత్తరయన్ వంశస్థుల ప్రాముఖ్యముగా నున్నది.[3]

౪. శ్రీ టి. వి. సదాశివపండారాత్తర్, అన్నామలై, ఈ విధ ముగా చోళచరిత్రయందు, ముత్తరయర్ల గురించి వ్రాసినారు. క్రీ. శ. (౮) ఎనిమిదవ శతాబ్దమునుండి 'ముత్తరయన్' తంజైక్కోన్' (తంజాపురప్రభువు) అనియు 'తంజైనన్పగళాళన్' (తంజావూరికి మంచిప్రసిద్ధి తెచ్చినవాడు) అనియు శాసనములలో చెప్పబడియుండుట చేత, తంజామహానగరము క్రీ.శ. (౯) తొమ్మిదవ శతాబ్దమున చోళులు రాజాధానియగుటకు ముందు. ముత్తరయర్ (ముత్తరాజుల)కు జెందిన గొప్ప నగరముగా ఉండినదనుట చక్కగా తెలియుచున్నది. ఇక్కడ

---

౩. నాలదియార్ (పుట. ౧౫౭) టి. యస్. బాలసుందరంపిల్లై.

గొప్పనగరముగా ఉండినదనుట చక్కగా తెలియుచున్నది. ఇక్కడ ముత్తరయర్లు (ముత్తరాజులు) అనుబడువారు తంజైమహానగరమునకు పశ్చిమోత్తరమున, ఈకాలమున చందలై అనబడునట్టి చంద్రలేఖ చతుర్వేది మంగళమనగా అగ్రహారము నుండి దానికి చుట్టుపట్టులనున్న నాడును పాలించిన సామంతమాండలికులు తంజాపురమునకు సమీపముననున్న 'వల్ల' మనుప్రదేశమును, ముత్తరాజులు(ముత్తరయర్లు)కు రాజధానీ నగరముగా నుండియుండుననియు తెలియుచున్నది, వీరికి 'పెరుంబిడుగు', 'విడెల్ విడుగు', 'మార్పిడుగు', 'పగా పిడుగు', మొదలైన, పల్లవరాజుల బిరుదములుండుటచేత, వీరు పల్లవులకు కప్పము కట్టు మాండలికులుగా నుండియుండుటచేత వీరు పల్లవులకు కప్పము కట్టు మాండలీకులుగా నుండియుండురనుట స్పష్టము. 'ప్రాచీన రాజవంశమైన ముత్తరాజుల గొప్పతనము' 'పదినెన్ కిళుకిణుక్కు' అనుబడు ప్రాచీనగ్రంథావళిలో నొకటైన (నాలడియార్)లో ఇట్లు గొప్పగా పొగడబడిన "పెరుముత్తరయర్-పెరిత్తు - యువందు ఈయమ్ కురళై చోరు", అనగా 'పెద్దముత్తరయర్ ముత్తరాజులు గొప్పగా ఇచ్చు కరుణతోడి అన్నము', అనుటచే తెలియును. ఈ (నాలడియార్) గ్రంథమందున్న పద్యము నం॥ ౨౦౦ మరియు ౨౯౬ ను గురించి ముందే చూపబడినది. ఈ ముత్తరాజులే, (౮) ఎనిమిదవ శతాబ్దమున తంజావూరు, తిరుచునాపల్లి నగరములకు నడిమధ్య చిన్న మండలమును పాలించిరి. పల్లవులకు సామంతులుగా పాలించినారని చందలై శాసనములో తెలియుచున్నది. అప్పుడు వారు పాండ్యులను జయించిరనియు, ఈ శాసనముచేత తెలియుచున్నది. ఈకాలమున పళయార్రై నగరమునుండి చోళులు ఆ ప్రాంతదేశమును పాలించుచూ, తమకు చేరవలసిన, చోళరాజ్యభాగములను మరల నాక్రమింప సమయము చూచుచుండిరనియు, ముందే చెప్పబడినది. అనగా క్రీ. శ. (౮౪౬) ఎనిమిది వందల నలుబదియారవ సంవత్సరమున పళయార్రై నగరము నుండి విజయాలయ చోళుడు, విడెల్ విడుగు ముత్తరయర్ - V (విడెల్

విడుగు ముత్తరాజు) నుండి కప్పము గ్రహించుచుండిన రాజేవరో, వారిని విజయాలయుని బారి నుండి రక్షించనట్లు కానరాదు ౪

౫. శ్రీ ఏ. నీలకంఠశాస్త్రిగారు తమ దక్షిణ భారతచరిత్రలో ముత్తరయర్; (ముత్తరాజుల) చరిత్రను గురించి ఈ విధముగా వ్రాసి యున్నారు. క్రీ॥శ॥ ౯ తొమ్మిదవ శతాబ్దమున చోళులు, ముత్తరాజు లను జయించి, రాజ్యమును సంపాదించిరని తెలియుచున్నది. ఈ చోళ సామ్రాజ్యమును ప్రారంభించినవాడు ఈ కాలమున విజయాలుడు. ఈకాలమప్పటికి ముత్తరాజులు తంజావూరు జిల్లాలో, సారవంతమైన భూమి ఆక్రమించి పాలించుటచే చరిత్రకు ప్రసిద్ధులైరి. వారి శాసన ములు సంతలై వద్ద కనబడుచున్నవి. ముత్తరాజుల యొక్క రాజాధాని 'సంతలై'గాని లేక 'నియమ్'గాని అయియుండవచ్చును. ఈ శాసనము వలన వారు తంజావూరును కూడ పరిపాలించుచున్నట్లు తెలియు చున్నది. చోళులవలనే ముత్తరాజులు కూడ సర్వస్వతంత్ర పరిపాలన స్థాపించియుండిరి మరియు వారు పాండ్యులతోను, లేక పల్లవులతోను కలసి యుండిరి. శాసనములనుబట్టి వారు ఎప్పటికప్పుడు పరిస్థితి అను కూలముగా పరిపాలన చేయుచుండిరి. వీరు వరగుణవర్మ పాండ్యరాజు ప్రోద్బలముచేతనో లేక వారి ఇష్టానుసారముగానో, పాండ్యులతో కలసి పోయిరి. అందుకు పల్లవులు అనుకూలముగా లేనందున తంజా వూరు విజయాలునికి దక్కినది. పల్లవరాజు ఏ విధమైన సందేహములు చోళరాజుపై పెట్టుకోలేదు. విజయాలుడు తాను నిర్మించబోవు సామ్రాజ్యమునకు ఇది విజయ నాందియని తలచలేదు. విజయాలుని విజయము పాండ్య వర్గుణవర్మ సన్నిహితులైన ముత్తరాజుల వంశ వినాశనమునకు దారి తీసినది. వర్గుణవర్మ కలిగిన నష్టమును తిరిగి సంపాదించుటకు విజయాలునిపై దండెత్తెను. శ్రీపురంబియమ్‌వద్ద జరిగిన యుద్ధములో, పల్లవరాజు (అపరజిత) ఆదిత్యునికి, ఇది వరలో

---

౪. చోళచరిత్ర. (పుట. 16-17) టి. వి. సదాశివపండారాతార్.

తన తండ్రి ముత్తరయ్యర్ రాజులనుండి సంపాదించిన రాజ్యమునకు చుట్టుప్రక్కల నుండు భాగములను చేర్చుకొనెను.* ఇక్కడ ముత్త రాజులు పల్లవులకు పూర్వము పరిపాలన జేసి యుండిరని, వారితో వోడిపోయి వారికి సామంతులుగా నుండినట్లు కనబడుచున్నది.*

౬. క్రీ॥ శే॥ డా. రాజమాణిక్యంగారు తమ 'తమిళవరలారు' అను గ్రంథమున (ముత్తరయర్) ముత్తరాజుల వంశావళిని ఇట్లు తెలిపియున్నారు.

దక్షిణభారతచరిత్రలో క్రీ.శ. ౬౦౦ AD. నుండి౯౦౦, ఈమధ్యగల కాలంలో(ముత్తరయన్)ముత్తరాజుల వంశావళిని గురించిన సందర్భములుఅనేకములుగా కనబడుచున్నవి. ఈ వంశస్థులు చోళరాజ్యంలోని అంతర్భాగమైన, ఒక ప్రదేశమును 'సందలై' లేక(చంద్రలేఖ) మండలమును రాజాధానిగా చేసుకొని పరిపాలించిరి. ఈ రాజాధాని యందలి శివాలయములోగల రాతిచక్కడంలో కొన్ని కొన్ని (ముత్తరయర్ల) ముత్తరాజుల పేర్లు మనకు తెలియుచున్నవి. అందులో ముఖ్యమైనటువంటివి. ఈ విధముగా నున్నవి.

(౧) శ్రీ పెరుంబిడుగు ముత్తరయర్ I (ముత్తరాజు) (అలియాస్) కువహన్-మారన్
క్రీ.శ. ౬౦౦-౬౩౦ A D.

(౨) శ్రీ ఇలంగోవతి అరైయన్ ,, (అలియాస్)మారన్-పరమేశ్వరన్-క్రీ శ. ౬౩౦-౬౬౦ AD.

(౩) శ్రీ పెరుంబిడుగు ముత్తరయర్ II (ముత్తరాజు) (అలియాస్) సువరన్_మారన్
క్రీ.శ. ౬౬౦-౬౯౦A D.

(౪) శ్రీ విడిల్ విడుగు శత్తాన్ మారన్ (ముత్తరాజు)
క్రీ. శ. ౬౯౦-౭౨౦ A.D.

---

*. చోళచరిత్ర. (పుట. ౨౦-౨౧) శ్రీ A. నీలకంఠశాస్త్రి మరి దక్షిణ భారతదేశ చరిత్ర పు. 146-147).

(౫) శ్రీ విడిల్ విడుగు ముత్తరయర్ III ,, క్రీ.శ ౭౨౦-౭౫౦ A.D.
(౬) శ్రీ శత్తాన్ పళియిలి ,, క్రీ శ. ౭౫౧-౭౮౦ A.D.
(౭) శ్రీ మార్పిడుగు ,, క్రీ.శ. ౭౮౦-౮౧౧ A.D.
(౮) శ్రీ శత్రుభయంకర ముత్తరయర్ IV ,, క్రీ.శ. ౮౧౦-౮౪౦ A.D.
(౯) శ్రీ విడిల్ విడుగు ముత్తరయర్ V ,, క్రీ.శ. ౮౪౦-౮౭౦ A.D.

దక్షిణ భారతదేశములో ముత్తరయర్ రాజులు క్రీ.శ. ౬౦౦ నుండి ౯౦౦ AD వరకు చెరిగిపోని ముద్రవేసిరి. శ్రీ విజయాలయచోళుడు, శ్రీ విడిల్ విడుగు ముత్తరయన్ V న్ను వోడించి వారి రాజ్యమున కల్పుకోవడముతో ఈ ముత్తరయర్ పరిపాలన అంతమొందినది.౬

(EpI. Vole. XIII. 1915-16 పుట. 133-149.)

౨. ఈ వోటమి తర్వాత పల్లవులవద్ద ముత్తరయర్లు (ముత్త రాజులు) ఉద్యోగములుచేయు మొదలిడిరి. పల్లవరాజైన, నందివర్మ II క్రీ.శ. ౬౧౮-౬౫౫ A.D. పరిపాలనలో ముత్తరయర్లు సైన్యములోను, పరిపాలనలోను మంచిఉద్యోగములు ఆక్రమించిరి. పల్లవుల పరిపాలనలో వారు ఘనమైన ప్రతిష్ఠను కలిగియుండిరి. పల్లవుల ఓటమి తర్వాత చోళులు దక్షిణదేశమును కొంతకాలము పరిపాలించిరి. ఈ చోళరాజుల పరిపాలనలో 'ఇరుక్కు-వల్లార్' అను ఒక రైతు (వ్యవసాయ కులము వారు). ఇరుక్కువలార్ అనగా (ఇరుక్కు-వేలార్) 'వేలార్ అనగా రాజులు,' 'వెల్లలార్' అనగా వ్యవసాయ దారులు - 'కృషివలలు,' చోళులకు మరి ముత్తరయర్లకు వెళార్ అని శాసనములలో కనబడినది. ఈ ఇరుక్కు వెళ్లార్ శాఖతో పెండ్లి సంబంధములు చేసుకొని, తర్వాత చోళరాజ్యములో ఉన్నత పదవులను, ఆక్రమించుకొని, తర్వాత పాండ్యులను, చోళులను వోడింప చేసిరి. వారి అధికారమును దక్షిణ

౬. తమిళవరళరులు, (పు. 146-147) - డా॥ రాజమానిక్యం మరి (EP1 Vole. XIII -1915-16 p. 134 to 149).

భారతదేశములో అంతమొందించిరి. చోళుల పరిపాలన, క్షీణిత ప్రారంభించగానే, ముత్తరయర్లు ప్రాముఖ్యత గూడ తగ్గిపోయెనని, నమ్మకమునకు వచ్చి పల్లవ సామంతులుగా నుండిరి. పల్లవ సామంతరాజైన పెరుంబిడుగు ముత్తరయర్ II (అలియాస్) సువరన్-మారన్, పాండ్యులను అణిచి మధురనేలినవాడు. క్రీ.శ. ౮౮౦-౮౯౦ A.D కొడుంబాలూరు ముత్తరయర్లు చోళుల సామంతులగను మరియు సందలై లేక (చంద్రలేఖ) ముత్తరయర్లు పల్లవ సామంతులగ నుండినట్లు కనబడుచున్నది. తర్వాత కాలమున విడెల్‌విడుగు ముత్తరయన్ V వరగుణవర్మ పాండ్యునితో సంబంధములు కలసిన తర్వాత, మూడు ప్రాంత భాగములు కలసిన రాజ్యము అనగా "ముత్తరయర్-నాడు" స్వతంత్రముగా పరిపాలించుచున్నట్లు తోచి, తెలుగు చోళరాజైన విజయాలుడు, తమ చోళ దేశభాగమును చేర్చుకొనుటకు యుద్ధముచేసి వోడించెను. అప్పుడు పాండ్యులుగాని, పల్లవులుగాని సహాయము చూపలేదు. మరి ముత్తరాజులు కూడ సహాయము కోరినట్లు కనబడలేదు. అందువల్ల ముత్తరయర్లు (ముత్తరాజులు) క్షీణించిపోయిరి.[౭]

పై చూపిన కుదంబలూరు ముత్తరయర్లు, సందలై ముత్తరయర్లు, కళభ్రులు, శైవభక్తుడైన 'ముర్తినయనార్' అనగా (ముత్తినయనార్) సంతానమని పెరియాపురాణములో చూపబడినది. మరియు శ్రీ సెక్కిలర్ స్వామిగారు తమ తిరుతోండ పురాణమందు చూపినారు.

౮. తర్వాత వారు శ్రీ తిరుమంగై మన్నన్, లేక (తిరుమంగై ఆల్వార్) అను వైష్ణవ సన్యాసి, చోళనాటిలోని ఒకభాగమైన (అల-నాడు) అనే ప్రదేశమును క్రీ.శ. ౮ ఎనిమిదవ శతాబ్దమున పరిపాలించెను. ఇతడు కల్లర్ వంశస్థుడని (దివ్య సూర్య సరిదమ్) బట్టి తెలియుచున్నది.[౮]

---

౭. తెలుగువారెవరు?, మరియు ముత్తరయర్‌నాడుమితిక్ సొసైటి.

౮. దక్షిణ హిందుదేశ చరిత్ర. పు146-147-శ్రీ నీలకంఠశాస్త్రి.

పై చూపిన దానిబట్టి మొదటి శతాబ్దములో 'కళభ్రలు' లేక కళప్రభువులు, తమిళనాడులో ప్రవేశించి రాజులై తర్వాత ముత్త రయర్' లేక (ముత్తరాజులు) అనగా ముదిరాజులు. మరియు కల్లర్లు క్షత్రియులైనారని తెలియుచున్నది.

౯. (త్రిచ్చినాపల్లి) తంజావూరు,మధుర,రామనాధపురం, జిల్లాలో యిప్పటికిని, అక్కడక్కడ 'ముత్తరాజులు', అనుబడు ముత్తరయర్లు జమీందార్లు కలరు. ఈ విధముగా తెలుగుదేశములో కూడ కలరు. పై విధమును బట్టి తమిళనాటిలోని, కల్లర్లు, ముత్తరయర్లు అనగా ముత్తరాజులు, ముత్తరాచలు, ముత్తరాసలు, అంబలకరన్ లేక (అంబలమ్) అనువారు మొదటినుండి అక్కడి వారు కారని, తెలుగు దేశమునుండి వలసపోయినవారని తెలియుచున్నది. వారి పూర్వికులు, 'తెలుగు ముత్తరాజుల' వంశమునకు జెందినవారని విశదమగుచున్నది. కాన శ్రీ టి. వి. సదాశివ పండరాత్తర్ అన్నమలైగారు చూపిన ఆధారమునుబట్టి ముత్తరయర్లు పూర్వపు రాజవంశము వారని తెలియు టచే వీరు రాజవంశము క్షత్రియులని తేలినది.౯

౧౦. ముత్తరాచ - నాగముత్తరాస :

ముత్తరాచలతో - ముత్తరయర్లు వేరయని, వారు నాగవంశ మునకు జెందినవారని శ్రీ శ్రీనివాస అయ్యంగారు తమ 'తమిళ స్టడీస్' లో ఈవిధముగా వ్రాసియున్నారు.

1891 నాటి సెన్సస్ లెక్కలనుబట్టి చూచిన, ముత్తరాచ లకు, అంబలకరన్, ముత్తరయన్, కల్లర్, కురుంబన్, మొదలగు వారు నాగజాతికి జెందినవారని, అపట్లోపల్లవరాజ్యసీమ అయిన తొండ మండలప్రాంతములో నివసించేడివారని తెలియుచున్నది. వారియొక్క విజయపరంపరలు దక్షిణాదిన త్రిచ్చినాపల్లి వరకు సాగెననియు మనకు

౯. కులములు లేక తెగలు దక్షిణదేశము by ఎడ్గర్ థర్స్టన్. పు. 127-131

అర్థమగును. "ఈ పల్లవులోని కల్లర్ మరియు ముత్తరయర్ జాతులు చోళదేశమునకు వలసపోయిరని తెలియుచున్నది," తంజావూరు, త్రిచ్చి నాపల్లి చోళదేశమందుండెను. తమిళగ్రంథములలోగాని, శాసనములలో గాని వారియొక్క తెగపేరు 'పుల్లి', 'కల్లర్' అక్కడక్కడ మనకు కనబడుచున్నది. కాని ఎక్కువగా ఈ కులస్థులు, పల్లవులు లేక 'మల్లవ' తెగయని పిలువబడుచున్నారు. 'పల్లవ సైన్యంలో ముఖ్యముగా, ఈ కల్లర్ జాతికి జెందినవారే ఎక్కువగా నుండినవారు. ఇందులో కొంత మంది పల్లవరాజుల క్రింద రాజ్యపాలకులుగా పనిచేసిరి. వారిలో కొంత మంది వారియొక్క వంశవృక్షము శివునితో ప్రారంభమైనదని చెప్పు చున్నారు. మరికొంతమంది 'పల్లియులు' (వహ్ని క్షత్రియులు) మని చెప్పుకొనుచున్నారు. 'పల్లి' లేక పల్లవజాతీయులలోని ఒక భాగము 'ముత్తరాసలు' (తెలుగు ముత్తరాచలు) చెర, చోళ మరియు పాండ్య ప్రాంతమును పరిపాలించిరి, మొదట పల్లవ సామంతులుగా నుండిరి. ఈ కాలములోను, ముత్తరాచపాలకుల ప్రోత్సాహముతో, జైనసన్యాసు లతో (నాలడియూర్) గ్రంథము రచింపబడినది. పల్లవులు తమిళరాజు లైన, చేర, చోళ, పాండ్యులకు జన్మత విరోధులు. "పల్లవులను, దురాక్రమణదారులుగా భావించెడివారు." తమిళభాషలో పల్లవ మాటకు అర్థము దుర్మార్గుడని (రోగ్) అని వ్యవహారము కలదు."

మరియొక పల్లవులలోని, ఒకభాగము వారు చోళ దేశములో నివాసము ఏర్పాట్లు చేసుకొన్నవారని, దొంగలని పిలువబడిరి. అందు చేత వీరందరుగూడ ఒక నాగవంశమునకు జెందినవారని ఇది 'పల్లి' జాతిలోని ఒకభాగమని, ఆగవదం, నాగపాశం, నాగవంశమున్నగునవి. అందులోని తెగలని తెలియుచున్నది. మా మల్లపురములో దొరికిన శాసనము బట్టి చూచినచో, ముగలి నాగన్, వల్లినాగన్, శంఖనాగన్ ఈ పేర్లన్నియు, ఆ నాగకులమునకు సంబంధించినవనియు, ఒకప్పుడు

వీరందరు తెలుగు, కన్నడ జిల్లాల నుండి రెండు లేక మూడవ శతాబ్ది మందు సైనికులుగా వలస పోయిరని తెలియుచున్నది.[౧౦]

౧౧. పై చూపిన 'అంబలకరన్', వారు ముత్తరాజులంటివారు. వారు శ్రీ కాళహస్తి శైవభక్తుడైన శ్రీ ఉడుమూరికన్నప్పగారి సంతానమని చెప్పుకొన్నారు. అట్టి అంబలకరన్ మరియు కల్లర్లకు దగ్గెర సంబంధము గలవు. అంబలకరన్ మరియు ముత్తరయర్లకు సంబంధము కలదు. ముత్తరయర్లు తెలుగు ముత్తరాచలు ఒకే జాతికిని, మరి ఒకే వంశమునకు చెందినవారని శ్రీ ఎడ్గర్ థర్స్టన్ గారు కులము లేక తెగలు యను గ్రంథమందు వ్రాసియున్నారు.[౧౧] మరియు శ్రీ శ్రీనివాస అయ్యంగారు తమ తమిళ స్టడీస్‌లో నాగవంశమువారని, మరి పల్లవరేస్ అనగా ముత్తరాసలు (తెలుగు ముత్తరాచలు) యని ధృవపరిచినాడు. కనుక అంబలకరన్, కల్లర్, ముత్తరయర్లు (ముత్త రాచలు) నాగవంశస్థులని చెప్పుట సరికాదు, నాగవంశమును లేక (నాగడైనస్టిని) ఎదుర్కొనిన వారనియు, మరి నాగులు తెలుగు ముత్త రాచలతో సంబంధములు కలువుటచేత, నాగవంశమని తలంచి యుండ వచ్చును.[౧౨] మద్రాసు ప్రాంతములో నేటికి (అరవ ముత్తరాసలు) యున్నట్లు కలదు. 'అరవ' మనగా తమిళ భాషలో 'పాము' అనగా 'నాగులు'. ఈ నాగులు తెలుగుదేశమేగాక దక్షిణమున, చెర చోర, పాండ్యదేశములవరకును, పశ్చిమమున మాలవలేక (మహారాష్ట్రము) వరకు వలసపాకి యున్నట్లు కనబడుచున్నది. క్రీ. శ. ౧౨పన్నెండవ శతాబ్దమున అజంతగుహాలలో వ్రాసిన చిత్రాలయందు నాగరాజుల చిత్రములను కూడ వ్రాసియుండిరి. మహారాష్ట్ర శాసనములలో క్రీ. పూర్వము ౨౨౪ శాలివాహనులకాలము నాటి శాసనములలో కనబడు చున్నారు.

---

౧౦. తమిళస్టడీస్ -శ్రీ శ్రీనివాసయ్యంగార్.

౧౧. కులములు లేక తెగలు దక్షిణభారతదేశము. పుట. 127-131.

౧౨. తమిళస్టడీస్. శ్రీ శ్రీనివాసయ్యంగార్.

శాలివాహనుడు నాగకన్యను వివాహము చేసుకున్నట్లు ఆధారములు కనబడుచున్నవి. నాగులు, శాలివాహనులకు పూర్వముకన్న బౌద్ధకాలము అనగా క్రీ. పూ. ౨౬౩ వరకు నాగులు తెనుగుదేశమున అనార్యులైన నాగరాజుల వంశమునుండినట్లు బౌద్ధకథలవలన తెలియుచున్నది.[౧౩] ఆర్యులకు ముందు నాగులు దండకారణ్యమును, ప్రవేశించి యచ్చట రాజ్యములు స్థాపించిరి. ఈ నాగరాజుల ముఖ్యస్థానము ఎక్కడనుండి వలస వచ్చినదీ, మరి వారి వంశ పరంపరా, లక్ష్మీభీమేశ్వర తామ్రశాసనము శా. శ. 126-78-1374, క్రీ శ. భారతి అక్టోబర్ మరియు నవంబర్ 1969 మాసపత్రికలయందు శ్రీ ముసునూరి సాంబశివరామమూర్తి గారు 'భీమరాజు' క్రీ. శ. 1311 పాములవాక తామ్రశాసన, దానప్రతిగృహీత. కరవాలభైరవ వీర విజయాదిత్యుని మంత్రి సేనాని, మండలీకుడు, ఢుత్తికవాసుకీరవి సోమేశ్వరాంతర వాసుకీనాముడుగా వ్రాసియున్నది. ౧౪ (చూడుడు).

౧౨. ఆంధ్రదేశముయొక్క ఉత్తర సరిహద్దున "తేలి" వహానది యున్నట్లు బౌద్ధజాతకములు సూచించుచున్నవి. ఇది మహానదికి ఉపనదియై (తేలి) అను పేరుతో పిలువబడుచున్నది.[౧౫]

౧౩. ముత్తరాచలు - పాండ్యులు : మధురనేలిన పాండ్యరాజులను, మరి ముత్తరయర్లు (ముత్తరాజులు)ను గూర్చి శ్రీ నీలకంఠ శాస్త్రిగారు తమ పాండ్య చరిత్రలో ఈ విధముగా వ్రాసియున్నారు.

కళభ్రులు లేక కళప్రభువులు పాండ్యనుండి మధురను హస్తగతము చేసుకొనిరి. కళప్రభువులు మధురను ఆక్రమించుకొన్న తర్వాత పరాంతకుని పూర్వము మధుర విచ్ఛిన్నమైన, ఈ మధ్యకాలములో, ముత్తరయర్లే చరిత్ర సంపూర్ణముగా లభించునని నిర్ణయించలేము. సాధ్యమైనంతవరకు, ఈ చరిత్రను అక్కడక్కడ దొరికిన ఆధారములు

---

౧౩. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము. కోమర్రాజు లక్ష్మణరావు.

౧౪ & ౧౫ విశ్వభారతి మాసపత్రిక. నవంబర్ 1969 (పుట 4-14)

పైకి తీయడమైనది. మిగతావి భవిష్యత్తులో ఏ విధమైన దొరకబోవు సాక్ష్యములకు ఆధారములుగా నుండునని గుర్తింపబడినవి. చాల శిలా శాసనముల వలన, కనబడినవిగా, మారన్ - సదయన్ - సదయన్-మారన్', వీరలకు చెందినవి. అయినప్పటికి వదలిపెట్టవలసి వచ్చినది. ఎందువల్లననగా, మారన్ - సదయన్ బిరుదములు, పాండ్యులకు మరి ముత్తరయర్లకు ఉన్నందువల్ల కచ్చితముగా, ఏ పాలకునికి చెందినవో చెప్పలేకున్నాము. పాండ్యుల ముఖ్యవంశ పరంపరా ఏ కొద్దిపాటి తెలిసి, తెలుసుకొన్నప్పటికి, వారి యొక్క సామంతులను మరి భూపతులను, తెలుసుకొనుటకు కూడ కొద్దిపాటిమాత్రమే సాధ్యమగును. అక్కడక్కడ 'హాయ్' అనుబడు వంశస్థుల గురించి సూక్ష్మముగా చెప్పడము జరిగినది. ఈ కుటుంబికులు తిరునవెల్లి, తిరువాన్కూరు, మధ్య పర్వత ప్రాంతములను పరిపాలించి చాలకాలము అధికారము చేసి యుండిరని తెలియుచున్నది.౧౬ హాయ్ అను జాతివారు రావణబ్రహ్మకు జెందినవారని, రావణుడు మంధరపర్వతమునకు వచ్చి శబరులు, మరియు ముందాలను చూచి హాయ్ అనువారితో కలసిపోయినట్లు శ్రీ శరత్ చంద్రరాయ్, (ముందాలు-వారిదేశము) అను గ్రంథములో చూపినారు.౧౭ మరియు కొంగునాటి ప్రభువులైన 'అడిగన్స' పాండ్యరాజుల అధికారములో వారికి సామంతులుగా నుండి కప్పము చెల్లిచేవారట.

౧౩ (అ). వీరదరికంటే ముఖ్యుడైనవాడు 'కడక్కముత్తరయర్' కంచీలో జరిగిన నందివర్మ 11 పల్లవమల్ల పట్టాభిషేకము సందర్భములో అతిముఖ్యపాత్ర వహించి పేరును సంపాదించెను. ఈతని శాసనములు పెక్కు గలవు.

---

౧౬ పాండ్యుల చరిత్ర (పుట. 83-85) -శ్రీ నీలకంఠశాస్త్రి

౧౭ రామాయణ విశేషములు - PP. ముందాస్ & దేర్ కంట్రీ.

-శ్రీ సురవరం ప్రతాపరెడ్డి.

(అ). ఈతనికన్న పూర్వము,వైయందిప్పిరియరాసర్ అనుసామంత రాజు, పల్లవ మహేంద్రవర్మ I కాలమున వల్లం అను రాజ్యము పాలించుచున్నట్లు కనబడుచున్నది. వల్లరికార్డు (S. I. I 511 part.x pp. 340-10) ఇతను ముత్తరయర్ వంశమునకు జేందినవాడనియే తెలియుచున్నది.

(ఇ). శ్రీ కోలంగో ముత్తరయర్, బిరుదము వహించిన ముత్తరయర్, చోళనాటిని తన పరిపాలనలోకి తెచ్చెను. ఈ విషయమునే చోళదేశములోని తిరుకోడికావేల్ వద్ద దొరికిన ఆధారమును బట్టి తెలియుచున్నది.

(ఈ) శ్రీ కడవడియరైయన్ (అలియాస్) ఘడిధీరన్ ముత్తరయర్, ముత్తరయర్ నాడుకి పశ్చిమములోనున్న -విలా - నాడులోని కుక్కురు గ్రామస్థుడని తేలియుచున్నది.

(ఉ) శ్రీ కాడువెట్టి ముత్తరయర్ : ఇతని రాజ్యము తెలియరాలేదు. (Si i No. 120 Vole. lV lbid.)

(ఊ) శ్రీ మారన్ - జడయన్, ౧౦-౧౬ సంవత్సరములయొక్క రెండు రికార్డులను బట్టి తెలియుచున్నదిగదా తెల్లారు గ్రామమును గెలుపొందినవాడు, 'శ్రీ నందిపోత్తరయర్' కనబడుచున్నాడు, ఇతను ముత్తరయర్ వంశమునకు జెందినవాడు.

(ఎ) అప్పుడినయనార్, - అరువది మూడు శైవభక్తులలో నోకండు ఇతను (౭) ఏడవశతాబ్దము A. D. తర్వాత కోదంబలూరు ముఖ్యపట్టణముగా ఏర్పరచినవాడు, 'శ్రీ ఇడంగలి - నయనార్' ముత్తరయర్ వంశస్థుల చిన్న సామంతరాజుగా కనబడుచున్నాడు. (EPI. Vole. XIII P. 1915-16).

(ఐ) పుదికళరి (అలియాస్) అమరుశ్రీ ముత్తరయన్', పూవలి-కుడిరికార్డులను చూసినట్లు అవుతే ఇతను ఈ వంశమునకు ముందువాడు రాజుగా కనబడుచున్నాడు. (EPI. Vole XIII p. 1516-16).

(ఓ) 'శ్రీ పెరుముత్తరయర్' ఇతని గురించి (నాలడియార్) అను గ్రంధమందు చూపిన విషయము ముందే చూపియుంటిమి.

(ఔ) 'శ్రీ విజయాలయ ముత్తరయన్, ఇతను పెరుగుచున్న చోళరాజ్యములో, తంజాపురము సమీపముననున్న 'ముత్తరాసనల్లూరు' అధిపతి, ఇతను చోళరాజైన కులతుంగ I సమయమువాడని కనబడుచున్నాడు. ఇతను ఈముత్తరయర్ వంశములోనివాడని తెలియుచున్నది.

(అం) నంబాన్-పెరుంబిడుగు ముత్తరయన్' ఇతనుపచ్చిల్ రాజు.

(అః) 'అనపాయముత్తరయన్' ముత్తరయర్-నాడు.

(క) 'పరాంతకముత్తరయన్, ముత్తరయర్-నాడు.[౧౭]

పైవారు పదముగ్గురు రాజులయొక్క వంశవృక్షము, పెరుంబిడుగు ముత్తరయర్ సందర్భ శాసనములో చేర్చనందున, మరి వారియొక్క వివరములు అక్కడక్కడ దొరుకుటచే, నొకచోట జతపరిచి చూపబడినది. ఈ ముత్తరయర్ వంశమునకు జెందినవారు. మారన్-బిరుదములుండుటచే, వీరు పాండ్యులకు జెందినవారనియు, లేక ఈ వంశమునకు జెందినవారనియు చెప్పుట కష్టము. ఈనాటికి ఒక తరగతికి జెందిన ప్రజలు వారంతటవారే ఈ ముత్తరాజుల వంశమువారమని చెప్పుకుంటారు. ఈ రాజుల చరిత్రను గురించి ఏవిధమైన కచ్చితము మరియు వివరమైన నిర్ణయము తీసుకోలేకున్నాము. కాన వీరి శాసనములు ఏకొద్దిమాత్రమే అందులో ఇంతవరకు పరిశీలంపబడినవి. దీనినిబట్టి ముఖ్యముగా, ఈ ముత్తరయర్, ఈయన తర్వాత రాజులకు, ఇప్పటి తంజావూరు, ట్రిచ్చినాపల్లి, జిల్లాలో పెక్కు భాగములు, పుదుకోటలో కొంతభాగము వారి ఆధీనముననుండెను. వారి పరిపాలన కేంద్రము తంజావూరు జిల్లాలోగా కనబడుచున్నది. తిరుకోట్టుపల్లి సమీపమునుండిన చంద్రలేఖ పురమునకు సమీపముననున్న గ్రామము (నియమ్) ముత్త

---

౧౭. పాండ్యుల చరిత్ర, (పుట. 83-85) Vole. VII. -శ్రీ నీలకంఠశాస్త్రి

రాజులకు పరిపాలన కేంద్రముగా నుండియుండవచ్చును. ఇప్పటికిని, తిరుచునాపల్లి ఐదు మైళ్ళ దూరములో "ముత్తరాసనల్లూరు" అను గ్రామము కలదు. (నాలడియార్) గ్రంథమందు "పెరుముత్తరయర్" నుగూర్చి వ్రాసియుండుట అందరికి తెలిసిన విషయమే. కనుక కళభ్రలకు జెందిన ముత్తరాసలు క్రీ. శ. (౨) రెండవ శతాబ్దమున తెనుగు దేశమునుండి వలసపోయినవారు, మొదట స్థిరనివాసము చేసుకున్నందువల్ల పై నామము వచ్చినట్లు కనబడుచున్నది.

చందలై యందు దొరికిన స్థంబశాసనములవలన ముత్తరయర్ల యొక్క మూడుతరముల వంశావలి తెలియుచున్నది. అందు కట్టకడపటి వాడైన, సువరన్-మారన్ (అలియాస్) "పెరుంబిడుగు ముత్తరయన్ II", అనేవాడు పల్లవుల తరపున పాండ్యుల వ్యతిరేకముగా చాల యుద్ధములు చేసెను. పల్లవరాజులకున్ను ఈ ముత్తరయర్ రాజులకున్ను గల బిరుదములు చిత్రమైనవిగా, సన్నిహితముగా కనబడుచున్నవి. ఉదాహరణకు "పెరుంబిడుగు" మరియు "విడేల్ విడుగు" బిరుదములు తెలియపరుచుచున్నది. ఈ బిరుదములు తెలుగు పదములగా కనబడుచున్నవి. పల్లవులనుండి ముత్తరయర్ రాజులు ధరించిరా? లేక తెలుగు ముత్తరాజులనుండి పల్లవులు అలంకరించిరాయని సందేహము. పల్లవరాజులకు వీరు సామంతులుగా నుండిరని ఉహించుటకు, ఈ విషయములు సహాయపడుచున్నవి. వారి మరికొన్ని విషయములు పరిశీలించినచో, ఈ పై నిర్ణయము సరికాదని తెలియవచ్చుచున్నది.

ముత్తరాజులు (ముత్తరయర్) వారి శాసనములలో, వారి వారి పరిపాలన సంవత్సరములను పేర్కొనియున్నారు. (చందలై)లో గల (౧౮) పదునేనిమిదవ సంవత్సరపు ముత్తరయన్ శాసనము (12/1899) మరియొకశాసనము మారన్-జడయన్ యొక్క పదియవ పరిపాలన సంవత్సరము తెలియుచున్నది. ఇది ముత్తరయర్ యొక్క సేవకుడు దానము ఇచ్చిన శాసనములో పేర్కొన

బడినది. (10/1899). తిరునవెళ్ళి జిల్లాలోగల శిలాశాసనము ఒకటి. శ్రీ శత్రుభయంకర ముత్తరయన్ భార్య (రాణి) ఇచ్చిన దానము సదయన్-మారన్ యొక్క......... (21) ఇరువదియొకటి శకసంవత్సరమును సూచించుచున్నది. ఒకప్పుడు ముత్తరయర్ రాజులు పాండ్య వంశములోవారని ఉహింపబడినిది. ముత్తరాజుల పేరులలో "మారన్" అనే శబ్దము ప్రతివారికిని గలదు. ఈ పై పేర్కొనబడిన ఆధారములు ఈ రాజులయొక్క ఏ నిజమైన చరిత్రకు ఆధారభూతమని చెప్పుటకు సాధ్యముకాదని తెలియుచున్నది. ౧౫

పైకనబరిచిన విషయములన్నింటిని జతచేసి, నిజమైన ఆధారములు లేనందున, ఈ ముత్తరయర్ రాజులు చాల తరముల వరకు పాండ్యులకు మరి పల్లవులకు మధ్యగల వివాధగ్రస్తమైన రాజ్యమును స్వతంత్రులుగనో, పాండ్యులకు సామంతులుగానో, లేక పల్లవులకులోబడిగాని, అప్పుడున్న రాజకీయప్రాబల్యమునుబట్టి వారు పాలనము చేసియుండవచ్చును. దక్షిణహిందుదేశ చరిత్రలో వారి పాత్ర కూడ నిర్ణయించలేకున్నాము, చోళవిజయాలయుడు, చోళరాజ్యమునకై ముత్తరయర్ V వద్దనుండి మధుర, తంజావూరు జయించినాడని విషయము ఒప్పుకోవలసియున్నది. ఇదంతయు చూడగా, క్రీ. శ. రెండవశతాబ్దము నుండి ఆరవ శతాబ్దము వరకు కళభ్రప్రభువులుగాను, మరియు (౬) ఆరవ శతాబ్దమునుండి తొమ్మిదవ శతాబ్దము వరకు పరిపాలించిన ముత్తరయర్ వంశమువారుగాక, పదముగ్గురు పై చూపిన రాజులు ఈ కోవకు జెందిన, వారి చరిత్ర అక్కడక్కడ కనుబడుటచే, చరిత్రకు అందని వారని తెలుపుటకు విచారము వెలిపుచ్చుతున్నాను.

---

౧౫. పాండ్యుల చరిత్ర (పుట ౮౩, 85) + ముత్తరయర్నాడు (మిథిక్ సొసైటి).

## ఏడవ ప్రకరణము

# ముత్తరాచలు - గోంకచోడరాజులు

౧. తెలుగు గోంకచోడరాజులు తెనుగుదేశములో (౯)తొమ్మిదవ శతాబ్దమునుండి ప్రబలిరి. తెలుగు గోంక చోడలకును మరియు తెలుగు రేనాటి చోళముత్తరాజులకును బేదము కనబడుచున్నది. కాని కొంత మంది చరిత్రకారులు ఇద్దరును ఒక శేజాతికి మరి ఒకే వంశమునకు జెందినవారని వ్రాసియున్నారు. నిజమునకు వేరని, వారి, వారి శాసన ములను బట్టి తెలియుచున్నది. తెలుగురేనాటి చోళరాజు క్రీ. శ. (౩)మూడవశతాబ్దమునకో అంతకుముందో కావేరినుండి వచ్చినటుల, మరియు వారు 'కరికాల చోళుని సంతతి' వారైనటుల తాము సూర్య వంశీయుల మనియును వ్రాసుకొన్నారు వీరిని గురించి ముందే చూపి యుంటిని.

౨. తెలుగు గోంక చోడరాజులు, వెలనాటి గోంక చోడుల మని, మరియు పాండవ సంతానమని, చంద్రవంశమని స్పష్టముగా శాసన ములలో వ్రాసుకొన్నారు. ఇదియేగాక వీరికి 'ముదసలి'- 'ముదసెరి' యనియు బిరుదములుగలవు. "మరి క్రిష్ణా జిల్లా ఆవనిగడ్డ తాలూకా, శ్రీ లక్ష్మీనారాయణ దేవాలయములో దొరికిన శాసనము (నం. 943 A.R. 26/1893) మరియు ఆవనిగడ్డ శాసనము (నం. 945 A. R. 128/1893)లో కలియుగ శూద్రకుండన, జగంబున వీరగుణ ప్రసిద్ధుండై వెలసి యట్టి ముత్తనాయకుని" యని సంభోదించి వ్రాసియున్నది. ఈ ముత్త, ముద అనే బిరుదములు తెలుగు గోంకచోడులకును మరియు తెలుగు రేనాటి చోళులకును గలదు. కాని వంశమువలన వేరుగా కనబడు చున్నారు. తెలుగు గోంక చోడలు తాము పాండ్యకులాంతకయని

శాసనములో ఈ విధముగా చూపినారు. శాసనము (నం. 1028 A.R. 201/1893) లో ఈ విధముగా యున్నది.

౧. ..........................
౨. ప్రవర్ధన మానవిజయారా......శ్రీవి
౩. ష్ణువర్ధన మహారాజులు...లెయనాయకుణ్ణుచో
౪. డమణ్డలమున తెంగ్గర పాణ్డకులాసని, వలయనిగలదు.

శాసనము (నం. 10 21 A. R. No. 195/1893) లో ఈ విధముగా యున్నది.

౧. స్వస్తి॥ [ * ] సమస్త......
౨. తిలక చోడ కులశేఖర పాణ్ద్యకులాంతక.........
వీర మహేంద్రయని గలదు.

తంజావూరు, సందలై దగ్గర శివాలయములో దొరికిన శాసనము నం. 10 సందలై E pI Vole xiii 1915-16 (పుట. 133) లో ముత్తరయర్ రాజులు లేక (ముత్తరాజులు) కూడ పాండవ సంతాన మని శ్రీ ప్రొపెసర్ S. T. E. N. Konow Phd. and F. W. Thomas M A. (Hons) Phd మరియు K. V. Submraanyam Aiyar తెలిపిరి. కనుక తంజావూరు, మధురై నేలిన పెరుముత్తరయర్ వారు తెలుగువారని పూర్వమే చూపబడినది. ఈ పెరుముత్తరయర్ తెలుగు గొంక చోడలు ఒకే పాండవ వంశముగ ఇదియేగాక తెలుగు ముత్తరయర్లకు వున్న బిరుదములు, గొంకచోడులుకూ ముదసెరి, ముదియనియు కూడ గలదు. గొంకచోడలు క్షత్రియులుగాను, ఈరెండు వంశములవారును పాండవ వంశము, ముత్త బిరుదములు ధరించుట, మరియు తెలుగువారమని చెప్పుకొనుటచే ఒకటిగా వొప్పుదు రేమో తంజావూరు ముత్తరాజులుకును మరి గంగవాడి ముత్తరాసర్ అను ఒకే వంశము వారుగా కనబడుచున్నారు. గంగవాడి రాజైన శ్రీ పురుష

ముత్తరాసర్, వీరు దక్షిణ కేణరాయందు పరిపాలన చేసి యుండిరి. ముత్తరయర్ రాజులు, గంగవాడి ముత్తరాసర్‌లు, కర్ణాటకులనియు, వీరేకల్లర్, కళవర్, కురువ, కళబర్, అనగా కళభ్ర అనుబడు, అడవి జాతివారని కొందరును అభిప్రాయ పడియున్నారు. తూర్పు గంగవాడి ముత్తరాసర్‌లకును పశ్చిమ గంగవాడి ముత్తరాసర్‌లకు సంబంధములు గలవని చూపినారు. ఇంక పరిశోధించ వలసియున్నది.

౩. వైదుంబ ముత్తరాసలు :- వీరు బ్రాహ్మణ క్షత్రియులని కొంతమంది చరిత్రకారుల ఊహ. మరి వీరు విదుంబ దేశమున నివసించుటచే వీరికి "వైదుంబ" లను పేరు కల్గియుండెను. వారు తెలుగు దేశమును పరిపాలించిన కాలము చాలకొలదియే, ఐనను గంగవాడి ముత్తరాసలకు, వైదుంబ ముత్తరాసలుకు కొన్ని సంబంధములున్నట్లు కనబడుచున్నది. కనుక వైదుంబముత్తరాసలు ఈ తెలుగుముత్తరాసలేనా యనునది అనుమాన స్పదము. బ్రాహ్మణ క్షత్రియులలో ముత్తరాస కులము ఎక్కడ కనబడలేదు. నెల్లూరు జిల్లాలో నియోగిబ్రాహ్మణులకు మాత్రము ముత్తరాజులవారు అని ఇంటి పేరులతో గలదు. వైదుంబ ముత్తరాసలు గంగవాడి ముత్తరాసలు, తంజావూరు ముత్తరాసలు, కొడుంబలూరు ముత్తరాసలు, తెలుగు గొంక చోడ ముత్తరాసలు, ఒకటిగానే కనబడుచున్నారు. నేటి తెనుగు దేశములో కనబడుచున్న తెనుగు ముత్తరాసలు, వారును ఒకటే అన్నచో విప్రతిపత్తి ఉండదు. కేవలము పాండవ వంశమువారని చెప్పుకొనుటచే, ముత్తరాజు లేక ముదసెరిగల బిరుదములుండుట చేతనే ముత్తరాచలను, తెలుగు గొంక చోడులను కలిపి చెప్పుట అంత సమంజసమా ? పాండవలని చెప్పుకొనుట వారి వంశోన్నతి చూచకము కావచ్చును.

౪. ముత్తరాచ-రాచవారు : రాచవారు పై చూపబడిన గొంక చోడ రాజులనియు, శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు, ఆంధ్ర సాంఘిక చరిత్రలో ఈ విధముగా వ్రాసి యున్నారు.

రాచవారు - చోడులు తాము క్షత్రియులమని చెప్పుకొనిరి. క్షత్రియులందరు సూర్యునికో, చంద్రునికో పుట్టినవారని, బలిష్ఠులై దేశము నాక్రమించుకొని పాలించిన విజేతలపై పౌరాణికులగు, అనుగ్రహము కలిగినపుడెల్లను, వారిని చంద్రునికో లేక సూర్యునికో అంటగట్టి క్షత్రియులనుగా చేసిరి. అనార్యులగు 'హూణులు', 'విషక్కకృషాదులు', 'శకరాజులు', ఇట్టి వారెందరో క్షత్రియులైరి.

౫. చోడులు క్షత్రియులుగదా, వారితో రెడ్లను కలుపుట యెట్లని కొందరికి సంశయము కలుగవచ్చును. కాని క్షత్రియులమని చెప్పుకొన్న చోడులు ప్రాచీనకాలమునుండి "క్షాత్రవృత్తి" వహించిన వారగుటచేత నుత్కృష్టమైన రాజపదవులను వహించినప్పుడు, ఆకాలము నాటి బ్రాహ్మణోత్తములు వారిని క్షత్రియులుగా పరిగణించియుందురు. కాని ఇటీవల రెడ్డిరాజులు పూర్వపు వర్ణాశ్రమ సాంప్రదాయ ధర్మములు చెడిపోయిన తర్వాత కాలమున రాజ్యపదవులను వహించిన వారు గావున, నవీన బ్రాహ్మణోత్తములు వీరిని క్షత్రియులనుగా పరిగణింపక, చతుర్థవర్ణములలో నుత్తములనుగా వర్ణించియుండిరి. (౧౫) పదునైదవ శతాబ్దము ప్రారంభమునందు కూడ కొండవీడు, రాజమహేంద్రవరము పాలించిన రెడ్లకును, రాచవారికిని సంబంధ బాంధవ్యములు కలవని (శివలీలావిలాసము - కోరిమిల్లి శాసనము) పై దృష్టాంతములు వెల్లడి జాటుచున్నవి. 'చతుర్థకులము' క్షత్రియకుల సమానమని శ్రీనాధుడు డొంకతిరుగుడుగా భీమేశ్వర పురాణాదిలో వర్ణించుచు అందు "పద్మనాయకులన," 'వేలమలన', 'కమ్మలన', 'సరిసర్లన', 'వంటర్లన' బహు ప్రకారశాఖోపశాఖ చిన్నంబులైన మార్గంబులన్ వెలసిరనెను.

౬. 'ఆందు పంటదేసటి' అను రెడ్డివంశములో ఒకటి అని తెలిపినాడు. శ్రీనాధుని వచనములో 'సరిసర్లు' అనవంటలవాడు, ఇది సరియని తోచదు. బహుశ అది 'ఒంటరి' (ఏకవీరుడు) అయియుండును.

'పద్మనాయకులు వేరు', 'వేలములు వేరు' అని పైవచనాభిప్రాయముగా కానవచ్చుచున్నది.

౭. 'మున్నూరు కులము'ను గూర్చి కొరవి గోపరాజు తన సింహాసన ద్వాత్రింశతి ప్రంబంధాదియందు తెలిపినాడు. కాని అదితప్పు, చారిత్రక విరుద్ధము. అని సురవరం ప్రతాపరెడ్డిగారు చూపిరి. మరియు వీరిని గురించి ఘంటశాల అనే చరిత్ర పుస్తకము చూడుడు. (పుట. 115,116) పై చూపిన రాచవారు, తంజావూరు నాయకుడైన విజయ రాఘవ నాయకుని, అనగా క్రీ శ. ౧౬౩౩-౭౩) కాలములో తురకలతో జరిగిన యుద్ధ సమయమునంతయు భీభత్సము పట్టించి ప్రజల చంపి దోపిడీలు చేసిరి. ఇదంతయు విలాసయగు విజయరాఘవుడే తురక సైన్యముపై (జపించిన) తులసీ తీర్థము చల్లినచో, వారు భస్మమగుదురని దానిని పంపెనట. కాని ఆతడే సమూలముగా స్త్రీ శిశుసమేతముగా నాశన మయ్యెను.౧

అట్టి పిరికికాలములో ఒక తెనుగు రాచవారు మాత్రమే తెనుగువారు, వారిని విశేషముగాహతమగువరకు పోరాడి, వీరస్వర్గము నలంకరించిరి.౨ (చూడుడు తంజావూరు ఆంధ్రనాయక చరిత్ర).

౮. కాకతీయ ప్రతాపరుద్రదేవుడు తురకలచే బంధింపబడిన తర్వాత రెడ్డిరాజులు, వెలమనాయకులు, వారి వారి ఆధీనములోనున్న ప్రాంతములను స్వతంత్ర పరిపాలనక్రింద ధృవపరుచుకొని యుండిరి. రాచకొండ మరి దానిదగ్గర పరిసరప్రాంతములు కూడ రెడ్డిరాజులు మరి వెలమల ఆధీనములో నుండెను. అప్పుడు తెనుగు రాచవారు రెడ్డి నాయకులను, వెలమ నాయకులను ఎదరించి రాచకొండను తిరిగి ప్రతాపరుద్ర దేవునికి స్వాధీన పరిచినట్లు కనబడియున్నది.౩ కానరాచవారు గొంక చోడలు ఆయిన, కాకున్న వారు తెనుగు రాచవారమని చెప్పుట అనివార్యము.

---

౧. ఆంధ్ర సాంఘిక చరిత్ర (పుట. 84-86).

౨. తంజావూరు ఆంధ్రనాయక రాజుల చరిత్ర (పుట. 360).

౩. ఆంధ్ర సాంఘిక చరిత్ర.

# ముత్తరాజులు (ముత్తరయర్) పల్లవులు, చోళులు, పాండ్యులు

౧. ముత్తరాజులు (ముత్తరయర్లు) పల్లవులు, చోళులు, మరియు పాండ్యులు దక్షిణ హిందుదేశమున పరిపాలించిన ప్రభువులు. వీరిలో ఒకరి నొకరికి పరస్పర సంబంధ బాంధవ్యములు గలవు. ముత్తరయర్ రాజులు తొమ్మిదవవాడైన శ్రీ విడెల్ విడుగు ముత్తరయర్ V కన్యను పాండ్యరాజు వర్గుణ వర్మకు యిచ్చి వివాహము చేసినటుల శాసనములో నున్నది. మరియు చోళులకు కూడ యిచ్చినటుల కనబడు చున్నది. (S. 1. 1. No. 97).

శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి (జూనియర్) గారు ఆంధ్ర సచిత్ర వార పత్రిక ఉగాది సంచిక, తెలుగువారువరు ? అను వ్యాసము వ్రాసిరి. అందు 'తెలుగు వెలనాటి గోంకచోడులు' తెలుగు రేనాటి చోళ ముత్తరాజులు మరియు మధుర నేలిన పాండ్యులను పడద్రోసిన ముత్తరయర్ (ముత్తరాజు) అనగా ముదిరాజులను గురించి, ఈ విధముగా వ్రాసినారు.

ఇతర జాతులు లేక వర్ణములు లేక తెగలవలే తెలుగువా రొకరుండిరి. వారికిని తెలుగు చోళులకు ఏదో సంబంధములున్నవి. ఈ తెలుగుచోళులు కర్నూలు జిల్లా లేక మహబూబ్‌నగరము జిల్లా, వుందూరు ప్రాంతమున కనబడియున్నారు. తెలుగు చోళరాజుల కుటుంబములవారే తెలుగువారుగా నుండిరనుటకు నొక నిదర్శనము దొరికినది.

హొయసల త్రిభువనమల్ల బిట్టగుడు (విష్ణువర్ధనుడు) క్రీ. శ. ౧౧౩౬ లో, తెలుగుదేశముపై నెత్తివచ్చెను. వెలనాటి గోంక రాజు

శాసనములు ఆంధ్రదేశమును గూర్చి, ఆంధ్రాధిపుని గూర్చి తమ్ముగ్గ కానట్లు చెప్పుచున్నవి. వీరు పాలించుచుండినది కూడ ఆంధ్రదేశమే యైనను, ఆంధ్రము అదేదో వేరైనట్లు చెప్పుటయు, రెండవ గొంకరాజు ఆంధ్రరాజును జయించినట్లును, రెండవ చోడరాజు కాకతిప్రోల నిర్ద హానుడనియుండుటయు చూడగా, వెలనాటి చోళులును, ఇతర చోళు లను, తెలుగువారుగాను పరిగణింపబడుచు వచ్చిరనుట తెలియు చున్నది.

ఈ చోళులు చాల కుటుంబములకు చెందినవారై ఆంధ్ర దేశము చెప్పుకొనియున్నందున, కావేరితీరము నుండి పల్లవరాజుల కాలమునందో అంతకుముందో ఎప్పుడో రేనాటికివచ్చి యుండవలెను. వీరిలో చాలమందికి 'ఒరయూర్పురవరాధీశ్వరా' యను బిరుదుంగలదు ఒరయూరు (ఉరైయూరు) చోళుల ప్రాచీన రాజధాని, దీనికే కో యని నామాంతరము (కోడినిగూర్చిన కథలు ఉరయూరువే). ఈ ఉ యూరు చోళులకు పూర్వము 'కోలీనగర మనియుండెను. ఈ కో అనగా కోడియని కన్నడ భాష మరి తమిళ భాషలో చెప్పుదురు ల. ళ. యోః లడయోః నభేద్. అనుటకు బట్టి కోడిని 'కోలిగా'తలం వచ్చును. ఈ చోళులు కావేరితీరము వారు. మొదట రేనాడు, ములక నాడు, నాక్రమించి క్రమముగా నలవైపుల పాకానాడు, కర్మనాడు లను, పడమటనలపాడి నొలంబి పాడి మొదలైన ప్రదేశములకును వ్యాపించిరి. అనగా నేటి నెల్లూరు, గుంటూరు, కర్నూలు అనంత పూరు, బల్లారి, మైసూర్‌లో కొంతదూరము వ్యాపించిరి.

తెలుగువారైన చోళులు ఉరయూరు నివాసులు కాబట్టి వారి పుట్టుపూర్వోత్తరములను గ్రహించుటకు కాలమానమును బట్టి వెనుకకు పోగలమాయన్నదే గట్టిగా పట్టుదొరకకున్నను కొంత సూచన కనబడు చున్నది. మరి వీరికి కూడ తెలుగు ముత్తరయర్లుకున్న బిరుదములు 'మార్పిడుగు' - 'పగ్గాపిడుగు' యని కలదు.

పల్లవులు తమ బిరుదములతో తెలుగు పదముల కూర్పుల వంటివానిని ధరించుచుండిరి. 'ఏడిల్ విడుగు', 'పగ్గాపిడుగు', 'కడుం బిడుగు', పిడుగు తమిళపదము కాదు. తమిళములో (ఇడి) యందురు. పైగా పల్లవశాసనములలో 'విభుండు' నిల్వఁ యెల్లయ్యాంబు - వెంటల విత్తు. మొదలైన పదములను, పల్లవ సామంతులైన కళభ్రులలో ఐదవ శతాబ్దమున పాండ్యులను జయించిన మధుర నేలినవారిలో పెరుం బిడుగు ముత్తరయన్ (ఆలియాస్) సువరన్ - మారన్ - ప్రసిద్ధుడు. ఇతనికి శ్రీమారన్, శ్రీకళ్వర్ కావలన్, శ్రీ కళభ్రకావలన్, శ్రీశత్రు కేసరి. శ్రీ తంజన్, మరియు వల్లక్కన్, అభిమానాధిరాన్, అతిసాహసాన్, తమరలైయాన్, నేడు మారన్, వెళ్ మారన్, వన్ మారన్, మరియు సత్తాన్ - మారన్, యుద్ధముల ఆయినతోచే ఈ పై యుద్ధనామములు ధరించియు పెక్కు విధముల పేర్కొనబడి యున్నాడు. 'వీరు ముత్తరాజులు' అనగా 'ముదిరాజులు' వీరిలో మూడు తరముల వారు. పల్లవ సామంతులై యుండి పాండ్యులను అణచిపెట్టి యుండి నట్లు తెలియుచున్నది. పల్లవ బిరుదములను పెరుంబిడుగు-విడెల్ విడుగు లను వీరు ధరించియుండిరి. 'పగ్గాపిడుగు' అనియు కలదు. ఈ కళభ్రులు ఎక్కడివారో తెలియదు. గాని, వీరు పాండ్యులను పడద్రోసిన కాలము క్రీ. శ. ౬ ఆరవశతాబ్దమని చరిత్రకారుల సమ్మతము. 'వీరు కర్ణాటక జైను లని కొందరును, "కల్లర్," "కలవర్," అనుబడువారని తెలిసినదిగదా. ఈ పేరు కన్నడమున "కలబర్" అనిమాఱును, పిమ్మట సంస్కృత మున "కళభ్ర" అని మరల మార్పునందును.[1] ఇది తమిళమున "కళప్పి రర్" అను రూపమునందును. కళప్పిరర్ అనగా "వెళ్లాలార్" అనగా కాపులు, యని కలదు. కాని కళభ్రలకును - కళప్పిరర్ కు ఎట్టి సంబం ధము లేదని శ్రీ క్రిష్ణస్వామి అయ్యర్ గారు కళభ్ర చరిత్రలో చూపి నారు.[2] మరియు అడవిజాతివారని కొందరును, అభిప్రాయబడి

---

౧ దక్షిణ హిందుదేశశాసనములు (South Indian InscriPtion).

౨ తెలుగువారెవరు? శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి (జూనియర్)

యున్నారు. శాతవహాన త్రొక్కిడివలన దక్షిణమునకు వచ్చిరట. ఈకల్ల జాతీవారు "పుల్లి"యను నతడు వెంగడం తిరుపతి కొండప్రాంతమును పాలించుచుండెనని సంగవాఙ్మయ మందు కలదు. తిరుపతి తొండ-మండలమునకు ఏల్ల-కాలహస్తి తొండము - నాటిలోనిదే, తండియార్పేట అనుబడు ప్రదేశము తొండైయార్పేట అని యుండెను. "తొండ మానవులు పల్లవులు" వారి పేట పల్లవుల తొండమండల భాగము కంచీ వరకు, కంచీకి ఆ కాలమున "అరువావడతలైనాడు పేరు" చిదంబరమువరకు అరవనాడు. దానికి ఉత్తరపు వెల్లపడతలైఆనాడు, ఇక్కడి వారే "అరవారర్" వీరినే అరవవారనిరి. అరవమనగా తమిళమున "పాము." ఇచట నాగులుండిరనియు, వారికిని పల్లవులకును సంబంధముండెననియు కథలు కలవు.

నెల్లూరు జిల్లాలో కందూకూరునుండి దక్షిణమునగల దేశమున, పండ్రెండు బోయకొట్టములు నుండినట్లు తెలియుచున్నది. కందూకూరు అనగా కొట్టము. కొట్టమనగా దుర్గము. కంచీ రాజ్యమందును కొట్టములే ఎక్కువ, ముప్పదిరెండట కంచీ రాజ్యమును పల్లవులాక్రమించిన అతిప్రాచీన కాలమున ఇచ్చట ఎవరు పాలించుచుండిరో తెలియదు. కాని పల్లవులు మాత్రము నెల్లూరు మండలమును రెండవ నందివర్మకాలమున జయించినప్పుడు, ఇచట బోయ రాజులుండిరనియు. వారి నాయకుడు "పృధ్వీవ్యాఘ్రనువాడు" (నిషాధిపతి) పల్లవుల అశ్వమేధాశ్వమును పట్టుకొని పోరాడగా పల్లవులు ఓడించిరనియు తెలియుచున్నది. ఈ బోయలు ఎప్పటినుండి యుండిరో తెలియదు. వీరే కల్లరులై యుండిన యెడల "పుల్లి" శబ్దము ప్రాకృతము. "పగ్గసీహాయ పుల్లీ" అని హేమచంద్రుని దేశినామమాల. కాని ఈ పృధవీవ్యాఘ్రనుడే ఆ పుల్లియో, వీని పూర్వీకులెవ్వరైన ఆ పేరిట వారుండి సంఘ వాఙ్మయమున కెక్కిరోయని సందేహము కలుగుచున్నది. తిరుపతి, నెల్లూరులు సన్నిహిత ప్రదేశములే పైగా వీర

పూర్తి తమిళులు గారు. వీరిని నెల్లచూడగా (ఉహాయే) చరిత్రయని గట్టిగా చెప్పుటకు లేదు. ఈ కళభ్రులు బోయవాండ్రే యుండి, పల్లవ సామంతులై తమ తెలుగు బిరుదములతో దక్షిణమునకుపోయి పాండ్యులను జయించిరా? లేక ఆ దేశమునకుపోయి కావేరితీరము, వైగై తీర్థములలోనుండి పల్లవులవలన, నీ బిరుదములను సంపాదించారా యనియు శంకగలుగు చున్నది. రేనాటి చోళులకు సమకాలికులు ఈ బోయరాజులు,అప్పటికే రేనాటికికరికాల చోళుని వంశస్థులు వచ్చి రెండు లేక మూడుశతాబ్దములై యుండవలెను. కరికాలచోళుని,కాలము నాల్గవ శతాబ్దముగా పరిశోధకులు తెలుపుచున్నారు. ఆతని శత్రువే ముక్కంటి కాడు వెట్టి త్రిలోచన పల్లవుడు. సముద్రగుప్తుని కాలమునకు కంచిలో పల్లవులు కలరు. ఈ ప్రాచీన ప్రాకృత శాసనములవల్ల పల్లవుల కాలమందే కావేరితీరమునుండి చోళులు జయింపబడి వారి వంశమువారు పల్లవ సామంతులై రేనాటికి వచ్చి యుండవలెను. మరి కావేరి తీరము నుండి రేనాటికివచ్చిన వారుగదా చోళులు? వారిని గూర్చి తమిళ వాఙ్మయ మందు "తెలుగు" పదము కానరాదే, వీరెట్లు తెలుగు ముత్తరాజులవుదురని సందేహము కలుగుచున్నది. వారి శాసనములలో ఈ విదముగానున్నది. చూడుడు. **EPI Vole. II. XXVII part-V January,** 1948.

౬. ఈ కరికాలచోళుని గూర్చి వాఙ్మయమందు పాడే(పాటలు, పద్యములు)లో వీరిని గురించి వారికి ఎక్కువగా తెలియదు లెండు. వీరిని 'మూవేందర్' అనగా ముగ్గురు రాజులు యని యందురు. మరి వీరు ఎట్లు తెలుగువారుగా కనబడుచున్నారు గదా, ఒక ఉహాకు కొంత మార్గమునకు కనబడుచున్నది. ఇది కధలమీద ఆధారబడినదేగాని, గట్టిగా చరిత్ర యని చెప్పలేము. పల్లవులు పాలించుచుండిన కాలమున అతిప్రాచీనుడైన 'ఆదొండచక్రవర్తి' యని యొకడుండెను. పల్లవులు తొండమానువులేగదా, ఈ చక్రవర్తి తన దేశమును సస్యవంతముగా చేయుటకై 'కృషివలుల' కొరకు వెదకి తుళువదేశమునుండి 'వెళ్లాళ'

కుటుంబములవారిని తెచ్చి తొండై మండలములో నివసింపచేసెనట. అడవులను నరికించి, చేరువులను కట్టించి శ్రీశైలమువరకును దేశమును ముక్కంటి పల్లవుడు బాగుచేయించిన కథా పాతదేగదా. ఆ దొండ చక్రవర్తియే,ఈ త్రిలోచన పల్లవుడోకాదో తెలియదు.కాని "వెల్లాళరు అనగా కృషివలులనుట నిర్వివాదము. "వీరు తుళుదేశము నుండి వలసవచ్చి మద్రాసు ప్రాంతములో నివసించినందున, వీరికి "తొండై మండల తుళువవెల్లాళురని" పేరు వచ్చినది. వీరి జ్ఞాపకచిహ్నమే నేటి టి. టి. వి. హైస్కూల్.' (తొండై మండలం తుళువ వెల్లాల్ హైస్కూలు) మద్రాసు మింటు స్ట్రీటులోనున్నది. తుళువవారికి వాఙ్మయములేదు. గాని వారికి 'తిలు' యను పేరుండినదో లేదో తెలియదు. వీరే తొండమనునాటికి మొదట వచ్చిరా లేక చోళులు రేనాటికి మొదట వచ్చిరాయనుట చెప్పలేము. పల్లవయాశ్రితులు రేనాటి వారితో, ఇరుగుపొరుగువారితో కలియుకయుందురా? 'తెలుగు చోళులు, ప్రభువులు, యుద్ధవీరులు, పరిపాలకులు'. "తుళువ వారు కర్షకులు." "మనదేశమునందు కర్షకులనందురు రెడ్లు" ఈ రెడ్లనందరినీ నెల్లూరు జిల్లా, గుంటూరు జిల్లా, వరకు దాదాపు వేయేండ్లక్రిందనే వచ్చి వ్యాపించి నేటికిని ఇండ్లలో అతి ప్రాచీన తమిళభాషను మాట్లాడుదురు. ద్రావిడ బ్రాహ్మణులను 'వేళ్లయర్' అనుచున్నారు. వేళ్ళాళ శబ్దమే యిట్లు మారినదో లేక అసలు సరియైన శబ్దమే యిదో ఎవరును పరిశోధింపలేదు, 'వేల్' అనగా (ఈచే) అనగా అభీరులు, గొల్లలు, పశుపాల్యము వృత్తిగా గలవారు, కాబట్టి వేళ్ + అయర్ = వేళాయర్ అయినదేమో, అసలు అయరులకు ఈచేలు అనగా క్షత్రధర్మము లేదేమో, నెల్లూరి శాసనసంపుటములలోను, తిరుపతి శాసనములలోను, "రెడ్లకే-వేళ్లాళర్" అనియు, 'ఈ రెడ్లను చతుర్థకులజులైన రాజ వంశము వారి శాసన మొకటి తెలంగాణశాసనములో 11-37 కలదు." వీరు బిట్టుకులతిలక, జైనాలయమును కట్టించి క్రీ. శ. 1108లో

(5)

దానములిచ్చియున్నారు. ఈ శాసనముదాత భువనగిరి దండ
సంగసూరు విభుండు భీరయరెడ్డి. రాష్ట్రకూటడనగా — చిన
రాజును అర్థములో ఈ కాలమునకు శాసనములు గలవు. వ
యులును గూడ చతుర్థకులజులని, శాసనములలో కనబ
కాకతీయులు మొదటిబేతరాజునుండి తాము దుర్జయునివంశ
చెప్పుకొన్నారు. దుర్జయకులాబ్ధిచంద్రులు పలువురున్నారు. ఈ
దుర్యోధనుని కొడుకు అని భాసనాటకము, ఊరుభంగములో
వీరభద్రరావుగారు చెప్పియున్నారు. మరి వీరిది కావేరిపూంబ
చెప్పుకున్నారు. కావేరి సముద్రమును చేరుచోటు పట్టణము
దీనికే 'పుహార్' అనియు (పు-హో- ప్రవేశించు-సముద్రమ
మించు పేరు). దీనికి ఆవలియొడ్డునే ఉరయూరు కలదు
రాజు" పరిపాలించినందువల్ల దీనికి ఈ పేరు వచ్చినది అని
యమందు గలదు. (ఈ కావేరీ తీరమునకే శిబిదేశమని పేరు
లకు శిబివంశస్థులుగాన శంబియులను ప్రసిద్ధి. (దండిదశకుమా
కూడ కావేరితీరమును శిబిదేశమన్నారు.) ఈ కరికాలచో
తీరమైన, ఉరయూరునుండి తరలి, ఇవతలవొడ్డునున్న పువ
లైన కళభ్రులతో కలియించి, తంజావూరులోని సందలై
లేఖ పురమును నాక్రమించుటకు, కళభ్రులైన ముత్తరం
లతో కలసి, తాము కూడ తెలుగు ముత్తరాజులుగా చ
రేనాటికి వచ్చినట్లు కనపడుచున్నది. ఈ ముత్తరాజులు ప
చోళులను, ఇందు ప్రధాన భూమిక ధరించినవాడు పల్లవుల
కలిపి పడద్రోసినవారు, (శ్రీ పెరుంబిడుగు ముత్తరయ
యాన్) సువరన్-మారన్, యని కనబడుచున్నాడు.[౩] తర
అంతకు పూర్వమో 'శ్రీ కోలంగో ముత్తరయర్' బిరుదు

౩. తెలుగువారెవరు? శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి (జూనియ

ముత్తరయర్ చోళనాటిని తన పరిపాలనలోకి తెచ్చెను. ఈ విషయమునే చోళదేశములోని తిరుకోక్కడి కావేల్ దొరికిన ఆధారమునుబట్టి తెలియుచున్నది. వీరు (౬) ఆరవశతాబ్దమునుండి (౯) తొమ్మిదవ శతాబ్దము వరకు సందలై శాసనముబట్టి తెలియుచున్నది.[౪]

౪. ముత్తరయర్ నాడు చూడుడు.

తొమ్మిదవ ప్రకరణము

# ముత్తరయర్‌నాడు - వారిదేశము

# ప్రాచీన చోళులు - ముత్తరయర్లు

మిథిక్ సొసైటిమాగ్జిన్ - Vole-XI-IV No. 7- అక్టోబర్ 1953.

-:0:-

ప్రాచీన చోళులు త్రిచునాపల్లి దగ్గర, ఉరయూరును రాజాధానిగా చేసుకొని కావేరితీరాన్ని పరిపాలించిరి. ఉరయూరు నామాంతరము (కోలీ) యని తెలిపియుంటిమి. కావేరికి యిరువైపుల ఒడ్డు నిర్మించిన కరికాలుడు, మొదట ఉరయూరు నుండి పరిపాలించెను. కాని ఉరయూరుని వదలి రాజాధానిని 'కావేరి' పట్టణమునకుకోలేక 'పుహార్' నకో మారినట్లుగా తమిళ గ్రంథములు తెలుపుచున్నది. ఈ విధముగా రాజాధానిని మార్చుటకు తగిన కారణములు లేకపోలేదు. ముఖ్యముగా రాజకీయరక్షణ, అవసరమునుబట్టి ఈ పని జరిగియుండవచ్చును. 'ఈ కరికాల చోళుడు,' కొడుంబలూరు ఆధిపతి ఆయిన, ఇరంగోల్లవతో పోట్లాడినట్లు తమిళ గ్రంథమందు గలదు. 'కొడుంబలూరునకు ఉత్తర ప్రాంతము, ఇరంగులకు - చోళులకు రణరంగముగా నుండెను.' ఇరంగులను, కరికాల చోళులు వోడించిరి. ఇదియుగాకుండ, ఉత్తర ప్రాంతమున ఏలుచున్న పల్లవులతో - కరికాల చోళులు యుద్ధము చేసెను. అందుచేత అతడు రాజాధానిని పుహారటువంటి స్థలమునకు మార్చవలసి వచ్చెను. ఇచ్చట కరికాల చోళుడు ఉరయూరును వదలి కావేరి పట్టణమునకు ఎందుకు రావలసి వచ్చెనో, కొద్దిగా పరిశీలించవలసి యున్నది.

ఈ విధముగా ఉరయూరు వదలిన తర్వాత విజయాలుడు వచ్చిన తర్వాత చోళులు దానిని సమ్మతించలేదు. తంజావూరును గట్టిపరిచి రాజాధానిని చేసుకొనిరి. ఇది ఎందువలననగా, ముత్తరయర్ రాజుకు తంజావూరు ఇష్టమైన రాజాధాని అక్కడ నుండి వారి సామ్రాజ్యమును పరిపాలించిరి.

ముత్తరయర్లు - మాల - నాడు ప్రాంతమును కొడుంబలూరును, ఇరంగులూరు ప్రభువు, వీరతుంగ ఆధిపతిని జైయించినట్లుగామో - వల్ కోయిల్ శాసనము తెలియచేయుచున్నది. ఇదియేగాక మరి మాల-నాడుకి, కో - నాడుకి, మధ్య ప్రాంతము గూడ ఇందులో కలసియుండ వచ్చునని భావించుటకు ఆస్కారము గలదు.

ఇరుంగోవేళ్ ఆధిపతి - పతులు ఓటమి, వారి రాజాధాని ఆక్రమణ మున్నగు విషయముల గూర్చి సందలై వద్ద దొరికిన పెరుంబిడుగు ముత్తరయన్ గూర్చి వ్రాలు దొరికిన వ్రాతలలో కలదు.

ఇరుంగోవేళార్ రాజ్యములో వుండబడిన కునందర్ దేవాలయములో దొరికిన దంతివర్మ శాసనముబట్టి కొడుంబలూరు ఆధిపతి, పిడవనార్ వద్ద ఒక బంట్రోత్తుగా నుండెనని తెలియుచున్నది.

పల్లవుల వైభవమును చాటించు ఈ క్రింద విషయములు కొన్ని యీ సందర్భములో జ్ఞప్తికి తెచ్చుకోక తప్పదు. కావేరినది పల్లవులకు ప్రాణమైనది. పల్లవరాజైన సింహ్మ విష్ణువు కావేరిప్రాంతమైన చోళదేశమును జయించినరాజు. పల్లవరాజు - పరమేశ్వర I (చాళుక్య విక్రమాధిత్య I) లాల్ గుడికి ఉత్తరముగానున్న పెరుమల్లూరు వద్ద, చిత్తుగా నోడించి. చింపిరి గుడ్డలతో తరిమిరి. ముసిరి తాలూకాలోనున్న శ్రీనివాస నల్లూరునకు మహేంద్రమంగళమును మరియొక పేరుండెను. తిరుచ్చినాపల్లి దగ్గరవున్న వుయ్యాలకొండ తిరుమల ప్రస్తుతమునకు ప్రాచీనపేరు నందివర్మమంగళం అని తెలియు

చున్నది. తిరుప్పె వదూరునాడు, లాల్‌గుడితాలూకాకు జెందిన తిరుప్ప వళి - నాడులోతిరుప్పలాది పూరు - నాటిలో, నాయాది మంగళం ఒక పట్టణమని తెలియుచున్నది. తర్వాత ఈ గ్రామమే నందివర్మ పల్లవమూర పేరున పెట్టబడినది. ఉయ్యాయరుకొండ తిరుమలవద్ద తవ్వబడిన కాలువ, వయిర మేఘవ యొక్కల్‌దంతివర్మ యొక్క యింటిపేరున పెట్టబడినదనయు లాల్‌గుడితాలూకాలోగల ఆళంపాకమునకు దంతివర్మ మంగళమని చెప్పిరి.

కావేరితీరప్రాంత అధిపతిగా నందివర్మ III, పరిపాలించినట్లు లాల్-గుడి తాలూకాలో నృపతుంగమంగళం, పచ్చిలికుక్రం సంబంధించినవిగా సాక్షాధారములు తెలుపుచున్నవి. ఇదంతయు ఇప్పుడువున్న తిరుచునావల్లి జిల్లా, పల్లవరాజుల ఏలుబడిలో తరాలుగా వున్నట్లు మనకు అర్థమగుచున్నది. ఇదియుంగాకుండ భవణనిర్మాణ కౌశల్యము, మహేంద్రదంతి వర్మనంది III - మరియు నృపతుంగ శాసనములను బట్టి ఈ ప్రాంతమంతయు అప్పుడప్పుడు శత్రువులదాడులున్నప్పటికి, క్రీ. శ. ౬౦౦ నుండి క్రీ. శ. ౮౭౫ వరకు పల్లవుల ఏకచత్రాదిపత్యమే స్పష్టముగా యుండినట్లు కనబడుచున్నది. దక్షిణమునున్న పల్లవుల ధాటికి ఈ చోళులు వారియొక్క సామ్రాజ్యపు పెత్తనము అణగిపోయినది. క్షీణించిన చోళులు, ఒకరికి తాబెదార్లుగా నుండి కుంబకోణము తాలూకాలోనే పాళేయార్ వద్ద నివాసస్థలము నేర్పరచుకొని తృప్తి జెందియుండిరి.

పల్లవసామంతులైన ముత్తరయర్లు, పరమేశ్వర వర్మ II, మునుపటినుండి దక్షిణాదిన సంపాదించిన ప్రాంతాన్ని, అప్పుడప్పుడు పాంఢ్యులు, పల్లవులపైన చేసిన దండయాత్రలను ఎదురుకొనుటలోను గొప్ప సహాసము చూపేవారు.

"కడక్క ముత్తరయర్" కంచీలో జరిగిన నందివర్మ II పల్లవ మల్లపట్టాభిషేక సందర్భములో అధి ముఖ్యపాత్ర వహించి పేరును సంపాదించెను. "పల్లవుల అనంతరము చరిత్ర ముత్తరయర్లు పాండ్యులతో దండయాత్రలు చేయటములోను, వారిపై విజయాలుడు సాధించుటముతోను, పల్లవులకు సహాయపడినారని తెలుపవచ్చును."

సందలై శాసనములో పెరుంబిడుగు ముత్తరయర్ (ఆలియాస్) సువరన్- మారన్- పల్లవులకు, పాండ్యులకు జరిగిన యుద్ధములో పాండ్యులపై ఏ విధముగా జయము సాదించినది, మనవారు, తింగలూరు, కొడుంబలూరు, అన్నాల్‌వయిల్, సంపన్నమారి, మొదలగు చోట్ల జరిగిన యుద్ధములు తెలియజేయుచున్నది. ఈ రణరంగమును బట్టి పాండ్యులు తంజావూరు జిల్లాలోనికి చొచ్చుకొని వచ్చినారని, వారిని పల్లవులు తరిమి వెంటబడి రాజ్యము నుండి పంపినారని తెలియుచున్నది. నందివర్మ పల్లవమల్లకు సమకాలికుడైన రాజసింహ్మా, పల్లవులను కులుమురు, వెడువయిల్, కురువలరై, మన్నెకుంచ్చి, తిరుమంగై పువులూరు, కొడుంబలూరు, మరియు సంకరమంగై అను చోట్ల యుద్ధములలో పల్లవులను వోడించినారని తెలియుచున్నది.

సందలై శాసనమును బట్టి పల్లవుల శాసనమును బట్టి పల్లవుల సామంతుల ఏలిన రాజ్యము, మనకు సులభముగా తెలియుచున్నది. ముత్తరయర్ ప్రభువులైన పెరుంబిడుగు ముత్తరయర్ (ఆలియాస్) సువరన్-మారన్, తంజక్కన్, వల్లక్కన్, బిరుదములుండేటివని, ఈ బిరుదులు తంజావూరుకు ఆధిపతియని, వల్లమ్ ప్రాంతములకు ఆధిపతి యని తెలియుచున్నది. రెండున్ను తంజావూరునకు దక్షిణ-పడమటకు దిక్కున వున్న ప్రదేశములని తెలియుచున్నది. సందలైస్థంభము మీద వున్న శాసనమునుబట్టి సందలై నియమ్, వారి రాజ్యాంతర భాగములు.

పైనాడులలో సందలై-నియమ్-వల్ల - నాడు, వుండినని తెలియుచున్నది. "ఇవన్నియు ముత్తరయర్-నాడులోనుండిన ప్రాంతములు."

విజయాలుని మొదటిచేసిన కార్యము, ముత్తరయర్‌ను నోడించుట, తంజావూరును ఆక్రమించుట దీనిని బట్టి చూచినచో తంజావూరు, దాని పరిసర ప్రాంతములందున్న తంజావూరు కుర్రం, ఈవన్నియు తుదివరకు ముత్తరయర్ - నాడులోనే వుండినవని తెలియుచున్నది.

సందలై శాసనములో తంజాయలో, శంబుల - నాడు, ఒక ప్రాంతమని, వెనుకోడలివద్ద ముత్తరయర్, తన శత్రువులమీద జయము సాధించిరని తెలియుచున్నది.

నృపతుంగవద్ద ఉత్తర నల్లూరులో దొరికిన శాసనమువలన విజయనల్లూరు - లాన్ 'కడవడియరైయన్ (అలియాన్) పుడిధీరన్ - ముత్తరయర్ - నాడుకి' పశ్చిమములోనున్న - విలా - నాడులోని కుక్కురుగ్రామస్థుడని తెలియుచున్నది. ఈ గ్రామము తర్వాత కొల రూన్ నది ఉత్తర గట్టున వున్న ఇదే పేర్లువున్న మరికొన్ని గ్రామములు, విలా - నాడు ప్రాంతమునకు జెందినవని తెలియుచున్నది.

లాల్‌గుడిలో పల్లవరాజు చరిత్ర ఆధారముగా దొరికిన కొన్ని సందర్భములో లాల్‌గుడి చుట్టుప్రక్కల ప్రాంతమంతా ఇడయార్ - నాడు అని పిలువబడుచున్నది.

కుకూ్కరు పశ్చిమముననున్న జవంతినాధపురం మరివిడయచ్చి మంగళము, ఇడయార్ - నాడులోనిదని తెలియుచున్నది. మరికొన్ని ఆధారములుకూడ లాల్‌గుడి, ముమ్మడి సోలమంగళముకు, కుకూ్కరుకు, చుట్టుప్రక్కన వున్నవూర్లు సంతమంగళము, తిరుమనమేడు, జవంతి నాధపురం, విడయట్టి మంగళము, మున్నగునవి, ఇడయార్ - నాడులో కలిసియున్నవి. లాల్‌గుడి తాలూకాలోని ఈ గ్రామములన్నియు కుకూ్కరు సమీపమునందుండుటచేత, ఇడయార్ - నాడు తర్వాత ఇలా - నాడులోకలసి ఒక భాగమై యుండవచ్చును.

పల్లవ నృపతుంగ రాజుయొక్క ౨౩-౨౬ సంవత్సర పరిపాలన శాసనమును బట్టి చూచినచో ముత్తరయర్ - నాడులో భాగమని తెలియుచున్నది. కళారాకుర్రమ్ మరి కుక్కూరు ముత్తరయర్ - నాటిలోని మాలానాడుకు జెందినవని, ముమ్మడి చోళమంగళములోని వని తెలియుచున్నది.

కావేరికి ఉత్తరములో నున్న, ఇలా-నాడులో ఇడయార్ - నాడు వుండినదనియు, ఆది కళాకుర్రంలోని ఒకభాగమనియు, దానికి యిరు వైపుల కలరూర నది, ఇరువైపుల చేరియున్నదని మాలా-నాడు నందు, పచ్చిల్ - ప్రాంతమునాటి ప్రభువులకు ప్రధానకేంద్రమనియు, శాసనములద్వార సాహిత్యము ద్వారను తెలియుచున్నది.

పచ్చిల్ ప్రభువగు 'నంబన్ - పెరుంబిడుగు ముత్తరయర్' ఆధికారమునకుకొన్ని కీర్తనలులోను మరియు సందలైవద్ద దొరికిన శాసనములనుబట్టి తెలియుచున్నది.

పాలురు-లాల్ గుడి తాలూకాలోమనచ్చనల్లూరునకు అగ్నేయ మూలగా వున్నట్లును, విలా- నాడులోని విలూత్తురు - నాడులో వుండె నని తెలియుచున్నది. ఈ సాక్ష్యాలనుబట్టి చూచినచో పచ్చిల్ కుర్రం తూర్పుప్రాంతమంత, విలా - నాడులో యుండెనని యున్నదనియు, ఈ విలా - నాడు, ఇలాత్తూరు - నాటిలోయుండెనని తెలియుచున్నది. విలానాటిలోని ప్రదేశాలు పట్టిచూచినచో ఈ విలా-నాడే యిప్పటి తిరుచునాపల్లి తాలూకాలోని భాగమనియు, కావేరికి దక్షిణప్రాంతంలో వున్న భాగమనియు, లాల్ గుడి తాలూకాకు ఆనుకొనియున్న భాగ ములని తెలియుచున్నది. దక్షిణమున అందులో శ్రీరంగము, జంబుకే శ్వరము, తిరుప్పాలితురై, వుంతమసిల్లి, తిరువెరంబూరు, చోళమదేవి, వుండేననియు, ఉత్తరమున 'కిల్' పేరు.౨ వంగూరు, ముమ్మడిసోల మంగళం, కూక్కురు పులూరు, వుండెనని తెలియుచున్నది. ఆగ్నేయ

మును ఇలా-నాటికి వడక్కా-వేరి-నాడు సరిహద్దుగాను నుండెను. ఈ వాడక్కా-వేరి నాడులో తిరునేడుం గలదు.

"ఇలా-నాటకి పశ్చిమ హద్దుగానున్న ముత్తరాస నల్లూరు, తిరుచునాపల్లి తాలూకాను, ముత్తరయర్ పరిపాలనను గుర్తుచేయుచున్నది." పల్లవుల - ముత్తరయర్ల చరిత్రలో చెప్పిన విధముగా అంగీకరింపబడినది. నేటి తిరుచునాపల్లి తాలూకాలో ఎక్కువ భాగము ఉరయూరు - కుర్రం స్వాధీనములో నుండెనని, ఇలా-నాడుగూడ వారి ఆధీనములో నుండెనని ముత్తరయర్లు పల్లవులకు సామంతులగా ఉండిరని తెలియుచున్నది,

ఇలా-నాటిలోని మూలంగూడి 'ముత్తరాస - నల్లూరుకి' దక్షిణ ప్రాంతములోనున్నది. ఈ ప్రాంతము 'ఉరయూరుకి' లేక కోలికి పశ్చిమగా నుండెనని ఈ ప్రాంతమును, మీ-కోలనాడు అని పిలువబడుచుండెను. దీనిని ధృవపరుచుచూ మీ-కోళై -విలా-నాడున, నెల్ వాయిల్ కలదని ఒక శాసనము చెప్పుచున్నది. మీకోళై విలా-నాడు అనగా విలా-నాడులోని కోలీ లేక ఉరయూరునకు పశ్చిమమునగల ప్రాంతము తిరుచునాపల్లి - దగ్గరలోనున్న ఉరయూరు ప్రాంతమనే, ఉరయూరు కుర్రమనే వ్యవహరించెడివారు: ఉరయూరు చుట్టుప్రక్కలనాడునే, ఉరయూరునాడని, కోలీ-నాడని పిలిచెడివారు. ఆప్రదేశమునకు పశ్చిమమున నున్న ప్రాంతము' మీకోలీ-నాడని ఉరయూరుకుర్రంలో ఉయ్యకోండన్ తిరుమైళై తిరుచునాపల్లి, నాగవరం, తిరుపాలతురై - తిరుచందురై కుమారవయూలూరు, ముళ్ళుకు - రుంబు మున్నగునవి ఉరయూరు కుర్రంలో అంతర్భాగముగానుండెను. ఉరయూరు కుర్రమునకు దక్షిణ ప్రాంతమున, కొడుంబలూరు అధిపతులకు, ఉత్తరప్రాంతమైన కో-నాడు యుండెడిది. వడకో-నాడు తిరుచునాపల్లి జిల్లాలోని కులిత్తలై తాలూకా వరకు వ్యాపించియుండెను. ఉరయూరు కుర్రం కావేరిదక్షిణ

మున నున్న, ఇళా - నాటిలోని ప్రాంతము. దీనికి తూర్పున ఐ-నాడు (Eye - Nadu) యుండెడిది. అది ఆరుకత్తుకుర్రంలోని భాగము, అందులో కచ్చమంగళము, కాదంబన్-గుడి, మేకలత్తూరు, మారనేరి, మొదలగు గ్రామములుండెను. కావేరినాటికి, ఈశాన్యప్రాంతమున ఐ-నాడు వుండెను. ఇది కావేరి దక్షిణముగాను, ఇడయార్-నాడుకు, పోయిగాయి- నాడుకు దక్షిణముగానుండెను. ఈ ముత్తరయర్ నాడు లోనే ఐ-నాడు, అకట్టుకుర్రం, తంజావూరుకుర్రం, మొదలగు ప్రాంతములన్ని కలసియుండెడివి.

క్రీ. శ. మూడవశతాబ్దమున పల్లవులు దక్షిణాదిని ఆక్రమించిన సమయములో, ముత్తరయర్లు గొప్ప బలవంతులై, అధిపతులై పరిపాలన చేయుచుండిరి. వారి సామ్రాజ్యమున తంజావూరుకుర్రం, వల్ల-నాడు, ఆరుకట్టుకుర్రంలోని ఎక్కువభాగమును ఐ-నాడు, ఇలా-నాడు, అన్నియును కలసియుండెను.

ఈ ప్రాంతములను బట్టి చూచినచో ముత్తరయర్-నాడు ఇప్పటి తంజావూరులోని కొంతభాగము, తంజావూరు, తిరుచ్చినాపల్లి జిల్లాలోని లాల్‌గుడి, తిరుచినాపల్లి తాలూకాలోని సంబంధించిన ప్రదేశమే అని తెలియుచున్నది.

కొదంబలూరు, అన్నావైయల్, సంపన్‌మారివద్ద లభించిన విజయములనుబట్టిచూడగా, ముత్తరయర్ రాజు కో-నాటి అధిపతిని వోడించినాడని మనకు తెలియుచున్నది. కున్నందర్ దేవాలయము శాసనమునుబట్టి కొడుంబలూరు అధిపతి కలిమురు - ఇలావారాయన్ (వలివడుగన్) 'ముత్తరయర్' యునికి బంట్రుత్తుగా శాసనములో వ్రాయబడియున్నది. ఈ ముత్తరయర్ల యొక్క రాజాధిపత్యము ఈ క్రిందివిషయములనుబట్టి తెలియుచున్నది. 'విడెల్-విడుగుముత్తరయర్ (అలియాస్)కు హావ్యసట్టాన్', మూలాయాధిపతి గృహాను అన్వేషిం

నాడని మరియొక 'సట్టాన్ పళియుళి' (విడెల్ విడుగు ముత్తరయస్ కుమారుడు) నట్టామాలై దేవాలయమును పల్లవనృపతుంగ, ఏడవ సంవత్సర పరిపాలనలో కట్టించియుండెను.

విజయాలయకుమారుడు ఆధిపత్యన ౧ (చోళరాజు) ముత్తర యర్లనుండి, తానాజిని చెప్పెను. తంజావూరుకు్రంమునున్న పశ్చి మమునున్న ప్రాంతమును మాలా-నాడులో సహా తన రాజ్యములో కలుపుకోకలిగెను, బంగాళఖాతమునుండి, కొంగు-నాడు, తూర్పు సరి హద్దువరకు గల ప్రాంతము చోళనాడనియు, తర్వాత చోళ మండల మనియు పిలువబడినది, ముత్తరయర్లయొక్క రాజ్యము పరిపాలనము చోళులచే అంతమొందింపబడి ముత్తరయర్-నాడు చోళమండలముతో ఏకమైనది. తొమ్మిదవశతాబ్దమునకు పూర్వమునమున్న శాసనములను బట్టి పరిశీలింపగా కో-నాడు, ముత్తరయర్-నాడునకు జెందిన పశ్చిమ దక్షిణ దిశలందు సమీపమున నుండెననియు, చోళ-నాడు, నెమమ్, సందలై, తంజావూరు, తూర్పుననున్న ప్రాంతమే చోళనాడని, ఉత్తర, పశ్చిమ దిశలో ముత్తరయర్ నాడు, మాలా-నాడు, సరిహద్దు లుగా నుండెననియు, అచ్చటచ్చట ఒక ప్రాంతము మరియొక ప్రాంత మును, ఆక్రమించుచుండెననియు తెలియుచున్నది. ముత్తరయర్ నాడులో ఉరయూరుకుర్రం- తంజావూరుకుర్రం, ఆర్కాట్టుకుర్రం, లోని పెక్కు ప్రాంతములు కలారాకుర్రంలోని భాగము కావేరి ఉత్తర మునమున్న పశ్చిల్కుర్రం, కోలారిన్, మొదలగు ప్రాంతములు కలిసి యుండెనని తెలియుచున్నది. మాలానాడు, కో-నాడు, వాటికి చుట్టు ప్రక్కలనున్న పశ్చిమమున, ఉత్తరమునున్న దక్షిణ-పశ్చిమమున, మన రాజులు ఉన్న పరిపాలకులు వారి సామంతులుగా నుండిరి. 'కోలంగో ముత్తరయర్' బిరుదు వహించిన ముత్తరయర్ అధిపతి, చోళనాటిని తన పరిపాలనలోనికి తెచ్చెను. ఈ విషయమునే చోళదేశములోని తిరు క్కోడికావేల్ వద్ద దొరికిన ఆధారమునుబట్టి నిరూపించబడుచున్నది.

Note: ముత్తరయర్-నాడు-మిథిక్ సొసైటి మ్యాగ్జిన్ (పుట. 39-53)

## భూగోళశాస్త్ర పద్ధతిన విభాగములు - కలిపి చూపిన

## ముత్తరయర్ నాడు

విలా - నాడు లేక విల్లానాడు - మికురు (పశ్చిమ భాగము).

ఇడైయార్రు - నాడు: వడకరై - (ఉత్తరకావేరి).

లాల్ గుడి తాలూకా.

| | |
|---|---|
| ఇడైయార్రు | : ఇది మధ్యభాగము. |
| ఇడైయార్రు మంగళమ్ | : ఇడైయట్టి మంగళమ్. |
| తలైయూరు | : తలక్కుడి. |
| సిరుగవ్వూరు | : సిరుదైయూరు. |
| ఇలాంపరునికై | : ఇరుకై. |
| కవిరాపోర్వకట్టియూరు. | |
| తిరుమ ఇల్ రంగమ్ | : జవంతినాథ పురమ్. |
| తిరుమన - నాడు | : తిరుమనవెలడు. |
| ముత్తైఇల్ - | : ముత్తియూరు. |
| ముమ్మడిసోలమంగళం | : ముమ్మడిసోల మంగళమ్. (చోడ మండలము). |

ముత్తరయర్ - నాడు. పుట. ౨.

| | |
|---|---|
| వల్లి మంగళమ్ | : నన్నిమంగళమ్. |
| సత్తమంగళమ్ | : సత్తమంగళమ్. |
| నిత్యవినితమంగళమ్ | : కిల్ ఆన్ బిల్. |
| పరాంతకపురమ్ | : సెన్నివైక్కల్, |
| ఇడయార్రు - నాడు | : తెంకరి (దక్షిణయొక్క కోలేరూన్ మరియు ఉత్తరయొక్క కావేరి). |

తంజావూరు - తాలూకా = తిరుచ్చిన్ నామ్పుంది. విలా-నాడు.

| | |
|---|---|
| పెరువంగూర్ | : కిల్ పెరువంగర్ (లాల్ గుడి తాలూకాలో). |

ముమ్మడిసోల-చతుర్వేది మంగళమ్ : ముమ్మడిసోల మంగళమ్. (లాల్‌గుడితాలూకా).

కుక్కుర్ : కుక్కుర్. (లాల్‌గుడితాలూకా).

విలాత్తుర్ - నాడు.

విలాత్తుర్.

తిరుప్పలూపూర్ : పాలూర్. (లాల్‌గుడితాలూకా.)

వేనది మంగళమ్ : (అలియాస్) ఘనపతినల్లూర్.

కరైక్కుడి.

ఉరయూర్.

తిరు వరంగమ్ : శ్రీరంగమ్. (తిరుచ్చినాపల్లి తాలూకాలో).

తిరువనైక్క : జంబుకేశ్వరమ్. (తిరుచ్చినాపల్లి తాలూకాలో).

ముత్తరయర్-నాడు పరములో చూపబడినవి.

౧. పనయపురమ్.
౨. తిరుప్పలత్తురై.
౩. ఉత్తమ సేరి.
౪. తిరువనైక్కావల్.
౫. విడయాట్టి మంగళమ్.
౬. ముమ్మడిసోల మంగళమ్.
౭. నన్ని మంగళమ్.
౮. మనచ్చ - నల్లూరు.
౯. సిరుదైయూరు,
౧౦. మనక్కాల్.
౧౧. జవన్ధినాధపురమ్.
౧౨. ముత్తియూరు.
౧౩. తిరుమన్నమేడు.
౧౪. కిల్ అన్బిల్.
౧౫. తిరుచ్చినన్నామ్ పుంది.
౧౬. సత్త మంగళమ్.
౧౭. తలకుక్కాడి.
౧౮. కిల్ పెరువంగూర్.
౧౯. తిరు మంగళమ్.
౨౦. మురుకూక్కార్.
౨౧. నాగవెలి.
౨౨. సోలమదేవి
౨౩. ములంగుడి.
౨౪. ఉత్తరకొండన్ తిరుమమై
౨౫. వడావూర్.
౨౬. కొట్టమంగళమ్.
౨౭. తిరుచే నందురై.
౨౮. పేరూర్.
౨౯. అరవాతూర్.
౩౦. పులివలమ్.
౩౧. ఆల్లూరు.
౩౨. కులమణి.
౩౩. కరుప్పూర్.
౩౪ గుడవార్.
౩౫. నేమమ్.
౩౬. తిరుకట్టు పల్లి.
౩౭. కచ్చమంగళమ్.
౩౮. మేకలత్తూర్.
౩౯. ముల్లాకుడి.
౪౦. ఆర్కాడు.
౪౧. అరసూర్.
౪౨. తిరువేదికుడి
౪౩. కందియూర్.
౪౪. తిరుప్పన్ దురుత్తి.
౪౫. తిరువలమ్పోలిల్.
౪౬. కరునట్టుగుండి.
౪౭. పెరంబూరు.
౪౮. ఇరుంబూతలై.

౪౯. కారంబై.

౫౦. తిరుకర్కరు గవ్వూరు.

౫౧. కర్గుడి.

౫౨. కురువది.

౫౩. నట్టా మంగళమ్.

౫౪. ఖుతరై యనల్లూర్.

౫౫. వలాది.

౫౬. ఇస్నకోరై.

౫౭. తురై యూర్.

౫౮. శ్రీపురం భియమ్.

౫౯. తిరుకోడికావేల్.

## ముత్తరయర్ - నాడు. వోరైయూర్ - లేక ఉరయూర్ - (కోలీ)

| | | |
|---|---|---|
| మలారి (ఆలియాస్) | శ్రీంకరచతుర్వేది మంగళమ్. | |
| తిరువెరుంబియూర్ | : తిరువెరంబూర్. | (ట్రిచ్చినాపల్లి |
| మురుక్కుర్ | : మురుక్కుర్. | తాలూకాలో). |
| ఉత్తమసిలిచతుర్వేది మంగళమ్ | : ఉత్తమసేరి. | ,, |
| నాగలమహాదేవిచతుర్వేది మంగళమ్ | : నాగవెళ్ళి. | ,, |
| తిరుప్ట్రరురై | : తిరుప్పలతురై | ,, |
| సోలమహాదేవి చతుర్వేది మంగళమ్ | : సోలమదేవి. | ,, |
| తిరుప్పనామ్పుదురు | : పనియావరమ్. | ,, |
| మిక్కోలై - నాడు. | | |
| నేలవఇల్. | | |
| ములంగుడి | : ములంగుడి, | ,, |
| ఉరయూరు | : కుర్రమ్. | ,, |
| ఉరయూర్ | : వోరైయూర్. | |
| తిరుచ్చిరాప్పల్లి | : తిరుచ్చిరాపల్లి. | |
| కర్కుక్కుడి | : ఉయ్యకొండాన్ తిరుమలై. | |
| వడవూర్ | : వడవూర్. | |
| కొర్రమంగళమ్ | : కొట్టమంగళమ్. | |
| ముల్లిక్కురుంబు | : ముల్లి కురంబూర్. | |
| ఆడవతూర్ | : ఆడవత్తూర్. | |
| తిరుచ్చెందురై | : తిరుచ్చెందురై. | |
| పులివలమ్ | : పులివలమ్, | |
| కురుప్పూర్ | : కరుప్పూర్. | |

| | |
|---|---|
| ములంగుడి | : ములంగుడి, |
| పెరూర్ | : పెరూర్ |
| ఆల్లూర్ | : ఆల్లూర్ |
| తిరుక్కు తిరమణి | : కులమణి |
| కుదలూర్ | : గుడలూర్. |
| ఆరింజగై చతుర్వేది మంగళమ్ | : నాగవరం. |
| తిరుప్పరై త్తురై | : తిరుప్పలతురై. |
| తిరుప్పనమప్పత్తూర్ | : పాన్యవరమ్. |

## ముత్తరయర్ నాడు - ఐ-నాడు (తంజావూరు తాలూకాలో)

కరంబియమ్ : కరంబై.

బుటమంగళమ్ : బుటరయనల్లూర్.

రాజేంద్రచోళచతుర్వేది
మంగళమ్ : రాజేంద్రమ్.

మేలకలత్తూర్ : మేకలత్తూర్.

ఆట్టాపల్లి నియమమ్ : నేమమ్

చందిరలేకై : సెందలై,

కలట్టూరు.

మరనెరి (అలియాస్) సినచింతామణి చతుర్వేది మంగళమ్ (మరనెరి)

ముల్లాడ్కుడి : ముల్లకుడి.

కచ్చిమంగళమ్ : కచ్చమంగళమ్

తిరుప్పర్ : తిరుప్పర్.

ఆరకట్టు-కుర్రమ్ (తంజాపూరుతాలూకాలో).

ఆరక్కడు, సిరక్కడు
మరియు పెరకాడ్ : ఆరక్కడు మరియు మేల్సిట్టాకడు.

నియమమంగళమ్ : నెమమ్.

తిగవూర్ : తోహూర్.

ఆరైసూర్ : ఆరసూర్.

తిరువేదికుడి : తిరువెదుకుడి.

తిరుక్కన్నందియూర్ : కందియూర్.

తిరుత్తురుత్తి : తిరుప్పందురుట్టి.

వొంభోదిరువెళ్ళి : వొంబట్టువెళ్ళి.

తిరువలమ్పోలిల్ : తిరువలమ్పోలిల్.

ఆలిసూర్ : ఆలిస్కుడి.

పిరమ్బిర్ : పెరంబూర్,

## ముత్తరయర్-నాడు, వల్లనాడు (తంజావూరు తాలూకాలో)

వల్లమ్ : వల్లమ్.

తంజుర్-కుర్రం

తంజావూర్ : తంజూర్.

కరుకొండు : కురువడి.

కురుంతింలై కుక్కడి : కురున్ తంగుడి.

ఇరుంబుటలై : ఇరుంబుటలై.

కరుగుడి : కరుక్కడి.

నట్టామంగళమ్ : నట్టామంగళమ్.

పైన.

సెంబూల-నాడు : వెంకోడల్.

Note : ముత్తరయర్-నాడు. - మిథిక్ సొసైటి మాగ్జిన్-బెంగుళూర్, (పుట. ౩౯-౪౩).

-:o:-

## పదవ ప్రకరణము

# సెటిల్ మెంట్ ఆఫ్ మద్రాస్.

మద్రాసు పట్టణమును ఇంగ్లీషువారు రాక పూర్వము, ముందరాజ పట్టణమని, సెటిల్ మెంట్ ఆఫ్ మద్రాసు మాన్యువెల్‌లో ఈ విధముగా తెలిపియున్నారు.

వేంకటగిరి జమిందారులైన దరిమిలి వేంకటాద్రి నాయుడు గార్లు, ఈ జమీందార్లు ప్రక్కనవున్న కుప్పం వారిదో కాదో తెలియదు, కాని అదిఒకచిన్న(చేపలు పట్టేవారి) గ్రామము లేక 'కుప్పం'మే నేటి మద్రాసు. అది శ్రీరంగ రాయలవారి ఆధీనములో పూర్వము నుండెను. ఇతను రాయలవారి వంశస్థుడు. ఇతను తురకలచేత ఓడి పోయెను. (క్రీ. శ. 1594). పెనుకొండ మరియు సరిహద్దులో, కడప్ప బల్లారు, చంద్రగిరి ఆధీనంలో నుండెను. అక్కడనుండి ఇంగ్లీషు వారలకు కోటకట్టుటకు (సనద్) మరి అనుమతి దొరికెను. ఇది వారి చివర ఆదేశము (క్రీ.శ. 1646), లో కులీకుతుబ్‌షా రాజైన దక్కన్, వీరిని రాజ్యమునుండి బహిష్కరించిరి. వీరు మైసూరు ప్రాంతములో నుండి తమను రక్షించుకొనిరి. సనద్‌యొక్క సటల్ మెంట్ మాత్రము చంద్రగిరి రాజులదని, దానిపేరు శ్రీరంగపట్టణం, లేక శ్రీరంగంయని యుండవలెనని తెలియచేసిరి. కాని అక్కడి నాయకుడైన వాడు, తన తండ్రిపేర చెన్నపట్టణంగా పిలువవలెనని అభిప్రాయ పడినందున మద్రాసునకు చెన్నపట్టణమనిగా పిలువబడినది. కాలక్రమమున అదియే చెన్నపట్టణమని ప్రసిద్ధి పొందెను.

చెన్న అర్ధము తెలుగులో అందము, మరియు తమిళ పదములో 'శిన్న' లేక చిన్న అనగా చాలచిన్న, మద్రాసు అయిన స్థలము యొక్క నామాంతరము నిర్ణయించినది, "అది సంస్కృత పదమునుండి

వచ్చినదే చంద్రవంశరాజులది, "ముందరాజ" తెలుగునుండి తెలియ నగును."

ఇంగ్లీషువారు ఆధీనములో తీసుకొనుటకుముందు, "మద్రాసు-ముందరాజ పట్టణంగా పిలువబడుచుండెను." పేరునుబట్టి - నాడు మద్రాసుపై ముందరాజుల అధికారము నుండెనని తెలియుచున్నది.

ఇందులకు శక సంవత్సరము, (1501) కనగిరిలో దొరికిన శాసనము. దండములు. నమస్కారములు (Bowing Respectable Salution) ప్రోలిచెలగా చన్నరాయ నీ దివ్య శ్రీపాదపద్మములకు... దామెర్ల చన్నపట్టనాయినింగారు, అనంతములైన దండములు సమర్పించి యిచ్చిన ధర్మశాసనము. (కనగిరి).౧

౨. శ్రీ ఖండంవల్లి లక్ష్మీరంజనంగారు తమ విజ్ఞాన సర్వస్వము సంపుటము నం. ౩. లో ఈ విధముగా చూపినారు.

ఈ చెన్నపట్టణము పుట్టుటకు పూర్వమే, ఇదే స్థలముననో, దీని కొంచెమిటో-అటో ఒక చిన్న ఊరు ఉండియుండును. ఈ ఊరు పట్టణముగానుండి క్షీణదశకు వచ్చినదై యుండును. ఈ పట్టణము పేరు మాదిరాజు లేక మాదరాజు లేక ముదిరాజు అను పేర్లను కలిగి యుండును. ఈ నామములను బట్టియే పాశ్చాత్యులు దానిని మాదిరాస్స, మద్దరాస, అను అపభ్రంశరూపములతో తమ రికార్డులలో వ్రాసి యున్నారు. అదియే తుదకు మద్రాసుగా రాజకీయ చరిత్రలో స్థిరపడి పోయినది.౨ - కనుక పై చూపిన సెటల్ మెంట్ మరి శాసనము మరియు విజ్ఞాన సర్వస్వముయొక్క విదినిబట్టి చూచినచో ఈమద్రాసు, ముందరాజు పట్టణముగా, మరి చెన్నప్ప నగరముగా కనబడుచున్నది. ఇది తెలుగు ముదిరాజుల పట్టణమని చెప్పుటకు తెలియుచున్నది.

---

౧. మద్రాసు సెటిల్ మెంట్ మరియు మాన్యువెల్ హిస్టరీ. (పుట. ౧౬౧ - ౧౬౨).

౨. విజ్ఞాన సర్వస్వము నంపుటము ౩. (పుట ౭౨౮ - ౭౨౯).

# మధురై రాజ్య - పాలకులు

౨. ముత్తర వంశరాజులు మధురై నేలినవారు. వారివారి కాలమానముతో ఈ దిగువ చూపబడినది.

(౧). క్రీస్తుకుపూర్వము, మొదటి తమిళ సంఘములో పాండ్య రాజులతోపాటు మధురైలో "ముదినాగారాయుడను" నొక గ్రంథ కర్త ప్రసిద్ధముగా వుండినట్లు కనబడుచున్నది. తమిళవాఙ్మయ ఆధారములను బట్టి, ఒకప్పుడు మధురసముద్రమున మునిగినట్లు కనబడు చున్నది. ఇతను తెనుగుదేశము నుండిపోయి పాండ్యులతో కలసిన వాడుగ కనబడుచున్నాడు. (తమిళ చరిత్ర).

౨. క్రీ. పూ. పాండ్యరాజులను వోడించి, మధురనేలిన కళ భ్రులకు మొదటిరాజు, శైవభక్తుడైన 'ముర్తినయనార్' లేక (ముత్తి నయనార్) అయి యుండవచ్చును. ఈతని కాలము తెలియరాలేదు. కాని ఈతని వంశస్థులే కళభ్రులు, లేక కళాప్రభువులు - రాజులు, పెరియపురాణము దక్షిణ భారత చరిత్ర (by A. N. K. S.). ఈ ముత్తినయనార్ కాలమున లేక తర్వాతనో తెలయదు, కాని 'ఇక్ష్వాకుల విజాయాలుడు' మధురైని గెలుపొంది, "ముత్తరవంశ కన్యను వివాహ మాడినట్లు", బుద్ధుడు నిర్యాణము జెందిన తర్వాత, తనదూతను మధురైకి పంపి మధురైరాజు, ముత్తరవంశ కన్యను ఆమెతో పాటు ౭౦౦ వందల దాసీలను, ౧౮ పెద్దకులము వారిని మరియు ౫ చేతిపని వాండ్రను బండ్లను నింపుకొని పోయినట్లు, మధురై మాన్యువేల్ లో [illegible]నబడినది. మరియు ౧౯౧౧ మద్రాసు సెన్సస్ రిపోర్టుయందు [illegible]లదు.

ఈ ముత్తరవంశ వారలైన కళప్రభువులు కనబడువారు. క్రీ.శ. (౨) రెండవశతాబ్దమునుండి (౬) ఆరవశతాబ్దము వరకు పరిపాలించిన వారు. కొడుంబలూరు నివసించువారిని ఇలంగో వేలార్ యనియు పిలువ బడుచుండిరి. పైవారు పెరియ పురాణమును బట్టి తెలియుచున్నారు.

(౫వ. ప్రకరణము - పుట. ౩౩ చూడుడు). మరియు క్రీ. శ. (౬) ఆరవ శతాబ్దమునుండి (౯) తొమ్మిదవ శతాబ్దము వరకు మధురై తిరుచ్చినాపల్లి మరి తంజావూరును పరిపాలించిన ముత్తరయర్లు పెరుంబిడుగు, విడెల్ విడుగు, బిరుదములు ధరించి పల్లవ సామంతులుగాను, మరి పాండ్యుల సంబంధీకులుగా, నుండుటచే, చోళవిజయాలునిచే వోడింపబడిరి. వీరిని గురించి (౬వ. ప్రకరణ పుట. ౩౮ - ౫౪ చూడుడు).

౩. నాయకరాజులు : ముత్తరాజ వంశమునకు జెందిన, చెందకపోయిన, వారు తెనుగువారమని మరియు ముత్తరాసర్, ముత్తు నాయకర్ గా పేర్లు పెట్టుండటచేత, వీరిని గురించి మధురై మాన్యువేల్ చరిత్ర ఆధారముతో ఈ దిగువ నాయకరాజులను చూపబడినది.

(౧). శ్రీస్వభాను శకసంవత్సరము ౧౩౭౭ నుంచి నడుచుచున్న విభవ క్రీ. శ. (౧౪౦౩ - ౧౪౪౮) శ్రీలక్కన్ననాయకర్ మరియు మాదన్న నాయకర్ ౪౭ సంవత్సరములు మధురైని పరిపాలించిరి. శ్రీలక్కన్న రాజ్యపాలననుండి తప్పుకొనే ముందు, శ.క. ౧౩౭౪ అభిరామ కాలియర్ - కోవిల్ సుందరట్టు మావిల్ వనడియార్, కలియార్ - సోమనార్, మరియు ఆంజద పెరుమాల్ ముత్తరాసర్", అతనికి కిరటమును ధరించిన యొక్క రోజులలో, తిరుమలై మావలినడియార్ పాండ్యరాజుయొక్క కుమారుడైనందున, విరుద్ధమైనప్పటికి రాజుగారి వంశ సంతానముగనుక అతనికి ౪౭ సంవత్సరములు పరిపాలించుటకు వీలు కలిగెను.

Note : వీరి కాలము క్రీ. శ. ౧౪౯౭ లేక ౧౫౦౦ నడుమయని సరియైనకాలము శక సంవత్సరము సరికాదని తెలియుచున్నది. మధు జిల్లా మాన్యువేల్ ఆధారించి పరిశీలించినచో, ఈ క్రిందివారు ఆం సమయములందు మధురైని పరిపాలించినట్లు విశదమగును.

(౨). శ్రీ పింగళనామ సంవత్సరము (క్రీ. శ. ౧౪౯౭) కై యొక్క శక ౧౪౨౨; శ్రీ నరుసయ్య నాయకర్ అధికారమ

వచ్చి రామేశ్వరము దేవునిదర్శించి 'కిలన్' ప్రాంతమునుకు
కొనెను.

(౩). శ్రీ తెన్న నాయకర్ పదిహేను సంవత్సరముల
నెల ఆ సంవత్సరము ఆంగీరస (క్రీ. శ. ౧౫౧౨) పరిపా
(౪). శ్రీ నచ్చిపిళ్ళె (క్రీ. శ. ౧౫౧౬) నాల్గు సంవత్సరముల
కురుకురు తిప్ప నాయకర్ ఐదు సంవత్సరములు (క్రీ.శ. ౧౫
వరకు. (౬). (క్రీ.శ. ౧౫౨౧--౨౩) కల్లైయమ్ కామయ్య న
(౭). క్రీ.శ. ౧౫౨౪-౨౭) నాల్గు సంవత్సరములు చిన్నప్ప న
(౮). ఐకార్తె వియప్ప నాయకర్ ఐదు సంవత్సరములు (
౨౭-౩౨). (౯). విశ్వానాథ నాయకర్ తొమ్మిది సంవత
(క్రీ.శ. ౧౫౩౩-౪౨). (౧౦). వరదా నాయకర్, నొక స
(క్రీ.శ. ౧౫౪౨-౪౩). (౧౧). మరితుంబిచ్చి నాయకర్, నొ
రము (క్రీ.శ. ౧౫౪౩-౪౪). (౧౨). మరివిశ్వానాధనాయక
నొక సంవత్సర ఏడు మాసములు (క్రీ.శ. ౧౫౪౪-౪౫) (౧
రాజు మరియొక సంవత్సరము (క్రీ.శ. ౧౫౪౬ - ౪౭). (
ముగ్గురురాజులు, తిమ్మప్ప నాయకర్, చెల్లప్ప నాయకర్
పట్టుకట్టి వీరప్ప నాయకర్ మున్నగు వారు శ్రీ కాళం
రుద్రోద్గారి. శక. ౧౨౪౬-౧౪౭౫ (క్రీ.శ. ౧౫౫౮-౧౭౬౨) వ

(౧౫). యిరువై ఏడుగురు రాజులు మధురై
ఏలబడిరని కనబడుచున్నవారు. (క్రీ.శ. ౧౩౨౪-౬౩) వరకు.

(౧౬). శ.క. వర్షము ౧౪౮౧ (క్రీ.శ. ౧౫౫౯) ప్ర
నామ సంవత్సరము. క్రీ.శ. ౧౫౬౦ శ్రీ విశ్వనాధ నాయక
కొట్టైయమ్ నాగమనాయకర్, రాయలవారి ఆజ్ఞతోవచ్చి
పన్నెండు సంవత్సరములు పాలించి, ఆచ్చటనే చనిపోయెను

(౧౭). (క్రీ.శ. ౧౫౫౯ - ౭౨) - (క్రీ.శ. ౧౬౭౨-౮౧). పై సంవత్సరమునుండి శ్రీకృష్ణప్ప నాయకర్ తండ్రి విశ్వనాధ నాయకర్ తొమ్మిది సంవత్సరములు మధురైను పరిపాలించి చనిపోయెను.

(౧౮). అతని కుమారుడైన అనగా కృష్ణప్ప నాయకర్ కుమారుడు వీరప్ప నాయకర్ (క్రీ.శ. ౧౫౮౧-౯౫) పదినాల్గు సంవత్సరముల వరకు పరిపాలించెను.

(౧౯). వీరప్ప నాయకర్ కుమారుడు కుమార్ కృష్ణప్ప నాయకర్ (క్రీ.శ. ౧౫౯౫-౧౬౧౩) పదునేనిమిది సంవత్సరములు పరిపాలించి, మరణించెను. (క్రీ.శ. ౧౬౦౨ -౦౭) ఐదు సంవత్సరములు విశ్వనాధ నాయకుడు, పరిపాలించెను.

(౨౦). శ్రీకృష్ణప్ప నాయకర్ తమ్ముడు ఎనిమిది రోజులు పరిపాలించి మరణించెను. తర్వాతఅతనే రాజ్యాధికారమును స్వీకరించెను. నది అవతలి ఒడ్డున, విశ్వనాధ నాయకర్ రెండవ కుమారుడు ముత్తు కృష్ణప్ప నాయకర్ పై సంవత్సరములలోనే పరిపాలించెను, అనగా పాల్గుణమునుండి దుందుభి వరకు పాలించెను.

(౨౧). ముత్తు తిరుమల నాయకర్ రాయన్, ముత్తు వీరప్ప నాయకర్ తమ్ముడుగారు, మీనాక్షి సుందరేశ్వరకు దేవాలయమునకు ఎన్నియో ధానములు కైంకర్యములు కొత్త మండపము, మరియు చెరువును, ప్రతి సంవత్సరము ఉత్సవములను నడుపునప్పుడు, బంగారు చెక్కడములలో ఒక సింహాసనము కట్టించెను. రధమును తయారు చేయించెను. ఒకగొప్ప కూర్చుండె స్థలమునకు రూపాయిలతో నింపి తయారు చేయించెను.

౪. పాండ్య, చోళ, చేర, ఆంధ్రరాజ్యములు దక్షిణ భారత దేశము లోఈ విధముగా నున్నవి.

౧. పాండ్య రాజ్యము :- పాతమధురై అనగా నేటి మధురై అవతలనుండి లంక ద్వీపమువరకు యుండిరి. వీరు 'ఫణీలు-అనగా పాండ్యులుగా మారిరి.'

౨. చోళ రాజ్యము :- కావేరి నదిఒడ్డున నున్న దక్షిణ భాగముకొంత, మరి వీరి ప్రస్తుతపు 'కరికాల చోళుని సంతానమని వ్రాసుకున్నారు.' వారేదక్షిణాదినుండివచ్చి తెలుగు రేనాటిరాజ్యమును, తెలుగు చోళ ముత్తరాజులై, తెలుగునాడును పరిపాలించిరి. క్రీ. శ. ౪ నాల్గువ శతాబ్దమునుండి కనబడుచున్నారు. (చోర అనగా సోళ, చోళగా మారిరి).

౩ చేర :- (కేరల) రాజ్యము. వీరు కేరళ మరియు తూర్పు కెనరా, రాజ్యము కలుపుకొని పాలించినటుల కనబడిరి. వీరు 'ముత్తు తాంబిరాన్' అని బిరుదములను కలిగియుండిరి.

౪. ఆంధ్ర :- అనగా (తెనుగునాడు). తెనుగు కళభ్రరాజులు దక్షిణమధ్య జనపధ అనగా దక్కన్ పీఠభూమియందు యుండిరి. ఇది నేటి తెలుగుదేశము. ఈ కళభ్రరాజులు '(శ్రీ) కాళహస్తి' కొండల నుండి దక్షిణాదికి వలసపోయిరి, మొదట చోళులను, తర్వాత పాండ్యులను పడద్రోసినకాలము క్రీ. శ. మొదటి లేక రెండవ శతాబ్దమునుండి ఆరవ శతాబ్దము వరకును మరియు ఆరవ శతాబ్దమునుండి తొమ్మిదవ శతాబ్దము వరకు, మధురై తిరుచ్చినాపల్లి, తంజావూరును పరిపాలించిన ముత్తరయర్లు అనగా ముత్తరాజులు లేక (ముదిరాజు) లని నట్లు తమిళచరిత్రలో డా. రాజమానిక్యంగారు చూపియుండిరి. మరియు

---

౧ సెటిల్ మెంట్ ఆఫ్ మద్రాస్- మద్రాస్ మాన్యువేల్ చరిత్ర.

౨. మధురై జిల్లా మాన్యువేల్ చరిత్ర.

౩. నాయకరాజుల చరిత్ర ,,

(నాలడియార్) గ్రంథముననుసరించి శ్రీ టి. వి. సదాశివపండారాత్తర్ వీరు ప్రాచీన రాజవంశమువారని చోళచరిత్రలోను కనుపరిచిరి. కాని వీరు నేటి తెలంగాణమునుండి పోయినటుల అనుమానస్పదము. ఈ తెనుగుదేశము, నేటి విదర్భనుండి - దక్షిణములోనున్న కంచీవరకు (మద్రాసు) వరకు వీరి ఆధీనములోనుండెను. పల్లవుల ఆధీనములో వచ్చిన తర్వాత, తొండై మండలమని నామ మిడిరి. ఈ ముత్తరయర్ అనగా ముత్త రాజులు, లేక తెనుగు ముత్త రాచలుయనికనబడుచున్నది. ఈ తెనుగు ముత్త రాచలు పల్లవ సామంతులుగా నుండినట్లు చరిత్ర వలన కనబడుచున్నది.

Note : తెనుగుదేశము విస్తీర్ణ హద్దులు :

ఉత్తరమున : నర్మదనది.
దక్షిణమున : కావేరినది.
పడమరమున : మహారాష్ట్రములోని గోదావరి నేటి (నాపిక్)
మరియు తూర్పున : ఒరిస్సాలోని తిలినది, లేక గంజాము
వరకని కనబడుచున్నదని ఊహాయే. (స్వంత).

---

౪. ఆంధ్ర, చోళ, చేర, పాండ్యరాజ్యముల విస్తరణ (ఊహ)

పదకొండవ ప్రకరణము

# ముత్తరాచలు - ఘంటసాల చరిత్ర.

## శ్రీ గొట్టిపాటి వేంకట సుబ్బయ్యగార్లు

శ్రీ గొట్టిపాటి వేంకట సుబ్బయ్యగారు తమ గ్రామము ఘంట సాల చరిత్రలో జమీందారుల గురించి వ్రాయుచు, ముత్తరాచల గురించి ఈ విధముగా పేర్కొన్నాడు.

జమీందారియుగము : శాసనమువల్లను చరిత్రవల్లను (౧౩) పదమూడవ శతాబ్దము వరకు, ఓడరేవుగా ఉండిన ఘంటసాలపురము, నదీ ముఖద్వారము మారుటచే, రేవు పోయినందున పట్టణప్రాముఖ్యము తగ్గి క్రమముగా క్షీణించియుండెను. ఆ పట్టణము ఏ వరదకో, ఉప్పెనకో లేక మరోవిధముగానో, పాడై పోయినట్లు తోచును. లేక కొద్ది జనసంఖ్యతో కూడుకున్న గ్రామముగ వుండెనేమో. పెద్దలవల్ల నేటి ఘంటసాల షుమారు (౨౦౦) రెండువందల సంవత్సరముల నాటిదిగా మాత్రమే విదితమగును. అంతకు పూర్వము చరిత్ర తెలుసుకొనుటకు ఎట్టి ఆధారములు లేవు, అనగా ౧౩—౧౮వ శతాబ్దముల మధ్య చరిత్ర తెలియదు. నేటి ఘంటసాల ప్రాచీన నివాసులుగా, బ్రాహ్మణులు, విశ్వబ్రాహ్మణులు, కాపులు, ముత్తరాచలు నుండిరని తెలియనగును. ల్యాండు రిజిస్ట్రారునుబట్టి, భూములన్నియు వారివిగనే తోచును. ఇప్పుడు వారిభూములన్నియు పోయినవి. అవన్నియు కమ్మవారి పరమైనవి.౧ (పుట. ౧౪౧-౧౪౨)

౨. రామాలయములు : "ఈ గ్రామములో మొట్టమొదటి రామాలయం, ముత్తరాజులది." దానికి అర్చకుడు వుండేవాడు. తర్వాత

వారికి శక్తిలేక ధూపదీప నైవేద్యములుమానిరి. రెండుచింతల ఆచ్చన్న పిశుపాటి, పుట్టంభొట్లుగారలు, ఆ శిలావిగ్రహములు తెచ్చి, విశ్వేశ్వ రాలయము వద్ద పుట్టంభొట్లుగారు, యం. ౫౦ యిచ్చిరి. ఇది యిప్పుడు వారి మనమడగు చల్లపల్లి రామక్రిష్ణయ్యగారి యాజమాన్యమునవున్నది. ఈ రామాలయములోని ముఖ్యమండపాన్ని, ధ్వజస్థంభాన్ని ఘంటసాల నర్సయ్య ఇ. రామరావుగారి భార్య వేంకటసుబ్బమ్మ చిట్టూరి లక్ష్మీనరు సమ్మగారలు బాగుచేయించిరి, ముఖమండపము నీరుకారుటచూచి, గొట్టి పాటి బ్రహ్మయ్య, వేమూరి సాంబమూర్తిగారలు ఇటీవల మరమ్మతు చేయుట జరిగినది. అనంతరము, ముత్తరాచలు షుమారు ౫౦ సంవత్స రముల క్రింద మరొక రామాలయమును కట్టించుకొనిరి. చెక్కలతో చేసే భజనలోగూడ వీరే ప్రధములు. ధర్మకర్తలు - యర్రబోయిన కృష్ణయ్య, ఇ. వేంకయ్య, కొంకితల రామయ్యగారలు. పై విధమును బట్టిచూచినచో ఘంటసాలభూములు ముత్తరాచలవై నుండునోపు. వారి ఆర్థికయిబ్బంది వలననో లేక కమ్మవారి అధికారమువలననో, వారి భూములను పోగొట్టుకొనిరి. (పుట. ౨౮౪-౨౮౬)

Note: ఘంటసాలపురము - పుస్తకము చూసి, చూసినయెడల నిజమును తెలుసుకోగలరు.

పన్నెండవ ప్రకరణము

## ముత్తరాచ-తెలంగాలు

ముత్తరాచలనే తెనుగువారందురు, వీరిని తెలంగాణమందు, తెనుగు, తెనగ, తెలగ, తెలిగోడ్, తెలింగె, తెలంగా, తెలుగోళ్లు, తెలగ నాయుడు, వోరుగంటి రెడ్లు, తలవర, తలారి, బంటు, మన్నెయని పిలువబడుచున్నారు.[1] "తెనుగు శబ్దము అచ్చ ప్రాకృతపదము, తెలుగు సంస్కరించిన పదము." తెనుగు ద్రవిడభాష కుటుంబమునకు చెందిన 'తేన్' ధాతువు, స్వచ్ఛత లేక తియ్యదనము సూచించును. తేన్ ధాతువు తెన్ను-తెను+అగు అనగా తెనుగు లేక తెలుగుగా రూపొంది నది, అనగా తెనుగుకులస్థులు స్వచ్ఛధనము, అయ్యధనము కలిగిన నొక పురాతన జాతి.

తేన్+అగు. ద్రవిడభాషలో 'తేన్' అనగా దక్షిణము అను అర్థమునిచ్చును. 'అగు' అనగా ఉండుటయనేది ఉనికిని సూచించున్న పదము. 'తేన్+అగు' వారు దక్షిణమున యుండువారు, లేక దక్షి ణాదిముఖముగా సంచరించువారు తెనుగువారు. ఈ తెనుగువారు మొట్టమొదట వింధ్యపర్వత పాదమందు నివసించుచు, ఔత్తరాహుల వలస వత్తిడికీ, ఇంకను దక్షిణమునకు సర్దుకోవలసినవారైరి. వలస దారులైన ఔత్తరాహికులుచే (మీకు) వీరిని దక్షిణాత్యులనియు లేక తెనుగు (తేన్+అగు) వారనియు పిలువబడుచుండిరి. తెనుగు పదమం దలి 'న' కారము కాలాంతరమున 'ల' కారముగా మారినది. 'ల'కార 'న'కారములు రెండును దంత్యోచ్చారణము కలవియగుటచే ఈ మార్పు కలుగుట సహజము. ఇదియేగాక వీరు త్రినగములనడిమధ్యనుండుటగాన 'తెనుగు' వారు. 'త్రి-సంస్కృతము- నగములు ప్రాకృతము.' నగము అనగా కొండ. నగము-నాగము (నాగబు)వారనియు, అనగా కొండల

---

౧. తెగలు లేక కులములు దక్షిణహిందుదేశచరిత్ర

మధ్య నుండుటవలన నాగులు లేక నాగులకు పూజచేయువారు యనియు తోచును. నాగులకు మరియొక పర్యాయపదము "హూణులు", హూణు లకు మొదటిపేరు "తలె" -(Tele), రసాతల, అతల, కుతల, పాతాల, మున్నగు పేర్లు దీనినుండే వచ్చెను. తల, తలె, తలై, యను పదముల నుండి 'తెలు' పదము ఏర్పడినదా ? లేక మార్కండేయ పురాణము ననుసరించి, మహానదికి ఉపనదియైన 'తిలి' నది నుండి వచ్చియున్నాదా? ఈ తిలియే తెల యను పదము కనబడుచున్నది.

తిలి లేక తెలియను రెండును దంత్యోచ్చారణము కలియుటచే ఈ మార్పు కనబడుచున్నది. "తెల+నగము = తెలంగము లేక తెలంగ యనియు సూచించుచున్నది. కాన వీరు "తెలంగాలని" తెలియు చున్నది.

పై త్రినగములు త్రిలింగములు అన్నభావము వెలనాటి దుర్జయ లకు ఉండగా, అసలు శబ్దము "తెనుగా-తెలుగా" యనునది అన్వేషిం వలయును. ఆంధ్రేతరులు తిలింగ్, తిల్లింగ్ అనియు దానినే తర్వా తెలంగాణ గా వ్యవహరించినది తెలిసినది. అక్కడ నివసించువారి 'తెలంగే'యని పిలువబడిరి. (శాసనములలో తెలుంగా రాయలు, లేక భూపాలురుయని ఆంధ్ర విష్ణువుకు యున్నది. ఇతను క్రీస్తుకు పూర్వము వాడు). శాసనములలో తెలుంగరాయలు లేక భూపాలురు, తెల్లరి మారి, తెలింగకులకాల, తెలుంగ, తెలుంగదమల్ల, మొదలైన పదము కానవచ్చును. ఈ శాసనములలోకూడ తెలుంగ, తెలింగ పదములు వాచకము లేదా జాతివాచకముగానే కనబడుచున్నది. ఒక శా ములో మాత్రము తెలుంగాణాడొళగణమాధవియకెఱగా, అని తెలుగు దేశములోని మాధవియకెఱె అను గ్రామము పేర్కొనబడినది. 'ఇందు తెలుగు-నాడు', అని తెలుగుదేశముదాహృతమైనది.౧ ఇదియేగాక రామ ప్రమారరాజు, చిత్రకూటమునుండి వచ్చినప్పుడు, ఇక్కడి తెలగవారి

౧. తెలుగువారెవరు - శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి.

బలమును గూర్చుకొని దస్యులను అణచినట్లు కనబడుచున్నదిగదా ! అంటే అప్పటికి తెలుగువారు లేక తెలుగు మాట్లాడేవారున్నట్లు తెలియుచున్నది, ఈ రామప్రమారరాజు, శాలివాహనునికన్న ఏడవపిడి మొదటివాడు. ౨ రామప్రమారక్షత్రియులు చూడుడు).

ఆనాటి త్రిలింగ లేక తిలింగ పదములు, ఒక దేజాతిని, దేశమును తెలుపుటకు వాడబడినవి. తెలుగును దేశ పరముగాను, జాతి పరముగాను వాడిన శాసనములింకను ఉండవచ్చును కాని నగముల మధ్యనుండుటవలన, తెనుగువారని తెలియుచున్నది. కావున తెనుగువారు తెలగవారి క్రిందమారి తెలంగాలు, తెలగాలు, తెనుగోళ్ళు, తెలుగోళ్ళు, పై చూపిన పేర్లుతో ఈ కులస్థులకు లోకవ్యవహారముగా నామకరణము జరిగినది.

వింధ్యకు దక్షిణముగా ఔత్తరాహుల వలన పెరిగిన కొద్ది, వారు బలవత్తురులై ఇచ్చటి పూర్వనివాసులగు (తెనుగు ముత్తరాసులకు)వారిని దేశముయొక్క మార్పు దక్షిణభాగమునకు నెట్టుతువచ్చిరి. ఇట్లు నెట్టుబడిన (దు-గతౌ అను ధాతువు) తెనుగువారు ద్రావిడులనబడిరి.౩ శ్రీ భాస్కరానందసాలెతోర్ గారు, ఈ తెలుగువారిని గురించి మార్కండేయపురాణమునందు చూపిన మూడు ముఖ్యమైన కొండలు, తుళువదేశమందు గలవు అని వ్రాసియున్నారు. (౧) పుష్పగిరి. (౨) కుత్సల, మరియు (౩) కుంజరగిరి. పుష్పగిరి పందార మరియు దుర్గయంతలో కనబడుచున్నది, (దాని ఎత్తు ౫౬౬౭ అడుగులు), అక్కడ సుబ్రమణ్యాస్వామి వారి దేవాలయము, తులువదేశమందు గలదు. ఆదే విధముగా - కుత్సలగిరి గోమంత మరియు క్రత్స మేరవద్ద ఆ పురాణమందు గలదు. అందరు నేరిగినగిరి పెద్దఎత్తుకొండ "కుత్సల" దానినే కుదసరియనియు (౮౦౦౦ అడుగులు) పదియోడు మైళ్ళు

---

౨. రామప్రమారక్షత్రియులు (చూడుడు).

౩. తెలుగువారెవరు ? - శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి.

కున్‌ద్‌పూర్ నుండిగలదు. (దానివద్దనేయున్న ప్రజలనుకంచీ). "కంచీలో నివసించువారు 'తిలింగాలు, తెలుంగాలు, తులుంగూలు' మరియు ఎవరునైతే కుంజరాద్రి వద్ద నివసించువారు, "కచ్చీ లేక 'కోచ్చిన్' తామ్రపర్ణియమని పరిసరప్రాంతములందు గలరు.

ఈ కుంజరగిరి అందరికి తెలిసినది. మహాగిరి, దానిపై రేణుకా దేవిదేవాలయము గలదు. ఇది రామాయణమందు, భారతమందు చూప బడినది, మార్కండేయపురాణములో చూపినది పేరు (శుక్తి) సూక్తిమతి -తుళువ అనగా గంగవాడి యనియు తెలియుచున్నది, లేక గంగోత్రి లేక (గూర్గేట్). ఇది శంకరనారాయణ దిశను పోవును. కాన కంచీలో నివసించువారు తెలుంగులైనుండునోపు.[౪] (తుళువచరిత్ర పుట. ౪౩, ౪౫).

ఇదియేగాక కుందూరు ఈశ్వరదత్తుగారు, మార్కండేయపురాణములో చూపినది, మహానదికి ఉపనది 'తిలి' నది యుండెనట. ఆ తిలి యొక్క రూపమే 'తెలు'గా రూపొందినటుల కనబడుచున్నది.[౫]

తెలుంగుదేశము : పురాణములలో నత్యంతప్రాచీనమైనవానిలో నొకటియగు మార్కండేయపురాణములో కూర్మవిభాగ ప్రకరణములో తెలుగుదేశమునుగురించి ఈ విధముగా పేర్కొనబడినది.

తిలింగా కుంజరీ కచ్చా వాసాశ్చయేజనాః।
తామ్రపర్ణీతథాకుక్షిరితికూర్మస్యదక్షిణః॥

మార్కండేయపురాణము విశేషపరిశ్రమతో పరిశీలించి, ప్రకటించిన, పర్గిటర్ (pargeter) గారు తిలింగపదము తెలుగుదేశములను సూచించుచున్నదని వ్రాసిరి. Bibliolheca India p. 367). "అట్లే వాయుపురాణములో మగధదేశములోని, జనపదములలో నొకటిగా తిలింగుల జనపదము చెప్పబడినది."

---

౪. తులువ - వారి-దేశము.
౫ ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము.

ఆర్ధపాశ్చాతిలింగాశ్చ, మగధాశ్చవృకైః సహో,
మధ్యదేశజనపదాః, ప్రాయశో౽మీప్రకీర్తితాః ॥

ఈ పురాణమందే తెలుగువారిని, దక్షిణమధ్యప్రదేశ జనపద వాసులలో నొకరిగ చెప్పబడెను. వాయుపురాణమునందు చెప్పబడిన తిలింగులు, మార్కండేయ పురాణమనందు జెప్పబడిన తిలింగులు, తెలుగువారినే సూచించును.

(౧౩) పదవమూడవశతాబ్దమున దేవగిరి పాలించిన యాదవరాజు లగు, మహాదేవరామచంద్రనరేంద్రుల కడ మంత్రిగానుండిన హేమాద్రి తన వ్రతఖండములో తెలుగుదేశమునకు తిలింగపదమే వాడియున్నారు.

తిలింగాధిపతేః, పశోర్విశసనం, రుద్రస్యరౌద్రకృతేః,
కరిత్వాపూరుష మేదయజ్ఞల దినో౽లబ్ధ స్త్రిలోకే జయః,
తైలింగ క్షితిపాలతూలనిచయ ప్రక్షేపఝుంఝానిలో,
గర్జద్ఘూర్జరగర్వ పర్వతభిదాదంభోలిదోర్విక్రమః॥౬

పైని క్రోడి కరింపబడ్డ ప్రమాణములంబట్టి తెలుగుదేశమునకు తిలింగ పదమే, మొదటివ్యాప్తిలో నుండెనని చెప్పవచ్చును.

తమిళ, కర్ణాటకశాసనములలో తెలుంగుపదమే ప్రథమున పేర్కొనబడెను. (౧౧) పదకొండవ శతాబ్దారంబమునందలి కొన్ని తమిళశాసనములలో తెలుంగులు, తెలుంగరాజులు పేర్కొనబడిరి.

మహోమ్మదీయ చరిత్రకారులు ఈ తెలంగాణ భూమినే, తిలింగా, తెలంగా, తెలంగాణయని, వారిచరిత్రలలో వ్రాసియున్నారు. ఇప్పటికిని నైజాం రాష్ట్రములోని ప్రదేశమును తెలంగాణాయనియే వ్యవహరింప బడి యున్నది. (౩). (V) వెలిచర్ల శాసనము (భారతి), ధాతనామ సంవత్సర శ్రావణమాసము శ్రీవోంగోలు వేంకట రంగయ్యగారు పరిష్కరించిరి.

---

౬. మహారాష్ట్ర చరిత్ర.

(౨). తిరుపతి శాసనము. శక. సం॥ ౧౪౩౭ సం॥ ౮౦ యొక్క తిరుపతి దేవస్థానములోని శాసనము. (Vole-III- పుట ౧౭౭-౧౭౯).

(౩). The early muslims expansion in the South India by Dr. N. Venketa Ramanaiah. (Page 165-168).

తెలుగాణము. (తెలంగాణము). ఆంధ్రదేశములోని పూర్వపు హైద్రాబాద్ రాష్ట్రభాగమునకు, కృష్ణాకుత్తర భాగమైన ఆంధ్ర భూమండలమునకు తెలుగాణమని పేరుండెను.

పదునేనవ శతాబ్దాంతము నందుండిన, 'వెన్నెలకంటిసూరకవి', రచించిన విష్ణుపురాణములో కృతిపతియైన రాఘవరెడ్డియను, నతని జనకుడు ఉదయగిరి రాజ్యపాలకులుగా నుండిరి. రాఘవరెడ్డి పూర్వీకు లలో నొకడగు బసవభూపాలుడు, తెలుగాణభూములలోని, 'మన్నెవారి' చేత గప్పములుగొన్నట్లు కవి వర్ణించియున్నాడు.

సీ॥ కటకాధి పతియైన గజపతిరాజుచే,
ప్రతిలేని పల్లకి పదవినొందె,
మహిమచే గర్ణాట మండలాధిపుచేత,
గడలేని రాజ్య భాగములు గాంచె,
ప్రౌఢ పౌరుషమున రాజిల్లి మెఱయగా,
మలకప జీర్లకుమ్మలిక జేసె,
దెలుగాణ భూములగలమన్నె వారిచే.
బలవంతమునకు గప్పములుగొనియె.

గీ॥ జాటుధాటీనిరాఘాట ఘోటకాద,
శిఖురోద్ధూతనిబిడ ధూళీవిలిప్త,
మంది తాగాంగానకు చమండలుండు,
బహు బలిశాలి తమ్మయ్య బసవ విభుండు.౭

---

౭. ప్రాచీనాంధ్రచారిత్రక భూగోళము by కుందూరి ఈశ్వరదత్తు.

క్రీ.శ. ౧౦౨౨ నాటి యొక తమిళశాసనములో వేంగి గంగ మండలి, మహాదండ నాయకుడైన 'మారాయడు', చేర, తెలుంగ, రట్టుగ, కొంకణ, తుళువ, రాజుల జయించినట్లు తెలుపబడినది. (౨). ఆ సంవత్సరమును నాటిదేయగు మరియొక తమిళ శాసనములో (మొదటి పరికేసరి రాజేంద్ర చోళుని పదియవ పరిపాలనాటి సంవత్సరము నాటిది).

కళింగులతోను, ఒడ్డియులతోను, తెలుంగులతోను యుద్ధము పేర్కొనబడినది. (౩) కార్ణటక శాసన సంపుటములోని యొక కన్నడ శాసనమందు కొంగల్వరాజొకడు', తెలుగుదేశమును జయించెనని వ్రాయ బడినది. (౪) అనగా మొదట తిల్లింగ, తెలంగా, తెలుగుపదములే, పురాణములందును, శాసనములందును వ్యాప్తియందుండెను.

శా. శ. ౧౨౮౦. నాటిముమ్మడి నాయకుని, శ్రీరంగము తామ్రశాసనములో తిలింగ దేశసీమా నిర్ణయించినట్లు వర్ణింపబడినది.

(౫). హిరూచలా దాణవణోదమే, తత్ ఖండంభువో, భారతవర్ష మహా
తత్రా పితద్భరతస్య ఖండంచరింతియ, త్రాశ్రమ వర్ణధర్మాః ॥
పశ్చాత్పుస్త్రాదపియ స్వదేశాఖ్యాతా, మహారాష్ట్రకలింగ సంజ్ఞా.
ఆవాగురుల్ పాండ్య, కన్యకుబ్జదేశ, స్మతత్రాస్త్రీతిలింగానామ.౮

## భరత వర్షములోని తెలింగదేశమునకు సరిహద్దులు.

(౧). ఉత్తరమున కన్యాకుబ్జము, (౨). దక్షిణమున పాండ్య దేశము, (౩). పశ్చిమమున మహారాష్ట్రము, (౪). తూర్పున ఓడ్డర దేశము.౯ (ప్రా. ఆ. చ. భూ.).

పెదకోమటి భూపాలుడు విశ్వేశ్వర పండితునకు వెలినాటిసీమతో తుంగభద్రా నది, తీరమందున్న అలపాడు గ్రామము నగ్రహారముగా నిచ్చిన, సందర్భమున శ్రీనాథుడు విరచిత శాసనములో వెలనాడు త్రిలింగదేశాంతర్గతమని వ్రాయ బడినది.

---

౮. ప్రాచీనాంధ్రచారిత్రకభూగోళము.
౯. ,, ,,

ప్రదాత్రిలింగ విషయే, వెలనాండౌ మనోతమే,
తుంగభద్రాతరంగిణ్యాం, ప్రాక్త్రీ రేపర్యవస్థతః॥-౧౦

పై చూపిన ప్రకారముగా, కంచీలో నివసించువారు తెలుగు వారు, తెలింగ లేక తులుంగువారై యుండనోపు. మరి తమిళములో 'తలైంగు' లనికూడ వాడిరి. ఈ తలైంగులు బర్మాదేశమునకు వెళ్ళి పరిపాలించినట్లు కనబడుచున్నది. తలైంగు గ్రామనామములు శాసనములయందు కనబడుచున్నవి. కనుక తిలింగాలు, తెలింగాలు, తులుంగాలు మరి తలైంగులు కంచీలో నివసించు తెలుగుముత్తరాచలు, పల్లవులకు సామంతులై, మధుర పాండ్యరాజులను వోడించి మధురైను పాలించినట్లును, మరి వారిని (పల్లవరేస్) (Pallava Race)యనియు, అనగా తెలుగుముత్తరాచలనియు గలదు. వారినే ముత్తరయర్‌లని గూడ తమిళదేశములో పిలిచిరి.౧ (తమిళవరలబు).

తుళువదేశము వారైన చాలుక్యులు సైతముకూడ తెలుగువారమని మరి తెలుగు భాషకు నెక్కువగా ప్రాముఖ్యతనిచ్చిరి. కొలిపాక పరిపాలన కాలములో 'తెనుగు-నాడు' యని పిలువబడిరి. మరి రాజరాజ నరేంద్రుడు, తుర్వసుని సంతతి చంద్రవంశమనికూడ శాసనమందు వ్రాసుకొనిరి. ౨.

వీరేగాక శ్రీకృష్ణాదేవరాయలు, తుళువయని చెప్పుకొన్నాడు. మరి తుర్వసుని సంతతి, చంద్రవంశ మనికూడ తెలుపుకొన్నాడు.౩. మరి తెలుగుకన్యలను వివహాము మాడి, తెలుగుమట్లరాజులకు, ఆర్వేటి వారికి తన కూతురులను యిచ్చి వివహాము చేసెను. కనుక తెలుగు వారికి, తెలుగుభాషకు ప్రాముఖ్యతనిచ్చి దక్షిణభారత మంతయు తెలుగుభాషను ప్రజ్వలించెను. మరియు 'దేశభాషలయందు తెలుగు లెస్స' యని సంభోదించెను. నాటినుండి తెనుగువారు దక్షిణాదిలో నేటివరకు ఎక్కువ సంఖ్యలో కనబడుచున్నారు.

---

౧౦. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము (పుట. 168-167).

పై చూపబడిన శుక్తి లేక సూక్తి మతినది-అనగా గంగావాడి లేక గంగోత్రి; ఈ నదిఒడ్డున పరిపాలించిన రాజులు 'గంగావాడి ముత్త రాసర్' లని కనబడుచున్నది. 'గంగవాడి ముత్తరాసరైన శ్రీపురుస ముత్తరాస' రాజుయే శంకరనారాయణ దేవాలయమును కట్టించినట్లు కనబడుచున్నది. క్రిష్ణా వీరిని వోడించినందున, ఇతని కొడుకు శ్రీ శివ రామ ముత్తరాస తిరిగి సంపాదించెను. (శ్రీపురుస ముత్తరాస వంశ మును చూడుడు). (తుళవ - వారిదేశము)

ద్రాక్ష రామములో శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు చూపిన తెనుగు- తెలుగు పదమునకు వక్తవ్యము.

చర్చల దారిని జర్చలను బోనిచ్చి, త్రిలింగ- తెలుంగు శబ్దముల కొక ముహూర్తమున ముడిపడ్డది. కాగా-శ్రీభీయ అచ్చపు తెలుంగు దేవుడు.

శ్రీనాథుడు మహాకవి భీమేశ్వర పురాణకావ్యమున రసధనులు (పైకెగసినవి, కవిసార్వభౌమనియు యమృతవాక్కులతో దక్షవాటిక యమరసీమ యైనది. అది తెలుంగుల పుణ్యపరిపాకము. (పుట ౧.)

వర్ధిమై నిడిన మర్యాధరేఖ,
నేరేడు పండట్టు లీఱెండుగరళమ్ము
మిసిమింతుండును గాక మ్రింగినాడు. (పు. ౭).

యశోతిలక లుర్విన్ మల్లెపూ లోవియంగా తెనుంగుంభూమి నలకరించిరి. మహాదేవాలయా ఘుమ్మలన్. (పు. ౧౧).

దర్శనము : ఈతడేమన తెల్గునేత కాకుళ విష్ణు,

ద్వితియము-మహార్షి : ముదిరినగాంభీర్యముద్రలో ధర్మజు,
పౌరుషగర్భ సత్వములు తొనకు,

---

పుట. ౧. దక్షారామము
౭. ..
౧౧. ,,

చూచిన చూపుతో లేచి వెళ్లెడు, వాసు
దేవుని రాజనీతి ప్రకర్ష; (పు. ౧౭).
తెలుంగు మహానదుల్ ! కదలి తేటజలమ్ము
లనర్ఘ్యపాద్యముల్ సలుపుడు ! పూలతీవియలు!
చల్లురుకమ్మని పూవులు ; చెట్టులు జలజల తేనే
లూరు ఫలసంతతి నర్పణచేసి భక్తులై, గొలు
వుడు మౌని మౌళి; తెనుంగుల్ సమయజ్ఞు
లటంచు దెల్పుచున్. (పుట. ౧౮).

తృతీయ-శిల్ప సందర్శనము : అనుంగు - తెనుంగు తమ్ముండిటులస్మదు
దీక్షితపూర్వలోకమందును, బరి దృశ్యమాన
సుమనోహర దైవత గేహారంగ మందును,
దిరుగాడి గతధోరణి సింహావ దృష్టి నాచి
యిట్లు నెలగలయంగ జూచి, తనయాత్మన
నిల్పు చరిత్ర వాసవన్. (పు. ౨౩.)

జైనుల చరిత్ర
తెలుగు మంత్ర
రాజుల సంగ్రహ
చరిత్ర.
[illegible]

ఈ తేన్గు చిన్న ఊరేనా? మహాగ్రంథ, నిర్మాణగరిమ, సంధించె
మునికి ! తొల్లి యీ చేఱుత వీధులలోన నాదేవ, కోటులు ఖీమేళుల
గొలువనరిగే (పుట. ౨౪).

తేనుగుదుక్కి. శ్రీ K. లక్ష్మీరంజన.

ఆధునిక కవిత్వము : ఆంధ్రదేశము మట్టి, అదిమా హక్కు, ఆంధ్ర
దేశపునీరు, అదిమాకునమృతము. (పుట. ౪౨)

(2). తేనుగుదేశమున బుట్టి, తేనుగుదేశమున పెరిగి, తేనుగుముత్త
రాజులై వెలసి, తేనే మనస్కులై, నేడు తెనుగులంబాయే.
(స్వంత).

(3). తెనుగుదేశపు మట్టి, తేనుగు తలవరుల హక్కు, తెనుగుదేశపు
నీరు, తేనే వంటి అమృతము. (స్వంత).

---

పుట. ౧౭. దక్షారామము.
పుట. ౧౮, ౨౩, ౨౪ ,,
౧. పు. ౪౨. తెనుగుదుక్కి.

(4). ఏ రాజు పంచేనోయిచట, శౌర్యపుపాయ, నమ్ములు నాగుల చవతి నాళ్ళ, ఏయెట్టి సంజలోనెలమి పల్లవరాజు, రమణులు కాళ్ళ బారాణుల లిడిరో, చిత్ర రథస్వామి శ్రీరథోత్సవములో, తెలుగు పిల్లలు కత్తిత్రిప్పి రెపుడో, ఏ రెండు జాములయినను వేడిమివచ్చి, అలసిపోయనో త్రిలింగ ప్రభువుల, నా జగచ్ఛయ సంబులై తులరు తొంటి, వేంగిరాజుల పాద పవిత్ర చిహ్నా గర్భితంబైన, ఈ భూమిఖండమందు, నశ్రువులు జారు జీవచ్ఛ తెనుగు జనులు.[౧] (పుట. ౬౦).

(5). మునుమార కవిత దేశంబున, నేలయంగ దేశ కవిత బుట్టించి, తెనుంగును నిలిపి, దక్షిణమధ్య జనపథ విషయంబున, మందర పర్వతమున. ముత్తరాజులు బలువురున్. (స్వంత).

౨. తెనుగు - తెలుగు - తెలగ, శబ్దనిర్వచనము - (నిఘంటువు).

తెనుగు : (తెను + అగు) తెనుగు అనగా స్వచ్ఛదనము, ఆయ్యాధనము గలవారు.

తెనుగు : (తేన్ + ఆగు) తెనుగు అనగా ద్రవిడ భాషలో 'తేన్', అనగా దక్షిణము అని అర్థమగును, 'ఆగు' అనగా ఉండుట, లేక నివసించు వారుయని అర్థము.

తెనుగు : త్రినగముల నడిమధ్య నుండిన తెనుగువారు. త్రి, సం॥- నగములు ప్రాకృతము. త్రినగము లేక మూడునగములు మధ్య ప్రాచీన కాలమునుండి నుండుటచే, వీరిని తెనుగు వారనిరి.

తెనుగు : వై. వి. సం॥ (త్రినగ) తూర్పు కనుమలు, పడమర కనుమలు, హింధ్యపర్వతములు, మున్నగువాని మధ్యనున్న దేశము. రూపము-(తెలుగు).

తేనే కచకము : ధాన్యకటకము, నేటి అమరావతి. 'ఈ తేనే కచకమును' బుద్ధుని శిష్యుడు, చీని వాస్తవ్యుడు,

౧. పుట. ౬౦. తెనుగుదుక్కి.

(హుమ్యాన్ సాంగ్) భారత దేశమును పరియటించు సమయమున, తన గ్రంథమందు వ్రాసినట్లు శ్రీనీల కంఠ శాస్త్రిగారు మరి ఇతర చరిత్రకారులు వ్రాసి యుండిరి.

త్రిలింగ : త్రిలింగ శబ్దము విద్యానాధునికన్న కడుప్రాచీనమైనది.(౨) క్రీ.శ ౧౫౦ సంవత్సర ప్రాంతములందుండిన గ్రీకు భూగోళ శాస్త్రజ్ఞుడు, 'టోలెమి' తన గ్రంథమందు 'ట్రిలింగాన్' అను పదము వాడియున్నాడు. ఇది త్రిలింగ శబ్దరూపమే యనుట నిర్వివాదము, అప్పటికే అతిప్రాచీన కాలముననే తెనుగుదేశము నుండి వలసపోయిన జనులసంతతివారు. బర్మాలో స్థిరనివాస మేర్పరచుకొనిరి. బర్మాలో తలైంగు లని పిలువబడు జాతిప్రజలు గలరు.

తెలగాణము : వై. వి. తెలుగుదేశ సంబంధమైనది. రూ. తెలంగాణము. (శబ్దార్థదీపిక).

తెలంగ : యుద్ధవీరులు, సంస్కృతశబ్దములోనిది. మరియు వీరు ఆర్యసంతతికి జెందిన కులజులు. (తెలగాలు చూడుడు.)

తెలుంగు : దీనికి తెలుంగు, తెలుగు, తెనుగు, ఆంధ్రమను రూపాంతర ములు కలవు. త్రిలింగశబ్దమే వైకృతరూపము.

తలైంగులు: తలైంగులు తెలుగువారేగాని, వీరు బర్మాకు, కాకతీ యుల కాలములో వలసపోయియుండవలెను. (శ్రీవేదం)

తలైంగులు: తెలంగులనుండి వచ్చిన పదము. ఇప్పుడు బర్మాదేశమునందు రాజులుగా పరిపాలన చేసినవారు. వీరు తెలుగువారనుట నిక్కువము. మరియు ఈ తలైంగులు కంచీనుండియే బర్మాకు పోయినటులకానవచ్చుచున్నది. తలైంగు-తిలింగు శబ్దములు సంస్కృతమున ఈ 'త్రిలింగ' అయియుండును. శాసనాలంకారమును బౌద్ధగ్రంథమునందు ఓక తలైంగు (తెలుగు) రాజు బర్మాలో బౌద్ధధర్మమతవ్యాప్తికి కారణ

భూతుడయ్యెను. బర్మాలోని తలైంగులకును-తెనుగు ముత్త రాసలకుగల సంబంధమును చూడవలసియున్నదని శ్రీ ఖండ వల్లి లక్ష్మీరంజనంగారు సిద్ధేశ్వర చరిత్రలో చూపిరి.

తలైంగు : ఈ తలైంగు అను పదము (స్థల-తల-తలైంగు) అని వారు తిలింగుజాతివారై యుందురు. తిలింగులు జనసమృద్ధిగల వారై క్రమముగా సముద్రతీరమువరకు వ్యాపించి 'కళింగు లను' గోదావరికుత్తరదేశమునకు నెట్టగలిగిరి. భారతదేశము నుండి తూర్పు సముద్రదీవులకును దేశములకును మొట్ట మొదట వలసపోయిన సాహసీకులు 'కళింగులు'. ఆయా ప్రదేశములకు వలసవెళ్లినవారు 'తెనుగువారు, తమిళులు, ప్రాథమికవలసజనులు, కళింగులగుటచే, అనంతరమువచ్చిన వారిని కూడ ప్రాచ్యదీవులయందలి జనులు కళింగులుగా భావించి వ్యవహరింపజొచ్చిరి. వీరు కళింగులను 'క్లింగు'లనిపిలి చిరి. ఈ కళింగులే తెనుగువారు. తర్వాత ఆంధ్రులను పేర్కొనుటలో ప్రాముఖ్యత వహించిరి. గ్రంథప్రయోగ మునుబట్టి చూచినచో తెలుగుపదముకన్న 'తెనుగు' పదమే ప్రాచీనమనిపించును. వాగనుశాసనుడుని కీర్తివడసిన, నన్నయభట్టారకుడు తన ఆంధ్రమహాభారత పీఠికలో 'తెనుగు' అని ప్రయోగించియున్నారు. ఈ తెనుగు పదము తెలుగు లేక తెలగగా మారుటకు "హూణుల కాలము అనగా నాగులు వచ్చి స్థిరనివాసము ఏర్పరచుటచే, 'న' కారము పోయి 'ల'కారము ఏర్పడినట్లు కానవచ్చుచున్న దని ఊహయే.

ఈ నాగులు క్రీస్తుకు పూర్వము ఆరవశతాబ్దము ముందువారుగ కనబడుచున్నారు. వీరి కాలమానము స్పష్టముగా చెప్పుట కష్టతర ముగా కనబడుచున్నది.

## తెనుగు - తెలుగుపదము

పై తెనుగు లేక తెలుగు పదమునకు చూపిన శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ, బి. ఏ. (1966). ప్రాచీన ఆంధ్రదేశ గ్రంధాలయ చరిత్రలో ఈ విధముగా చూపినారు.

ఆంధ్ర దేశములోని కొంతభాగమునకు, అనగా కృష్ణవేణీ, ప్రాంతదేశమునకు బుద్ధునికాలమున 'నాగభూమి'యని, మంజీర దేశమని, మరియు వజ్రదేశమని పేర్లున్నట్లు బౌద్ధవాఙ్మయమును బట్టి ఎఱుంగవచ్చును. ఆర్యులు రాకపూర్వమే ఈ ప్రాంతమంతయు అనార్యులు లేక ద్రావిడులచేత ఆక్రమించబడియుండెను. వీరు బహుళ సర్ప పూజ చేయుచుండుటచేత కాబోలు, నాగులనికూడ పేర్కొనబడుచుండిరి. ఆ కాలమున వారు మాట్లాడు భాష 'దేశి' యనబడుచుండెనని ఊహించవచ్చును. ఇదియే 'తెలుగు భాష'. ఈ భాషను వాడుటచేతనో లేక యితరకారణములచేతనో తరువాతకాలములో దీనిని "తెలుగుదేశమని" తెనుగు దేశమని, త్రిలింగయని పిల్వసాగిరి. తెలుగు, కన్నడము, మళయాళము, తమిళము అనునవి దక్కన్‌నులో 'అనార్యులు' లేక 'ద్రావిడులు' మాట్లాడు భాషల పరివారములోనివి. ఈ నాల్గుభాషలు మాట్లాడువారు క్రీ. పూ. ౬వ శతాబ్దినాటికి దక్షిణాపథము నాక్రమించినట్లు కాన్పించుచున్నది. ఆర్యులు రాకపూర్వమే 'మహేంజోదారో' ద్రావిడభాషలు కాన్పించినవి.

క్రీ. పూ. ౬వ శతాబ్దినాటి ఒక అగస్త్యఋషి ౧౮ మంది రాజ కుటుంబీకులతో ౧౮ లతుల జనులతో వింధ్యాపర్వతములు దాటి దక్షిణ పదమునకు వచ్చెనని తమిళగ్రంధములు పేర్కొనుటచేత, అప్పటికి ద్రావిడులు, ఆటవికజనులు, దండకారణ్యమును బేదించి, నివాస యోగ్యమైన గ్రామముల. పురముల నిర్మించుకొనిరని, వారివారి భాషల మాట్లాడుకొనుచుండిరని చెప్పవచ్చును. ఉత్తరదేశమునుండి కొందరు

వర్తకసంఘములవారు, బుద్ధునికాలములో క్రీ. పూ. ౫౫౩-౪౭౭)దక్షిణా పథమునకు వచ్చిరి. దక్షిణపథరాజు వారిని మీ రాజెవరు ? అని అడుగగా "స్వామి" మా దేశమున కొన్ని గణరాజ్యములు, "కొన్ని రాచరికములు"అని ఆబిడారిసంఘముపెద్ద చెప్పెను. ఈవిధముగా ఆర్యావర్తమునకు, దక్షిణాపథమునకు రాకపోకలుజరుగుచుండెను. రామప్రమారరాజు రాక ముందున్నట్లునుయు గాక శాలివాహనునికన్న పూర్వీకులుగానున్నట్లు శాసనమువల్ల తెలియుచున్నది. ఇక ఆంధ్రపదము లెట్లు ఏర్పడినదో కనుగొందము.

౩. శ్రీ నీలకంఠశాస్త్రిగారు తన ఆంధ్రులచరిత్రలో, దక్షిణ భారతదేశమందు 'అమ్దపద' (Amdha Padha)అనియు, దీనినుండియే ఆంధ్రయని పిలువబడినదని చూపినారు. ఈ ఆన్దపదముకూడ, ఆర్యులు దక్షిణాదికి వచ్చి స్థిరనివాసములు ఏర్పరచుకొన్నందువల్ల ఆర్యులు ద్రవిడులుగా మారినందువల్ల కలిగినదేమో, శబ్దధాతువునుండిచూచిన, "ఆ" ఆర్యులు - "ద్ర"-ద్రవిడదేశము రెండునగముల మధ్యానున్నందులకు "న" అక్షరము కలుగుటచే "అంధ్ర" అనియు కనబడుచున్నది, ఈ ఆర్యులు బౌద్ధకాలమువారు. రెండు నగముల మధ్య నివసించుటచే పేరు ఏర్పడినదేమో.

కనుక నాటి పాళీభాషలో ఆమ్ధులు (Amdhuloo) యని ప్రయోగించియుండవచ్చును. లేక ఆంధ్రులంటే "ఆంధరహితులు"అని అర్థం. అంటే గుడ్డితనం లేనివారు, జాగ్రతగలవారు అని ఆపదముల లోని అర్థం. ద్రావిడులంటే పరుగెత్తు, పారిపోయేవారు అని అర్థమిచ్చును. (తెలుగుజాతి మేలుకోవాలె), మరియొక పర్యాయపదము, ఆంధ్రులకు గలదు. అంధ్రులనగా - అంధులకు దారిచూపువారు, లేక తేజోవంతమైనవారు. ఆంధ్ర మల్లునితో శ్రీకృష్ణుడు మల్లయుద్ధము చేసినటుల కనబడుచున్నది.-౨ మొత్తము మీద

చూస్తే ఆంధ్రులే తెనుగువారు. తెనుగుదేశమునుండి వలసపోయిన 'కళింగులు' (క్లింగులు) అనియు మరియు బర్మాకు పోయినవారు తలైంగులనియు వీరందరూ ఒకటిగా కనబడుచున్నది,

చంద్రగుప్తుని ఆస్థానముననున్న గ్రీకురాయబారి మెగస్తనీసు "తెలుంగరాజ్య" విస్తీర్ణమును, సైన్యమును, దేశ సంపదలును వర్ణించి యున్నాడు. తెలుంగదేశమునందు (౩౦) ముప్పై దుర్గములుండినవని వ్రాసెను. వీరు సర్వ స్వతంత్రులైరి. తెలుంగుదేశమునకు త్రిలింగ దేశము, వజ్రభూమి, నాగభూమి, మంజీరదేశము, వేంగిదేశము, మున్నగు పేర్లు ప్రాచీనవాఙ్మయములో కన్పించుచున్నవి. శ్రీశైలము, ద్రాక్షారామము, కాళేశ్వరము అను మూడు ప్రసిద్ధ శైవ క్షేత్రము లీదేశమందుండుటచే, దీనికి త్రిలింగ సంజ్ఞ కలిగెనని చెప్పుదురు, ఇదియేగాక గంగా, నర్మదా, సరస్వతి నదులు కలియు చోటు "త్రివేణి" అని యున్నది. ఆ త్రివేణి తర్వాత వారాణాసి పోయేవరకు గంగానదిగా మారినది. ఈ నది ఒడ్డుననున్న విశ్వనాథుని దేవాలయము నర్మదానది ఇవతల ఒడ్డునున్న సోమనాథ దేవాలయము, మరియు తొండై మండలములోనున్న పాతాళగంగ ఒడ్డుననున్న శ్రీశైలమున మధ్యనుండు జనపదమును త్రిలింగశైవక్షేత్రములతోనున్న దేశముగా కనబడుచున్నది. భూగోళశాస్త్రముగా నర్మదనది ఇవతల ఒడ్డునుండి కావేరివరకు, దక్షిణ మధ్య జనపదమనికానవచ్చుచున్నది. దానినే పంచ ద్రవిడలలో నొకటిని పురాణములు చూపుచున్నవి. కాన త్రిలింగపదవ నుండియే తెలుగు అను పదము పుట్టెనని పండితులు తెల్పుదురు. ఆ పేర్లుగల వజ్రము లుండినందున వజ్రభూమి, నాగులుండినందున నాగ భూమి, మంజీరనది ప్రవహించుటవలన మంజీరదేశమని, మహానది ఉపనదియైన తిలినది నందుండుటవలన "తిలి" నది ఇవతల ఒడ్డుననున్న తిలింగప్రదేశమును తెలుగుదేశమని పిలువబడినది. ఈ తెలుగుదేశమును,

మొట్టమొదట పరిపాలించినవాడు తెలుంగరాయలుడని యున్నది. ఈ తెలుంగరాయలుడే ఆంధ్రవిష్ణువని పేర్కొనిరి-

క్రీ. పూ. నాల్గువ శతాబ్దమందే ఆంధ్రరాజ్యము స్థాపించబడినది. పురాణముల ప్రకారము ఆంధ్రవిష్ణువు అనెడురాజు నిశంబుడను దానవ నాయకుని నోడించి కృష్ణానది తీరమున శ్రీకాకులము అను పట్టణ మును రాజాధానిగా చేసుకొనీ రాజ్యమును స్థాపించెను. 'ఆంధ్రవిష్ణువు -'సుచంద్రుడను రాజుయొక్క కుమారుడు.' ఆంధ్రవిష్ణువుని యొక్క జ్ఞాపకార్థము శ్రీకాకుళమున ఒక ఆలయము నేటికినీ కనబడుచున్నది. ఇచ్చట దేవుడు ఆంధ్రనాయక దేవుడు.

ఆంధ్రనాయకదేవుడు శ్రీకృష్ణదేవరాయల కలలో తన గురించి ఒక వ్యాసమును రచించుమని అడిగెనట. శ్రీకృష్ణదేవరాయలు, ఆంధ్ర విష్ణువుని తెలుంగరాయుడనిసంబోధించి ఆముక్తమాల్యదను పుస్తకము వ్రాసెను. కనుక ఆంధ్రవిష్ణు తెలుంగు వాడని కనబడుచున్నది. ఆంధ్ర ప్రాంతమును పరిపాలించినందువల్ల ఆంధ్రవిష్ణువని పిలువసాగిరి. తర్వాత అతని ఆలయమును గూడ కట్టించిరి.

పై చూపిన నిషంబుని గురించి (పుట. ౬౩ ). చూడుడు.

ఇదంతయు చూడగా, తెనుగు ముత్తరాచలు తెలంగాణమందు యేబది లతుల పైగా యున్నట్లు కనబడుచున్నది. "తెనుగు ముత్తరాచ అనగా తెనుగు కులము- ముత్తబిరుదము లేక ముఖ్యుడు-రాచ-రాజు యని తెలియుచున్నది." "వీరే తెలుగు ముత్తరాజులుగా పిలువబడుచు న్నారు. ముత్తరాచకులకట్టు శాసనమును, మరియు శ్రీ టి. వి. సదా శివపండరాత్తర్ గారి అభిప్రాయములతో చూచినచో "వీరు క్షత్రియు లంటివారుగా నెంచవలయును."

౪. తెలగాలు- తెలంగాణదేశస్థులగుటచేత తెలగాలుఅని పేరొందిన వారు. వీరు ఆర్యాసంతతికిజెందిన కులజులు. (తెలంగాణము చూడుడు).

తొల్లింటి తెలుగాలు ప్రజాసంఘమున నాయకత్వము వహించి, ప్రజలను దస్యులబాధలనుండి తప్పించినటుల గ్రంధాధారములు కాన వచ్చుచున్నవి. ఆదినుండియు తెలగాలు మానాభిమానులై మెలుగుచుం డినవారు. "రామపరమార" యను మహనీయుడగుశూరుడు (క్షత్రియ కులము - పరమారక్షత్రియుడు.) తెలగవీరుల సైన్యబలమును గూర్చు కొని, వారి ప్రతాపమున దస్యుల గదలింపగల్గెను. వీరు కత్తులు, కఠా రులు, బాకులు, ఈటెలు, మొదలగు నాయుధములను దాల్చి దస్యు లను కొవ్వడంచుచు తమ పౌరుషనామము లాచాంద్రార్కముగ, నీలోకమున నుండదగినట్లు చేసుకొనిరి. గాన తెలగాలలో నింటిపేర్లు కేవలము గ్రామనామములేగాక, శూరకత్తులవారు, ఈటెలవారు, బాకులవారు, తుపాకులవారు, కఠారులవారు, మొదలగు పౌరుషనామ ములు పెక్కులు గానవచ్చుచున్నవి.

చాళుక్యభూపతి జయసింహ్మునిని మనుమడు మొదటి 'పులకేసి' అశ్వమేధయాగము జేయబూనినవారు తెలగాలే. విజయోత్సాహులై వెడలుచుండిన తెలగ వీరులు, స్వతంత్ర రాజ్యములను నేర్పరుచుకొని, జయసింహ్మములుగ, అక్కడక్కడ శాసనములు వ్రాయించిరి. అట్టి శాసనములు, మధుర దేవాలయములోను, మఱికొన్ని ఇతరస్థలము లందునను నేటికిని గానవచ్చుచున్నవి. 'మధురలో రాజ్యముచేసిన తిరు మల నాయకనృపతియు, మంగమ్మదేవి మహారాణియు తెలగాలు, మరి కట్టవీరబొమ్మన సహితము తెలగాలే.' ఈ నాయకశబ్దము నాయుడుగా మారినది. తెలగాలు నాల్గుశాఖలువారుగా నున్నవారు. (౧) తెలగాలు లేక (నాయుళ్ళు) (౨) ఒంటరులులేక(దొరలు) (౩) బలిజలు, మరియు (౪) కాపులునని, తెలగా లేక నాయుడు మొదటి నుండియు పౌరుష వంతులై యుండి యుద్ధమేతమకు ప్రధాన జీవనముగా పరిగణించుచుం డెడివారు. తెలగాలు బ్రిటిషు ప్రభుత్వమునగూడ తెలుగు పటాలములో సిపాయిలుగా చేరి పనిచేయుచు, నాయకసుబేదారు, జమదార్, పల్లకీ

సుబేదార్, హావల్దార్, మేజర్ షుబేదార్ అను అధికార బిరుదు గౌరవమును కాపాడుకొంటు యందగ్రేసరులై యున్నారు.౧

శ్రీ హేచ్. ఏ. స్టూఆర్టుగారు చూపిన ప్రకారము 'తెలుగు జాతికి చెందిన 'కర్షకుని తెలగాలనిరి.' వీరు తెలంగాణములోని హిందు రాజ్యములలో సిపాయిలు, తెలుగు సిపాయిలనే తెలగాలు అనెడివారు. తెలగాలు పెక్కుమంది వ్యవసాయదారులు. వీరిని సాధారణముగా (నాయుడు లేక దొర) అందురు. తెలగాలలో మూడు తెగలవారు, అనగా (౧) తెలగాలు (౨) వంటరులు (౩) కాపులు. తెలగాలోను, వంటర్లలోను కొంతవరకు ఘోషపద్ధతి కలిగియుండుటచే ధనవంతులైన కాపులు, తెలగాలనిపించుకొందురు.౨

పై తెలింగ లేక తెలుగువారిని గురించి తెలగ ద్రావిడులు అను విషయసూచకము -(పుట. ౩౦లో చూడుడు.

పై చూపిన తెలంగాలు లేక తెలుగువారు, రామపరమారరాజు కన్న పూర్వీకులుగా కనబడుచున్నారు. రామపరమారవంశమునుండి ఏడవరాజు శాలివాహనుడు - తెనుగుదేశమును పరిపాలించినట్లు కన బడుచున్నదిగదా, మరి వీరు క్రీస్తుకుపూర్వము రెండవశతాబ్దము లేక అంతకుపూర్వమువారుగా కనబడుచున్నారు. "వీరిభాష అచ్చతెనుగు." అప్పట్లో లిపి యుండబోదు. బౌద్ధులు తెలుగు పదములను పాళీభాషలో వ్రాసి ప్రచారము చేసిరి. ఈ తెనుగు మొదట్లో ప్రాకృతముతోను, మరియు పైశాచికము కూడ కలుపుటచే వేరే విధముగా కనబడు చున్నది. తర్వాతకాలమున సంస్కృతము కలుపుటతో రూపమే మారి నది. ఇందుకు ప్రాకృతపదములు ఈ విధముగా కనబడుచున్నవి- బుద్ధ

౧. తెగలు లేక కులములు - దక్షిణ హిందుదేశము.

౨. తులువ - వారిదేశము.

దమ్మ, అవ్వ, అయ్య, గామ, ముతిద, పెద్దమనసులు అను పదములు తెనుగునుండి వచ్చినవే, మరియు క్రీ. శ. నాల్గువ శతాబ్దమున తెలుగు చోళరాజైన ఏఱుకల ముత్తరాజు ధనంజయుడు దానశాసనము కన బడుచున్నదికదా, మరియు శాలివాహనుని నాశిక్ శాసనమునకూడ కనబడుచున్నది.[౩] నాటినుండి కొంత లిపిఏర్పడినట్లు తెలియుచున్నది.

ఈ తెలుగు ముత్తరాజులే క్రీస్తుకు రెండవశతాబ్దమో లేక అంతకు ముందు మధురై పోయినట్లు చరిత్ర ఆధారములు కనబడు చున్నవి. అప్పటి పాండ్య, చోళ, జాతికి జెందిన రాజులను వోడించి మధురైని పరిపాలించినట్లు కనబడుచున్నది. ఈ తెలుగు ముత్తరాచల మూలము చూడవలెను.

— ० —

౩. ఆంధ్ర ప్రాచీన భూగోళ చరిత్ర.

పదమూడవ ప్రకరణము

# ముత్తరాచమూలము (ORIGIN)

-శ్రీ టి. రాజగోపాలరావు.

ఆదికాలమునుండి ఈ ప్రపంచములో మతములు, వర్గములు, ప్రారంభమునుండి కల్పనకథలుగాయున్నవి. చాలమట్టుకు ఈ కల్పన కథలకు చారిత్రాత్మక ఆధారములు కలవు. ఈ ప్రశ్నను తీర్మానించుటకు కల్పనకథలలోకూడిన తెలుగు వర్గములు, సామాన్యముగా నేయున్నది. ఈ కల్పనకథలు సంపూర్ణముగ వాటంతట అవియున్నవా? లేక ఈ ఆదివాసులను ఆర్యులనాగరీకతకై ఆర్యులు పటుత్వముతోను, బలముతోను, బలవంతముగాను, అధికారము చేసిరా? పురాణములే ఈ ప్రశ్నలకు సమాధానములు చెప్పగలవు.

'ముత్రాసవారు' యయాతి, దేవయాని కుమారుడైన 'తుర్వసుని' వంశమువారని, ఆతని తండ్రి ఆస్థికి అర్హులు కానటువంటివారని యున్నది. మరియొకచోట శివునివంశావళిగా వచ్చినవారనియు కనబడుచున్నది. వాయుపురాణము ప్రకారముగా - 'విష్ణుముద్రలో', తుర్వసునికి పశ్చిమభాగము యిచ్చెననియున్నది. ఆ పశ్చిమతురకలే తుర్వసుని సంతతివారని చరిత్రకారులసమ్మతము.-౨ తుర్వసుడు ముదిమిని తీసుకోలేనందున, ముదిఅని శబ్దముకూడరాలేదు. కనుక తుర్వసునివంశమా? లేక ముదిమిని మోసిన ముదిపురువురాజు భూలోకచక్రవర్తిగా నేలిన మొదటివాడా? ఈ ముదిరాజులు ఇతనివంశమువారే యనునదే సందేహము. ఈ ముత్రాసలు తుర్వసుని సంతతి చివరివాడైన రవిదేవరాజు, ఆయనకు పుట్టినవారు (౧) కరణంరాజు, (౨) గంగిరాజు, (౩) భూపతిరాజు వీరి సంతానమే ఈ ముత్రాసలు యని చరిత్రకారుల సమ్మతము. వీరి ఇష్టదేవత 'అంకమ్మ' - (అంకాలమ్మ).

ఈ ఆదిశక్తి శివునితో పూజలుచేయించుక
వంశమువాడైన దుష్యంతుడు తు
మహాభారతములో నున్నది. దుష్య
వంశమువారే పాండవులు. పాండవస
యరులు శిలాశాసనములను పరిశీలించినవారు వ్రాసియుండిరి. మరి గోంకచోడరాజులుకూడ తెంగరపాండవసంతతివారమని శాసనములలో వ్రాయించుకొనిరి. ఈ ముత్తరయనులే తెలుగు ముత్తరాచలు, ముత్తరాసలు, ముదిరాజులు, అనియు పాండవసంతతివారని కనబడుచున్నది.

పాండవులు భారతదేశమును పరిపాలించుచుండిన కాలములో, బ్రహ్మక్షత్ర అనునటువంటి వంశములో 'కలి' యొక్క కాలము ప్రారంభించుబడినది.

ఇప్పటికి 'కాళి'-'కళి' యొక్క వయస్సు (౫౦౮౧) సంవత్సరము ౧౯౭౯ లనగా ౫౦౮౦ సం॥ (౧౯౭౮). బ్రహ్మక్షత్రియులు, తప్పని సరిగా క్రీ. పూ. ౩౧౦౨ స॥ లో పరిపాలించిరి,

ఈరోజువరకు నా పట్టిక ప్రకారముగ, పాండవులవంశమునుండి ౩౨వ వాడని చెప్పవచ్చును. మరియు ఒకవేలమనము ౨౦సం॥ ఒక వంశమును తీసుకొనినచో పాండవులు తప్పనిసరిగా బ్రహ్మక్షత్రియులకంటే ౬౨౦ సం॥ కంటే ముందే, దేశములోనుండి వెళ్ళగొట్టబడినారని చెప్పవచ్చును. లేక క్రీ. పూ. ౩౭౨౦ సం॥ లో యుండిరి. ఇది మనకు ఆరంభములోయున్న 'కోయ' వారియొక్క తేది మనకు ఇచ్చుచున్నది. అతిరథుడు యయాతివంశములోని ౨౬వ వ్యక్తి. ఇతను కుంతి కుమారుడైన కర్ణుని దత్తుగా తీసుకొనెను. కాబట్టి యయాతియొక్క కుమారుడు 'తుర్వసుడు' తప్పనిసరిగా క్రీ. పూ. ౭౭౨౦ సం॥ కంటే ౫౦౦సం॥ ముందున బ్రతికినవాడు లేక క్రీ. పూ. ౪౨౨౦ సం॥ లోనివాడని తెలియును. "ఈ ప్రకారముగా (హిందు పంచాంగము) లేక జ్యోతిష్య

శాస్త్రముద్వార తప్పనిసరి ఆరంభమునాటి ముత్రాసివారియొక్క తేదీలు కూడ యుండవచ్చును. అనగా తుర్వసునినుండి ఏడవవాడు 'రవి' సంతానము, గనుక అవుతే క్రీ. పూ. ౪౦౮౦ సం॥మని కనబడుచున్నది. మరిమొట్టమొదటి ప్రారంభమున ఏలాంటికళంకములేకుండ యున్నటువంటి యయాతి తెలుగు పుస్తకము గురించి, అది ఎవరివంశమైతే, తెలుగు రాజ్యము స్థాపించినారో, ఈప్రకారముగా శ్రీరామచంద్రుడు క్రీ. పూ. ౪౦౦౦ సం॥ కాలము యున్నవాడని తెలియుచున్నది."

పై చూపిన కాలమానము, నమ్మిన, నమ్మకపోయిన యదార్థముగాలేక నిజముగాచూస్తే శబ్దరూపమే మనకు చూపుచున్నదిగదా, రాజు లేని సమయము, వారు నాయకత్వమువహించి ప్రజలను, మృగములబాధలనుండి రక్షించునటువంటివారు. వేదకాలమునుండి వచ్చినట్లు కనబడుచున్నదియే మృద్రవాచ లేక మృత్‌రాజవారు.

౨. శ్రీ సిరాజుల్‌హాసన్‌గారు తన గ్రంథమందు ఈ విధముగా వ్రాసియున్నారు.

ముత్తరాచ శబ్దము లేక పదము ఎట్లు పుట్టినదో సరిగా తెలియదు. కాని ముత్తరాచలు వారికివారే ముత్తరాజు లేక (ముదిరాజు) పురాతనరాజు (old king) వంశీయులమని చెప్పుకొందురు. మహాభారతములో ఈ ముదిరాజుల గూర్చిన ఈ క్రింది కథనుకూడ వారు చెప్పుదురు.

రాక్షసగురువగు శుక్రాచార్యుని కుమార్తే దేవయాని, సూర్యవంశజుడగు యయాతియును క్షత్రియుని వివహామాడెను. ఆమే అత్తవారింటికి పోవునపుడు శర్మిష్ఠ అను దైత్యరాకుమారిని తన చెలకత్తెగాతనతో తీసుకవెళ్ళెను. దేవయానికి ఇరువురు కుమారులు కలిగిన పిదప యయాతి రూపవతియగు శర్మిష్ఠను ప్రేమించుటచే, శర్మిష్ఠకు అతని వలన ముగ్గురు కుమారులు కలిగిరి. దేవయాని ఈ విషయమును తన

తండ్రియగు శుక్రాచార్యునితో చెప్పగా అతడుకోపించి యయాతిని శపించెను. శాప ఫలితముగా యయాతి ముసలివాడై య్యెను. పండ్లు వుడిపోయెను, తల నేరసిపోయెను, 'సంపూర్ణ ముసలిరూపము వచ్చెను. యయాతి శుక్రుని వద్దకుపోయి క్షమించమని కోరెను. కాని శుక్రుడు క్షమించుటకు యిష్టపడలేదు. అప్పుడు యయాతి శుక్రునితో నీ కుమార్తె దేవయాని యింకను వయస్సులోనున్నది. నీవు నన్ను ముసలి వానినిచేసిన, యిటుపైన దేవయాని జీవితమేమగును. వెంటనే శుక్రుడు తన శాపమును పునారాలోచించి యయాతితో, "ఈ శాపమును నీ కుమారెవ్వరైన ఈ ముదసలితనము స్వీకరించిన, నీకు శాపవిమోచనము కలుగునని చెప్పెను."

'యయాతి తన కుమారులను ఒప్పించుటకు ప్రయత్నించెను. కాని ఎవ్వరును అంగీకరింపలేదు. శర్మిష్ఠకు పుట్టిన కనిష్ట కుమారుడు మాత్రము ఆ శాపమును స్వీకరించి తన తండ్రిని కాపాడుటకు ఒప్ప కొనెను.' తనతండ్రి "ముదితనము" అతనికి వచ్చెను, 'అందుచేత అతనిని ముదిరాజు అను మారుపేరుతో పిలువమొదలిడిరి'. ఆ ముదిరాజు ముత్రాసుల లేక (ముత్తరాచల) మూలపురుషుడుగా వారు చెప్పు కొందురు.

ముత్రాసులు మహాభారత యుద్ధములలో కూడ పాల్గొని రనియు, వారికి కౌరవ పాండవులతోగూడ సంబంధములున్నవనియు కూడ చెప్పుకొందురు. మరికొందరు ముత్రాసులు, ఈ క్రిందికథను కూడ చెప్పుదురు. యయాతికి నల్గురు భార్యలు కలరు. వారు (౧) దేవయాని, (౨) శర్మిష్ఠ, (౩) నీలావతి, (౪) పద్మిని. దేవయానికి పుట్టిన సంతతివారు గొల్లలు లేక యాదవులు, శర్మిష్ఠకు పుట్టినవారు ముత్రాసులు, నీలావతికి పుట్టినవారు బెస్తవారు, పద్మినికి పుట్టినవారు నాయకులు. బహుశ పైన నాలుగు తెగలు ఒకప్పుడు ఒకే తెగకు చెందిన వారని చెప్పుటకు చెప్పినకథగా కనిపించును.

**Note:** (తెగలు-లేక కులములు నిజాండోమినియన్ చూడుడు).

## 3. శ్రీ హెచ్. ఏ. స్టూఆర్టుగారు ఈ క్రింది కథను వ్రాసినారు:

కొన్ని ప్రదేశములలో ముత్తరాచలు చిన్న పరిపాలకులుగా నుండుట ఆధారము. పైవారు క్షత్రియులనికూడ చెప్పుకొందురు. మహాభారతములోని, యయాతి సంతానమని చెప్పుకొందురు. పౌరాణిక గాధ ననుసరించి ఒకరోజు దైత్యుల గురువగు శుక్రాచార్యుని కూతురు దేవయాని మరియు, దైత్యరాజు కుమార్తె శర్మిష్ఠ యిద్దరు జతగా బావికి వెళ్లిరి. యిద్దరు మధ్య తగువు రాగా, శర్మిష్ఠ దేవయానిని ఒక నీరులేని బావిలో త్రోసివేసెను. దేవయానిని యయాతి రక్షించెను. శుక్రాచార్యులు ఈ వృత్తాంతమును దైత్యరాజుకు చెప్పెను. దైత్య రాజు తన కూతురును శిక్షగా యయాతి భార్యకు సేవకురాలుగా ([illegible])ండవలెనని ఆజ్ఞాపించెను. యయాతి భార్య అయిన దేవయానికి (ఇ)ద్దరు కుమారులు జన్మించిరి. క్రమేన యయాతి శర్మిష్ఠ మోహములో (ప)డెను. ఈ అక్రమసంబంధముతో శర్మిష్ఠకు ముగ్గురు కొడుకులు జన్మనిం(చి)రి. శుక్రాచార్యులకు ఈ వృత్తాంతము విని, యుయాతి వృద్ధాప్యము నకు గురై బలహీనుడగునట్లు శపించెను. అప్పుడు యయాతి తన కుమారులను శాపమును భరించుమని అడిగెను. అందులకు అతని నల్గురు కుమారులు నిరాకరించిరి. గాని శర్మిష్ఠ కనిష్ఠ కుమారుడు భరించుటకు అంగీకరించెను. కిరాతకులచే దాటివేయబడిన యడారి భూములనే పరి పాలించవలెనని శాపించెను. వారిలో ఒకరైన దుర్వాసుడు(తుర్వసుడు) (అ)నువానికి ఏడుగురు కుమారులుండిరి. వారిపై ఆంకమ్మదేవి చల్లని (మ)న్సు వుండెను. కొంతకాలము పిదప వారిని మహేశ్వర లేక వీరభద్రుని పూజించునట్టు వారి మనస్సు త్రిప్పిరి. దానిపై అంకమ్మదేవికి ఆగ్ర హము కలిగెను. ఆమే అన్ని పూలతోటలను మటుమాయము చేసి ఒక తన పూలతోటను మాత్రమే మిగిలియుంచెను. పూజచేయు టకు పూలు అవసరము కావున, ఏక్కడ పూలు లేనందున అంకమ్మదేవి తోటనుండి దొంగిలించిరి. వారు దొంగిలించుచు పట్టుబడిరి. ఆ తప్పుకు

శిక్షగా వారు వారి ప్రాణములను బలియివ్వవలసివచ్చెను. ఆ ఏడుగురు కుమారులలో నొకనికి, రవిదేవరాజు అనే కుమారుడు వుండెను. వాడు పుట్టిన వెంటనే బావిలో పారవేయబడెను. అ ప్రాంతములోని నాగకన్యలు ఆ పసిపాపను రక్షించిరి. ఆపాప చక్కగా జాగ్రత్తగా పోషించిరి. ఒక రోజు అంకమ్మదేవి నాగలోకమునుండి పోవుచుండగా, పసిపాపఏడ్పును వినెను. అది విని అంకమ్మదేవి తన వాహనమగు నక్కను ఆ పాపను తీసుకొని రమ్మని పంపించెను. నక్కకు పాప చేచిక్కని కారణంగా, దేవి స్వయముగా పాపను తీసుకొనివెళ్ళెను. ఆపాప ఆదేవి అధ్వర్యమున పెరిగెను, వానికి ముగ్గురు కుమారులు కలిగిరి. వారిపేర్లు (౧) కర్ణము రాజు (౨) గంగిరాజు (౩) భూపతిరాజు. వీరి వంశమునుండే ముత్తరాచలు వచ్చినట్లు పేర్కొందురు. అంకమ్మదేవి ఆ పాపను సంరక్షించిన కారణముగా ముత్తరాచలు ఆ దేవిని, వారి కులదైవముగా భావించి పూజించుచుండిరి. ౧

వీరు క్షత్రియులైన గాకపోయిన, నేడు మనకు లభించెడివి, గ్రామమందు నడువడి, అక్కడిసంస్కృతి, అనగా అధికారము,పనులు, వృత్తులు మొదలగువాటిమీద పరిశీలించెదము. దీనికి తార్కాణము పై ముగ్గురి పేర్లు గలవారియొక్క వృత్తి, అధికారము, అమరకము, నందుచూపిన పద్ధతిననే విశదీకరించెదము.

(౧) కరణమురాజు : అనగా గ్రామముయొక్క భూముల లెక్కలు, కొలతలు, వాటి పన్నులు వేయుట, వసూలుచేయుట, జమా బంది లెక్కలు చేసియుంచుట, జనాభా గణన లెక్కలు అనగా పుట్టుట-చచ్చుట (Birth and Death) యొక్క మొదలైనవి రికార్డుచేయుట వీరి పని. ఇది వృత్తిరూపమే, వంశపరంపరగా వచ్చుచున్నది. మరికొన్ని చోట్ల ప్రభుత్వమునుండి జీతములిచ్చి చేయించుట గలదు. వీరు కత్తులు,

---

౧. తంగిరాల రాజగోపాలరావు

కఠారములు, ఈటెలు చేతబూనరు. వీరిని గ్రామకరణము-పంతులు అని పిలువబడువారు. వీరు ఎక్కువ నియోగి బ్రాహ్మణులు కనబడుచు న్నారు. విజయనగరసార్వభౌమ చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలు తన పాలనమున జమాబంది (ఆర్థిక శాఖ)గా కర్ణమువారిని నియోగించెనని చరిత్రయందు కలదు. కనుక వీరే 'కర్ణమురాజులని' మొదటి గ్రామాధి పతి·యని యుండవచ్చును. వీరు రాజులవద్ద మంత్రులుగా, మహామంత్రు లుగా యుండువారుగా నియోగులని చెప్పుదురు.

(౨) గంగిరాజు : అనగా వీరు మాలి పటేల్, లేక వ్యవసాయ మునకు, నదుల, చేరువుల నీరు వదులువారు. తగాదలు లేకుండ చూచుట, పన్నులు, లేవిధాన్యమువసూలుచేయుట, పన్నుధనమంతయు తహాసీల్‌లో జమచేయుట (Tahasil Treasury) పంటల కాపుదల చేయుట, వీరి ముఖ్యపని. ఇది వృత్తిరూపమే. వంశపరంపరగా వచ్చు చున్నది. ఇతనొక గ్రామాధిపతి, నీరు విడుదలవలన "గంగిరాజు"యని పిలువబడియుండవచ్చును. వీరు కృషీవలులూ, పాడిపశువులు పెంచుట వీరి ప్రత్యేక ధర్మముగాన, వీరు క్షత్రియులనబడరు.[౨]

(౩) భూపతిరాజు : అనగా భూమినేలువాడు, ప్రజారక్షకుడు. గ్రామ పెద్ద, మునుసూబు లేక (పోలీసు పటేల్) యనియు ప్రభుత్వ శాఖలకు చెందనివారు (undepartmental) యని కలదు. వీరు వంశ పద్ధతిన నడచును. కాని యిప్పుడు ప్రభుత్వమునుండియే నిర్ణయించుట జరుగుచున్నది. వీరియందు (ఓకచౌడి) అనగా పంచాయితిలు - తీర్పు నిచ్చు న్యాయస్థానము", మరియు పశువుల దొడ్డి లేక బంజరుదొడ్డి (lockuP) అని ఒక కొట్టము గూడ వీరి యాధీనమునునుండును. ఇద్దరు "కావలి-కారు" వారుగా నుందురు, గ్రామమందు నేవిధమైన దొంగ తనము కాకుండ జూచుట, దొంగతనములు అవుతే వీరే భరించవలెను.

---

౨ ముత్తరయర్ శాసనము

గాన రాత్రులుయందు గ్రామమ కాపుచేయుట వీరి ధర్మము. గ్రామమునుండి బండ్లు, పశువులు, ఇతర పశువులు సాగిపోయినప్పుడు తనఖ్కి చేయుట, వీరి పాలన ధర్మము. గ్రామమందు జరుగు పంచాయితులు త్రేంచుట, న్యాయవిచారములు జరుపుట, వీరికొక్కరికేయున్నది. గాన వీరిని "గ్రామాధిపతి" లేక "భూపతిరాజు" అని పిలువబడిరి. వీరికి కత్తులు, కఠారములు, ఈటెలు, బాకులు, వాడుట, మృగములను వేటాడుట, ప్రజల రక్షణచేయుట, వీరి కర్తవ్యము. గాన వీరు సైనికులుగ, పోలీసుగ, గ్రామప్రజల రక్షణచేయుటవలన క్షత్రియులని నేంచియుండిరి. వీరినే "గామముత్తిద", 'ముద', 'ముందా' (Head of the village) గ్రామాధికారి యనియు శాసనములలోను, అమరకములోను, కనబడుచున్నది. గాన ఈ ముగ్గురు, మూడువిధములుగా వృత్తులతో కూడుకొనినవారు, మొదటిరాజులై నుండునోపు. వీరు ముత్తరాస, ముత్తరాచ, ముది రాజులకు మూలపురుషులని చరిత్రకారుల సమ్మతము.[౩]

ముత్తరాస-(వలయాన్ : ఇక్కడ ముత్తరాస పదమునకు నొక చిన్న కథ గలదు) కైలాసనాధుడైన శివుడు, గంగవొడ్డున తపస్సు చేయుచుండగా శివుని చేతి వ్రేలు వుంగరము గంగలో పడినదట. శివుడు ఆ ఉంగరమును తీయుటకై ముత్తరాజులను పిలిపించి, గంగలోపడిన వుంగరమును తీయుమని కోరెనట. నంతవారు ఉంగరము తీయుటకు 'ఒకవల' కావలెనని కోరగా, శివుడు తన మహిమచేత వల యిచ్చెనట. ఆవలతో నీ ముత్తరాసలు గంగలోపడిన ఉంగరముగురించి వల వేసిరట. ఆ వలలో ఉంగరము మరియు ముత్యములు కూడ దొరికెనట. నంత శివుడు వీరి సహాసమునకు మెచ్చి ముత్యములు తీసిన వారు కనుక, ముత్యాల రాసులవలెను విరాజిల్లునని ఆశీర్వాదమిచ్చెనట. నప్పటి నుండి వీరిని ముత్యరాసీలు, లేక ముత్తరాసిలని పేరు

---

౩. టి. రాజగోపాలరావు

బడెనట, నేటికి జ్ఞాపకార్థముగానున్న వెయ్యి స్థంభములుగల మంట పము శ్రీరంగముననున్నది: దీనిని 'ముత్తరాసన్ కోరుడు' యని పిలుచుదురు. మరియు పలనిలోగూడ పెద్దమంటపమొకటి గలదు. ఈ రెండింటిని ముత్తరాజులే కట్టించినట్లు చెప్పుదురు. ౪ (పుట. ౨౫, ౨౮)

౪. జాంబవంతుని కులాలపట్టిక, ఎల్లమ్మ కథ :

పై ముత్తరాజుల గురించి సింధోళ్ళనే జాతి' (చిందులజాతి) అనగా మాదిగవారిలోని ఒక తెగ, సింధోళ్లు. వీరు ఉదయము భాగవ తము ఆడువారు. వారము చివరిరోజున 'యెల్లమ్మ' దేవి వేషము మరియు జాంబవంతుని వేషము ధరించుతారు. జాంబవంతుడు అన్ని కుల పట్టికను చదువుతాడు. మొదట బ్రాహ్మణుల కులము నుండి శూద్రకులముల వరకు ఎన్నికులములున్నవో తన కులము నుండి పుట్టినవని తెలుపుతాడు. (కాని ఒక ముత్తరాచ లేక ముత్తరాస) కులమును లెక్కించడు. వారు మొదటివారు, (అన్ని కులములకన్న ముఖ్యమంతపెద్ద) యనియో లేక క్షత్రియులనియో లేక ప్రభువు లనియో తెలియదు, మిగిత కులములవారిని 'నా వారు' అని చెప్పుట సత్యము.౫ వీరికి (ముక్తజన కల్పన) అను గ్రంథము ఆధారమని తెలియుచున్నది. ఈ పుస్తకమును చూడవలెను. ఇదియేగాక మాదిగల యింటిలో వివాహము జరుపు సమయమున ముత్తరాచలకు (ఆకు, వోకలు) అనగా విడము లాంచనముగా యిచ్చువారు, యని.

మాదిగకుల చరిత్ర - తెగలు లేక కులములు అనే గ్రంథమందు. గలు లేక కులములు దక్షిణ భారతదేశము. (పుట ౧౨౭ - ౧౩౧) చూడుడు. మరియు ముత్తరాచకుల కథయందుకూడ పై విషయమునే చూపినారు. దీనితో ముత్తరాజులు క్షత్రియులనుటకు ఒక నిదర్శన ముగా కనబడుచున్నది.

---

౪. కులములు లేక తెగలు నిజాండోమినియన్ (పుట. ౫౨౫-౫౩౧)
౫. కులములు లేక తెగలు దక్షిణ హిందుదేశ చరిత్ర M to P. (పుట. ౨౫-౨౮)

పై వారేగాక, కాశీపాపలవారు, పాండవకథలవారు, ముత్త రాసలను గురించి గ్రామములయందు పఠములు చూపి కథలు విన్న వింతురని తెలియుచున్నది. పాండవ కథలవారు. వారు ముత్రాసుల మని కూడ చెప్పుకొందురు. వీరు పాండవ కథలతో పాటు యానాదులకు జెందినకొన్ని జాతులవారునట్లు కులములు లేక తెగలు నిజాం డోమినియన్ అను గ్రంథమందు శ్రీ సి. రాజుల్ హాసన్‌గారు చూపినారు (చూడుడు).

ఈ ముత్తరాజులు క్రీస్తుకు పూర్వము మొదటి లేక రెండవ శతాబ్దముననో మధుర పాండ్యరాజులను పడ ద్రోసి పరిపాలించినవారు. (ముత్తినయనార్) కళభ్రరాజులయొక్క మూలపురుషుడు. వీరి సంతతి వారే ముత్తరయన్ లేక ముత్తరాజులు అనగా ముదిరాజులు చంద్ర వంశము పాండవ సంతతికి జెందినవారని సెందలై శాసనమును దిద్దిన ప్రొఫెసర్ S. T. E. Know మరియు P. W. Thomas మరి K. V. సుబ్రమణ్యంగార్లు చూపిరి. వీరు తెనుగుదేశము నుండి అనగ శ్రీకాళహస్తినుండి పోయినట్లు చరిత్రకారుల భావము. ఇక్కడ కీర్తి శేషులగు కే. క్రిష్ణస్వామి ముదిరాజు పితామహులైన. వారి చరిత్రలో ఈ ముత్తరాచలను చోళ ముత్తరాజులు మరియు పాండ్యులను వొక టిగా చూపినారు. దానిని ఆంధ్రప్రదేశ పట్టభద్రుల సంఘమువారు చరిత్ర పుస్తకములో చూపిరి. కాని అది సత్యముకాదు. చోళులు మరి పాండ్యులు తెలుగు ముత్తరాజులు (ముత్తరయర్లు)కు ఎప్పుడు విరోధులే, చోళ విజాయాలుడే శ్రీ విడల్ విడుగు ముత్తరయన్ V ను ని వోడించి తంజావూరుని దక్కించుకొనిరి. చోళులు ఉరయూరు నుండి వచ్చినవారు, ముత్తరయర్లు తెలుగుదేశమునుండి పోయినవారని చరిత్ర కారుల భావము. కాన చోళులు మరియు పాండ్యులు మరియు ముత్త రయర్లు వేరని తెలియనగును.

యయాతిరాజు సూర్యవంశము, ఆర్యరాజనియు, అతని కనిష్ట కుమారుడైన పురువు, ముదిమిని తీసుకొన్నందున ముదిపురువురాజు ఆతని సంతతి వారే ఈ ముదిరాజులు, మొదటిరాజులనియు, కొందరి చరిత్రకారుల (ఊహ)గా కనబడుచున్నది.

పై వారి వంశమునకు చెందిన, చెందకున్న వారి వృత్తులవలన మరియు శబ్దరూపముతో నమ్మదగినదిగా కనుపించుచున్నది. వీరు నెక్కువగా తెలంగాణము నిజాం రాజ్యమందు (౧౬) పదహారుజిల్లాల లోనే గాక మరి ఆంధ్రజిల్లాల యందు మరియు తమిళదేశమందు కూడ ఈ నామముతో పిలువబడువారు లక్షల సంఖ్యలో కనబడుచున్నారు. లంగాణము నుండియే వీరు వలసపోయినట్లుగా ఉహ. మరి వీరిని ధ నామములతో పిలువబడుచున్నారు. ౧౨వ ప్రకరణమునచూడుడు.

కనుక పై విధమును బట్టి చూచినచో తెనుగు - కులము - ముత్త త్తితో పదవినలంకరించికూడుకొనియున్న తెనుగుదేశమువారు తెనుగు ుత్తరయర్, తెనుగు ముత్తారాచ, ముత్తరాజు అనగా తెనుగు ుదిరాజులని ఘనముగా చెప్పవచ్చును. వీరిని శ్రీ టి. వి. సదాశివ ండరాత్తార్ చూపిన ఆధారముతో పూర్వపు రాజవంశ క్షత్రియులని చెప్పుట నిక్కువము. వీరిని ముత్యాల రాసులవారని గూడ పిలుతురు. ీరిని గురించి రెండు సామెతలు గలవు.

(౧) ముగ్గులేని ఇల్లు - ముత్తరాసలేని వూరు కనపడదని ంగాణజిల్లాలలో సామెత కలదు.

(౨) ముందర ముత్తరాచలు - వెనుక యానాదులు వున్న రాజుకు ఘనమైన జయము గలుగునని ఆంధ్రజిల్లాలలో రెండవ సామెత కలదు. (స్వంత)

-:o:-

# పదునాలుగవ ప్రకరణము

## సాంఘిక ఆచారములు

౧. ఆచారము - యజ్ఞోపవీతము. ఈ యజ్ఞోపవీతమును గురించి ఒక చిన్నకథ గలదు.

(అ) ముత్తరాచలు గొప్పకులస్తులైనను, వారిలో కొంత సంఖ్య చేపలు పట్టుటవలన వారు శూద్రులైరని కొందరు చెప్పుదురు. దీనికి వారిట్లు చెప్పుదురు. 'ఒక గాధ ననుసరించి, ముత్రాచలు క్షత్రియులైనందున, వారు జంధ్యములను అనగా (యజ్ఞోపవీతము) లను ధరించేవారు.' వారిలో కొందరు వారి వేటనుండి తిరిగివచ్చునప్పుడు దారిలో పెద్ద, పెద్ద కొలనులలో లెక్కకుమించిన చేపలును చూచి వ్యామోహము జెంది చివరికి వారి జంధ్యము దారములనే గాలములుగా ఉపయోగించి, చేపలను పట్టుచుండేవారని చెప్పబడును. వారు ఆ విధము జంధ్యముల నుపయోగించి చేపలు పట్టుటను కొందరు బ్రాహ్మణులు చూచుట కారణంగ వారి కులము దిగజారిపోవుట నారంభించెను. మరి వారిని శూద్రులుగా లెక్కగట్టుటవలన వారు శూద్రులైరి.

(ఆ) పై ముత్తరాచలేగాక, అంబలకరన్లు, వివహోము సమయమందును, అంత్యక్రియ సమయములందును, జంధ్యమును ధరించే వారుగా చూపబడినది.

౨. (అ) వివహోము.-౧౮౯౧ మద్రాసు జనాభా గణన నివేదికలో శ్రీ ఎడ్గర్థస్టర్ గారు చూపినది. ఉత్తర ఆర్కాటు జిల్లాలోని చంద్రగిరికి, సంబంధించిన, నివేదికలో ఈ విధముగా పేర్కొనబడినది. ఈ కులమువారు అరుదుగా పెళ్లి చేసుకొనెవారు. వారు పెళ్లి లేకుండ

గనే వారి కులము స్త్రీలతో సంబంధము నేర్పరచుకొని దానినే స్థిర సంబంధముగా భావించి, అట్టి సంబంధముచే కలిగిన సంతానమును న్యాయమైన, క్రమమైన సంతానముగా భావించి వారిని వారస లేక (ఔరస) పుత్రులుగా భావించేవారు.[౧]

(ఆ) ౧౯౨౧లో శ్రీ సిరాజుల్ హసన్‌గారు చూపిన వివాహములు, నిజాం రాష్ట్రము కులములు లేక తెగలు అను గ్రంథములో చూపినది.

వివాహములు తెలగాలలోవలెనే పురాతన పద్ధతిలో జరుగును. పెండ్లి కుమారునకు గాని, పెండ్లి కుమార్తెగాని ధనరూపమున ఇచ్చుటకు గాని, పుచ్చుకొనుటగాని లేదు. కాని వధువు తల్లికి ఇరువది ఐదు రూప్యములు చెల్లించు అలవాటు కలదు. వివాహమునకు 'కన్యాదానము' తప్పక వధువు యింటిలో జరుగవలెను. వివాహాది శుభకార్యములలో బ్రాహ్మణులను పిలిపించి వారిచే జరిపించెడివారు. కన్యాదానము జరుపు సమయమున, గోత్రములు చెపుతు 'దాసోనామ్' అని చెప్పుచున్నారు. ఇక్కడ వీరు శూద్రులని, దాసిపనిచేయువారని వారి ఊహ. 'కాన యజ్ఞోప వితధారులుగాన, ఇతర క్షత్రియుల గొప్ప కులస్థులవలె జరుపించవలెను.'

౩. కర్మజరుపుట : కర్మకాండ జరుపుటకు జంగములను, లేక సాతానులను నియోగించెడివారు. చచ్చినవారిని సాధారణముగా దక్షిణ ముఖముగా తలను పెట్టి పరుండబెట్టి కాల్చెడివారు. వారి చితాభస్మమును ఒక మట్టికుండలో పెట్టి చెట్టుక్రింద పాతిపెట్టెడివారు లేక నదులలో కలిపెడివారు. శిశువులను, అవివాహితులను, అంటు వ్యాధులతో చచ్చినవారిని పాతిపెట్టెడివారు. చచ్చిపోయిన పదవరోజున పెద్ద కర్మ జరుపుదురు. మరి పితృ అమావాస్య దినమున శ్రాద్ధకర్మను జూపెడివారు.

---

౧. దక్షిణ హిందూదేశము-కులములు లేక తెగలు. (పుట. ౧౨౭-౧౩౧)

(౪) సాంఘిక స్థితి: ముత్తరాచలు, కాపులు, గొల్లలు, వెలమలు, మున్నూరు, జాతులవలెనే, సాంఘిక స్థితిని కలిగియుండిరి.

(౫) వృత్తి: పూర్వము వీరు సైన్యములో సిపాయిలుగా పనిచేయుట చేత, వారు 'బంటు' అను బిరుదము కలిగెను. వీరికి ఒక నిర్ణీతవృత్తి లేకపోవుటవలనను, తెలుగుజిల్లాలన్నిటిలోను విస్తరణ జెందుటవలన, వారు తెలుగుదేశములోని ఆదిమనివాసులుగ పరిగణించ వచ్చును. వీరిని తెలుగు జిల్లాలన్నింటిలో తెలింగాలు అని పిలుచుటచే కూడ వీరు తెలంగాణములోని, ఆదిమవాసులని చెప్పుటలో అసత్య మేమియులేదని వ్యక్త మగుచున్నది. ముత్రాసితెగ, ఆదితెగ, ఇతర తెగలన్ని దీనినుండిపుట్టినవే. పూర్వకాలమున ఈ తెగవారినుండియే సైన్యమునకు కావలసిన సిపాయిలను తీసుకొనెడివారు. అందుచే వారు సగర్వముగా బంటులమని చెప్పుకొందురు.౨

(౬) శ్రీ హెచ్. ఏ. స్టూఆర్టు గారు ఈ విధముగా వ్రాయుచున్నారు. ఇది తెలుగువారిలో ఒకజాతి, ఈ జాతికి కృష్ణా, నెల్లూరు, కడప మరియు ఉత్తర ఆర్కాటు, జిల్లాలో అధికముగా ఉన్నారు. ఈ ముత్రాచులను, వారిని విజయనగర రాజులందురు. వారి రాజ్య సరిహద్దు రక్షణకొరకు వినియోగించిరి. వీరిని 'పాళెగార్లను' గౌరవ బిరుదములను విజయనగర రాజులిచ్చిరి. ద్రవిడ భాష మూలమునుబట్టి "ముది, అనగా పురాతన = రాచ-రాజు" అనగా పురాతన రాజవంశ మని తెలియుచున్నది. మరికొందరు 'ముతురాజు' అను ఒక తెలుగు దేశమును పాలించిన సర్వస్వతంత్ర ప్రభువుల వంశమునకు చెందినవారు అని అందురు. వారు ఉత్తర ఆర్కాటుజిల్లాలోని చంద్రగిరి తాలూకాలో అధిక సంఖ్యలో కలరు. జిల్లాలోను మిగిలిన భాగములలోగూడ వీరు గ్రామ తలయారీలుగ కనబడుచున్నారు వారిని వారే సగర్వముగా

---

౨. నిజాండోమినియన్-కులములు లేక తెగలు. (పుట ౫౨౫-౫౩౧)

పాళెగార్లమని చెప్పుకొందురు. చంద్రగిరిలో మాత్రము (దొరలు) అనిపించుకొను చున్నారు. వీరు విజయనగర ప్రభువుల కాలములో తెలుగుదేశములో వీరిని 'కావలిగార్'గా నియమించిరి౩. అనగా సరిహద్దు కాపాలదారి అని యుండెను. యిప్పుడు గ్రామ కావలిగమారి ఇక్కడ తలయారీలు, అనగా తలవరలు యని నెంచవలెను. మరియు కావలిగార్ అనగా సరిహద్దులను కాపాడువారు, సామంతరాజులు, నేటికిగలరు. వీరినే రాజఖందువులుగా లెక్కించిరి. నాటి తలవరులు, తలారిగా, మరియు కావలిగార్, గ్రామ కావలిగా చేయుచుండిరి. చదువురులే తెలుసుకోగలరు.

— ౦ —

౩. కులములు లేక తెగలు దక్షిణ హిందు దేశము పుట. ౧౨౭-౧౩౦

## పదిహేనవ ప్రకరణము

# చాళుక్యులు, కాకతీయులు, గోంకచోడలు, రామపరమారశాఖవారు మరియు పల్లవులు.

౧. చాళుక్యులు: చాలుక్యులు కన్నడులు. వారి శాసనములు ఎక్కువగా కన్నడ శాసనములతో కనబడుచున్నవి. చాళుక్యులు కన్నడులే. వీరిది కళ్యాణదుర్గము. ఈ దుర్గము పంపానది ఇవతల వొడ్డున యున్నట్లును అనగా పూర్వపు హైదరాబాద్ రాజ్యమందు యున్నట్లు కనబడుచున్నది. ఈకళ్యాణ దుర్గమును తెలుగు జొమ్మయ్య లేక బొమ్మయ్య పరిపాలించినట్లు బసవపురాణమునందు జూపబడినది. తూర్పుచాళుక్యుల వంశమువాడైన రాజరాజ నరేంద్రుడు, తాను తెలుగువాడనని తుర్వసు సంతతి - చంద్రవంశమని తమ శాసనములో పేర్కొనెను. వీరు కన్నడులే అయినట్లు ఐతే, కళభ్రులకు దగ్గర సంబంధము లుండవలెను. కళభ్రులమాదిరిగా తెలుగువారై యుండవలెను. కనుక తెలుగు దేశమున పరిపాలించినందువల్ల, తెలుగుభాషకు ఎంతో ప్రోత్సహించిరి, మరి "ఆకోలనుపాక ముఖ్యపట్టణముగా తెనుగు-నాడు అని చెప్పుకొనిరి. కనుక చాళుక్యులు తెనుగువారే యని తెలియుచున్నది. పరిశీలకులు పరిశీలించి నిర్ణయించవలెను.

౨. కాకతీయులు: కాకతీయులనుగురించి వాదోపవాదములు చెలరేగిన, ఇప్పటికిని చరిత్రకారులు నిర్ణయించలేకున్నారు. వీరు కర్ణాటకులని కొందరు, ఆంధ్రులని మరికొందరు చిత్రించిరి. వీరు చాళుక్యుల సైన్యములలో పెద్ద పదవులను సంపాదించియుండిరి. చాళుక్యుల క్షీణ దశలో వీరు సర్వస్వతంత్రులుగా విజృంభించిరి. వీరు ఎక్కడవారో తెలియరాలేదు. వీరు మొదట కన్నడశాసనములు వేయించుకొనిరి. తర్వాత తెలుగులో వ్రాయించిరి. వీరికాలముననే తెలుగు భాషకు ఎక్కువ

ప్రాధాన్యము దొరికినదని చెప్పకతప్పదు. కాకతి రెండవ ప్రోలరాజు, శైవమతమును ప్రోత్సాహపరుచుచు (ఓ న మ సి వ య) అను ఆరు అక్షరములు తెలుగు అక్షరమాలయందు చేర్పించిరి. అందుకు య్యాభై ఆరుఅక్షరములుగా తయారయ్యేను. కనుక కాకతీయులుకూడ తెలుగు వారుగా భావించబడిరి.

౩. గోంకచోడలు : గోంకచోడరాజులు తొమ్మిదవశతాబ్దమున తెనుగుదేశమున బాగ ప్రబలిరి. కానీ వారు అదేదో తెలుగువారము కాదనునట్లును, కాకతీయలు - ఆంధ్రరాజు లను గెలిచినట్లు తమ శాసనములలో చెప్పుకొనిరి. కాని వారి వంశము - వారి కులమును జూచినచో, వారు తెనుగు గోంకచోడరాజులు, పాండవవంశమువార మని గట్టిగా చెప్పినవారు. వీరునకు ముదసరీ, ముత్తయని బిరుదములు కూడ కలవు. కనుక వీరును కళభ్రలును, ముత్తరయర్లును, చాలుక్యులును, కాకతీయులును అందరు ఒకే విధముగా, తాము మొదట కర్ణాటకులుగా, తర్వాత తెనుగువారుగా, తుర్వసు సంతతి-చంద్రవంశముగా చెప్పుకొనుటచే, వీరందరును తుళువదేశమునుండి వచ్చినవారన్నదే అనుమానాస్పదము. అయినప్పటికి. తెనుగు రాజ్యములు పరిపాలన చేయుటలోను, మరి తెనుగువారమని చెప్పుకొనుటవలన వీరు తెనుగు వారనే చెప్పవచ్చును. వీరి బిరుదములతో వేరువేరుగా కనబడుచున్నారు. వీరి వివరములు ముందుచూపియున్నాము. తెనుగు, తేలుగు, తెలుంగు, తేలగయన్న పదజాలము ఎట్లు వచ్చినది మొదట చూపినాము. తెనుగు వారుండుచోటు నేటి తెలంగాణమనియు, మరిదీని వైశాల్యము, పూర్వము హద్దులనుబట్టి చూస్తే, వింధ్యపర్వతముల దక్షిణ ప్రాంతము నుండి కంచీపురమువరకు, పశ్చిమమున మహారాష్ట్రము అనగా నాసిక్ పర్వతములనుండి, తూర్పు ఒడ్డెదేశము అనగా నేటి ఒరిస్సావరకు నుండి నట్లు బౌద్ధయుగమునకు పూర్వము కనబడుచున్నది. ఇదియేగాక మార్కండేయ పురాణమునుబట్టి చూచినవీరు అతిప్రాచీనులుగా, (త్రిలి)

నది ఒడ్డున నుండినందువల్ల
నందువల్ల వీరిని తెనుగు లేక
యుండిరి. తెలుగు దేశమున
లని నామము గలిగెను. అ
అతని పేరుమీద నొక మందిర
ఇతను బుద్ధుని కన్న తర
చాతుర్వర్ణ క్షత్రియులలోని

౪. పరమారశాఖ వా

అను రాజు వింధ్యపర్వతము
వారి సైన్యమును కూడకట్టి
పారదోలినట్లు మనకు కన
మధ్యప్రాశ్చ్యస్థానము అ
పర్వతములను దాటి, తిలి
లుగా అనగా బ్రాహ్మణ
చలంగారు తమ అగ్నివంశ
రామపరమారులకన్న పూ
మరియు ఈ తెలుగువారివల్ల
(రామప్రమార చరిత్ర చూడుడు.)

౫. పల్లవులు: పల్లవులు క్రీ. శ. (౪) నాల్గువ శతాబ్దమునకు వచ్చి యుండిరని తెలియుచున్నది. సముద్రగుప్తుడు దక్షిణాదికివచ్చిన సమయమున పల్లవులు కంచీలో వుండినట్లు చరిత్రలు చూపుచున్నవి. వీరు మొదట ప్రాకృతము మాట్లాడువారు. తర్వాత ప్రాకృతమున మరియు సంస్కృతమున వారివారి శాసనములు వేయించినట్లు కనబడు చున్నవి. వీరు ఎక్కువగా శివాలయములుకట్టించిరి. మరి గజశిల్పములను దేవాలయ నిర్మాణములో చూపిరి. వీరుండేచోటు తొండైమండల

మని చెప్పుకొనిరి. కాని వీరు ఎక్కడివారో తెలియదు. వీరు పల్నాటి వారని కొందరి చరిత్రకారుల అభిప్రాయము. వీరు ధరించిన బిరుదము లనుబట్టి వారు అట్లు లెక్కించిరేమో కాని, వీరు తమిళమును ఆదరింప లేదు. వీరు తెలుగు ముత్తరయర్లుతోను సంబంధములు కలిపిన, కలువక పోయిన, వారి సహాయముతో చోళులను మరియు పాండ్యులను అణ చిన విషయము, శాసనముల ద్వార కనబడుచున్నది.

-:o:-

పదప

అ

అంబలకరన్లు దక్షిణ

రాచలటువంటివారని తెలియ

బడలేదు. శ్రీ ఎడ్గర్ థర్స్టన్

అంబకరన్లు 1891 మ

ననుసరించి శ్రీ హెచ్. ఏ.

జిల్లాలోని గ్రామలలోని ము

పిలువబడుచుండువారని వ్రా

కులములోని ఖచ్చితమైన స

వ్రాసినారు. కాని అతను

ముత్తరాస లేక (ముత్తరా

చెందినవారు కాకపోయిన

ఆధారములున్నవని వ్రాస

వారుగా వర్గీకరించినట్లు,

చున్నదని వ్రాసియున్నారు. అం

ఒకే ఉపవర్గములో చేర్చుకొనబడిరి. [illegible] వ్యక్తులు [illegible]

ముగా నమోదు చేయించిరి. ఈ ఉపవర్గములోని వారిలో ముత్తరాస

వారు, ఆధికబలస్తులని పేర్కొన్నారు. వీరికి సమాన్య నామకరణము

'సైర్వైకరన్' అని యుండెను. కాని వీరిని ముత్తిరాయన్, అంబలకరన్

మలవాయిరామన్, ముత్తరాసన్, మరియు వన్నియాన్, అనే నామ

ములచేకూడ పిలువబడుచుండిరి. ముత్తరాయన్, నాయక్కన్ అనునవి

రెండు ఒకేపేరుగా భావించబడుచున్నది. 1901 మద్రాసు జనాభా -

గణన సమాచారములో అంబలకరన్ అను కులమువారిని ఈ క్రింది

విధముగా నిర్వచించిరి. వీరిని రైతు మరియు గ్రామకాపులదారుగా, తమిళకులముగా పేర్కొనిరి.౧ మొన్నటివరకు అంబలకరన్ అనే పేరు కల్లర్లల పేరుగా భావించబడినది. కాని పరిశోధనవలన ఇది తిరుచానపల్లి జిల్లాలో నివసించేవారి కులము పేరుగా తేలినది. ముసిరి తాలూకాలోని ఒక గ్రామములోని అంబలకరన్ మరి ముత్తరయర్ కులములవారు, వారిని కల్లర్లు పేర్కొనుటను అభ్యంతరపరస్తు విన్నపమును అందజేసిరి. మధురలో నివసించేకల్లాన్లును, అంబలకరన్ వారి గృహములలో తినే వారు, అయినను అంబలకరన్, ముత్తరయన్, ముత్తరాసులు, ఉరలీలు, వేడన్‌లు. వలాయియన్‌లు, మరియు వెట్టువాన్‌లలో యేదొక, ఒక విధమైన సంబంధముకలిగియున్నట్టు తెలియుచున్నది. బహుశ వీరందరు ఒకే వంశమునుండి వచ్చినవారై యుందురు. (౬౩) అరవై ముగ్గురు శైవభక్తులలో నొకరైన, 'కన్నప్పనయనార్' కులమునకు వేడన్ లేక వేటకాడులయివుండెను. అంబలకరన్ అను వారు అతని వంశమునుండి వచ్చినవారుగా చెప్పుకొందురు. తంజావూరులో నివసించే వలాయన్లుకూడ అదే లేక అటువంటి వంశస్థులనుండి వచ్చినవారుగానే చెప్పుకొందురు. ఆ జిల్లాలో అంబలకరన్ మరియు ముత్తరయన్ మరియు వలాయాన్‌లలో ఏ భేదము కానారాదు. కొందరు వలాయన్లుకు, అంబలకరన్ అనే నామముకూడ కలదు. జిల్లాల ిని గణాంకములను పరిశీలించినచో ఒక విషయము తెలియవచ్చు న్నది. ఏయే జిల్లాలలో వలాయాన్లు అధిక సంఖ్యలోకలరో, ఆ జిల్లాలో అంబలకరన్‌లు తక్కువ సంఖ్యలో నుండిరి. దానికి చిహ్నముగా ఏ జిల్లాలో అంబలకరన్లు ఎక్కువ సంఖ్యలోనుండిరో, ఆ జిల్లాలో వలాయన్లు తక్కువసంఖ్యలో నుండిరి. దీనినిబట్టి వలాయాన్లులోని కొద్ది భాగము స్వతహాగానే అంబలకరన్ అనే నామమును స్వీకరించినట్లు గోచరించుచున్నది.

అంబలకరన్‌లలోని ఉన్నతస్థాయివారు 'పిళ్ళైలు - పిల్లాయి' గా చలామనిలయిరి. 'పిల్లాయి అనే నామము వెళ్లాలుకు మాత్రమే వుండెడిది.' యితరులను తంజావూరులో 'ముప్పన్'లని మరియు తిరుచునాపల్లిలో అంబలక్కారన్, ముత్తరయన్, సైర్వైయాగరన్, అని పిలుచుచుండిరి. కొన్ని కుటుంబములలో ఆ పదవి వంశపారపర్యంగా సంక్రమించునటువంటిదిగా నుండెను. ప్రతి పంచాయతి పెద్దకు ఒక బంట్రోత్తు వుండేవాడు. వానిని కుడిపిల్లాయి అందురు. ఆతని కర్తవ్యము అవసరమన్నప్పుడు పంచాయితిని పిలుచుట, వార్తలను అందచేయుట, ఆ గ్రామములో ఆ కులములోని ప్రతికుటుంబమునుండి నాల్గు అణాలు చొప్పున అతను పొందుచుండెను. వారిలోని నల్గురు ముత్తరయన్ లేక (ముత్తరాస) కావాలిగర్, వన్నియాన్ మరియు వలాయాన్, వీరిలోని యే వర్గపు సభ్యుడు కూడ యితర వర్గముల వారితో పెళ్ళి సంబంధాలు ఏర్పరచుకోరాదని, పంచాయతిలలో నిషేదించబడియుండెను. ధిక్కరించినవారికి కులబహిష్కరణము, శిక్షగా నియమించిరి. వారి ఆచార వ్యవహారములు కొన్ని పెద్దకులముల వారికి మరికొన్ని తక్కువ కులములవారికి సంబంధించిన మిశ్రమముగా నుండెను.

వారిలో కొందరు పురోహితులుగా, బ్రాహ్మణులను నియమించుకొనెవారు. వారు అంత్యక్రియల సమయములో శ్రాద్ధ దినకర్మల సమయంలో జంధ్యమును ధరించేవారు. వారు ముత్తరయన్, కావాలికార్ల అర్ధము కాపల కాచేవారు. వన్నియాన్ ఒకే వేరు కులము వారిలోని కొందరు అంబలకరన్ అనే నామమును స్వీకరించిరి, అంబలకరన్ వాస్తవముగా వన్నియాన్లు, కాని అందులోని ధనికవర్గము "అంబలక్కారన్"ను అనేపేరుతో వారి ముఖ్యస్థానాలను నుండి విడిపోయిరి.

మిస్టర్ F. R. హేమ్మింగ్వేగారు ఈ క్రిందివిధముగా వ్రాసిరి.

మొత్తము పరగణాలలో తిరుచునాపల్లి జిల్లా మరియు పుదు కొట్టాయిలో అంబలకరన్లు మరియు ముత్తరయన్లు ఎక్కువ సంఖ్యలో నుండిరి. వారు ఒకటిగానే పరిగణించ బడుదురు. (సాధారణముగా తిరుచానాపల్లి తాలూకాలో ముత్తరయన్లుగాను, యితర ప్రాంతము లలో అంబలకరన్లుగా పిలువబడుతుండే వారు, రెండింటిలో ఏ పేరుతో పిలిచినా అభ్యంతరము తెలిపేవారు కారు). వారు వలాయాన్లుగా పిలువబడుటను ఒప్పుకొననివారు. ఆ పేరుతో నున్న కులమునకు, వారి కులమునకు ఏలాంటి సంబంధము లేదని ఒక కథను ఆధారముగా తీసు కొని తెలియచేయుదురు.

గంగానదిలో శివుని ఉంగరమును ఒక చేప మ్రింగినప్పుడు, వారి పూర్వీకులలో నొకడు ప్రపంచములోని మొదటివలను తయారుచేసెను. వారి పూర్వ వైభవ చిహ్నముగా - 'శ్రీరంగములోని వేయ్యిస్తంభ ముల మంటపమును ముత్తరాసన్ కోరాడు అని అందురనియు, పళిని లోని పెద్దమంటపమును వారి వంశపురాజులే నిర్మించియున్నట్లు పేర్కొం దురు. పళినిలోని పెద్ద మంటపము వారి కులములోని ప్రతికుటుంబము, ప్రతి సంవత్సరము నాల్గు అణాలు చందా వేసుకొందురు.) వారు (నట్టు) ఒకముత్యము లేక పరమశివుని చేమటబిందువు, ఆణిముత్యము, తియ్యటి తనము నుండి జన్మించిన సంతతిగా చెప్పుకొందురు. ఈ కులము వారు కొన్నినాడులుగా విభజింపబడెను. ఈనాడులసంఖ్య మరియు పేర్లు వేరువేరుచోట్ల వేరువేరు విధముగా నివ్వబడినది. అందులోని కొన్ని పేర్లు పట్టారై, కాపు, ఆరవతూర్, తిరుంపాలెయమ్, విమనాయకక్కన్, పాలెయియమ్, ఇవి తిరుచునాపల్లి తాలూకాలో కలవు. ముసిరితాలూకా లోని పేర్లు ఆమూర్, సవిందిపట్టి, మరియు కరుంగలి. యిందులో కొన్ని నాడులలో మాత్రమే విధవలకు పునర్వివహాము అనుమతించబడేది. వారు ముత్తరయన్, అంబలకరన్, సైర్వైయికరన్, మరియు కావా

ల్కారన్, అను నామములను ఉపయోగించుకొందురు. వారు వెళ్ళాలు, కళ్లాన్లు, నత్తమానులు, మరియు రెడ్డిలకంటే సాంఘికము తక్కువ వారుగా, లేక వెనకబడినవారుగా నున్నవారని అంగీకరించిరి. పైన పేర్కొనబడిన కులములవారివద్దనుండి భోజనమును అంగీకరించుదురు. వారు పళ్లీ, ఉరలీలు, వాలయాన్లు, వలాన్లుకంటే ఎక్కువ వారుగా భావించుకుందురు. వారి సాధారణ వృత్తి వ్యవసాయము. కాని వారు చిన్న వ్యాపారము, ఉప్పరపని, కావలిపనికూడచేసి జీవనాధారముగా గడుపుచుందురు. 'వారు వివాహసమయములందును, అంత్యక్రియల సమయములందును, జంధ్యమును ధరించేవారు.' వారు ప్రతిగ్రామమున కును, నాడునకును ఒక పంచాయతి ఏర్పరచుకున్నారు. వారి కొందరు, "పట్నత్తు-చెట్టీలు" అనగా ఆ కులమునకు సైనికులు నుండెడివారు. వీరు పంచాయతి పెద్దజతకు కూర్చుని, వ్యభిచారమ సంబంధమైన వ్యాజ్యెములను తీర్పు చెప్పునప్పుడు పాల్గొనుచుండిరి.

## సంపుట I.A.B.

ఆంబిగా : 'కబ్బెర' కు పర్యాయపదము.

ఆరిగిలా : ఊరేగింపులో తీసుకొని పోబడు పళ్ళెము (ఆహారముతో కూడిన) ఆరిగిలా మరియు ఆరికా - జొన్నలతో తయారు చేయుచు పదార్థము. (పంటరెడ్డి)

ఆరిసి : సవర - యొక్క అంతర్విభజన

ఆరియార్ : పట్టణావాసులుకు ఇచ్చిన కులనామము (ఆరియనట్టు చెట్టి) లేక ఆరియార్.

ఆరియూర్ : నట్టుకొట్టి చెట్టి యొక్క పేరు, ఆరివియూర్ లేక ఆరియూర్.

ఆరుపట్టనాల్ : తాలై కట్ట - 64 ...

ఆరుపట్టండు : తాలై కట్ట - 64 ...

ఆర్య ;　ఆర్య అనగా ఆరియా (మంచి) పట్టారు బ్రాహ్మణులకులము గాను, సమగ్రులలో నొక భాగము. ఆర్యనట్టుచెట్టి.

(చెట్టి అనగా దేశము - చెట్టియొక్క నాయకులు లేక సామంతులు).

ఆయ్యియారాత్ తాలై వార్, అను అయిదువేల నాయకులు.

Note :　కులములు లేక తెగలు దక్షిణ భారతదేశము (ఏ-బి).

పదిహేడవ ప్రకరణము

# బంటురాజులు

బంటురాజులనువారు ముత్తరాచ లటువంటివారు. దక్షిణ (కెనరా)లో వ్యవసాయ భూములుకలిగి సాగుచేయువారిలో 'బంటులు ముఖ్యులు'. 'బిల్లవలు' కల్లుతీయువారిని మినహాయించినచో, జిల్లా మొత్తముపై యెక్కువ సంఖ్యగల కులము బంటులు మాత్రమే. నవీన కాలములో (కెనరా)లో బంటులు భూమాందులుగాను, పెద్దవ్యవసాయదారులుగాను మిక్కిలి పలుకుబడి గలవారుగానున్నారు. ఇప్పటికిని వారిలో వీరోచితమైన వైఖరి అల్లే మిగిలియున్నది,

## బంటు శబ్ద నిర్వచనము

బంటు : తుళవభాషలో 'బంటు' అను పదమునకు 'బలమైన వ్యక్తి లేక సైనికుడు'.

బంటు : దండనాయకుడు - సేనానికులతోంగచోడ గోంకరాజుల బంటు... [illegible] (S. I. I. V. 140. క్రీ. 1005)

బంటు : గ్రామరక్షకుడు.

బంటు : భటుడు, (గ్రామ భద్రతకు బాధ్యులగు వీరభటులు).

బంటు : బాణువ, (బాణ) యుద్ధనేర్పరి.

బంటు : భటారి లేక బంటులై యుండవచ్చును. శా. శ

(౧). ఉ. కప్పెర ఆరభట్టన్, శిష్టజనప్రియన్, కష్టజనవర్జిత కలియుగ విపరీతన్ 11. క్రీ. శా. శ. 578 సం॥. ఈ శాసనములో కప్పెర అరభట్టర్, అనియుకూడ కలదు. (పుట. ౨౯).

(౨) కేశవదేవరాజుల బంట్లు దాయపువారును, వారి అందుల మనవితికాటున్న.(S. I. I. V. 176. శా. శ. 1119).

బంటు రాజు : శ్రీమన్మహామండలేశ్వర చాళుక్యరాజ్య సముద్ధరనుండు మలయమున బంటరాజు. (శా. శ. 1065).

బంటు రాజు : (౧) ఉదారదోరథాత్రీశ వంశవా. (౨) ద్ధిగ సుధాకరః శ్రీ మానాత్యమదేవ (౩) శ్యనందశో బంటుభూపతిః ॥
(A) మల్లం. (౧౬) శ్రీమహామండలేశ్వర (౧౭) చాళుక్యరాజ్యసముద్దర. (౧౮) నుణ్ణమలయమున బంట. (౧౯) రాజు శ్రీమద్దాక్షారామభీమేశ్వర (౨౦) మహా దేవరమంద్దినిలువు. (S. I. I. A. R. ౨౯౬ ఆఫ్ ౧౮౯౩).

బంటు : భటుడు లేక అంగరక్షకుడు. విద్యార్థికల్పతరువు. నిఘంటువు.

బంటు : భటుడు లేక భట్టారకుడు. విద్యార్థికల్పతరువు. నిఘంటువు.

బంటు : చిదిమిపెట్టినబంటు - నిగ్గుతేలిన శూరుడు. ,,

బంటు : ముత్తరాచలు, బంటులు నొకరేయని, శ్రీ సిరాజుల్ హాసన్ కులములు లేక తెగలు, నిజాం డొమినియన్ యను గ్రంథమందు ఉల్లేఖించినాడు. బంటులను గురించి వేముల రామభట్టు గౌరీవిలాసమున ఈ విధముగా వ్రాసినారు.

సీ ॥ పచ్చపిట్ట పఠాన్ సిపాయిల్ సవారి బె,
షాబాషువహా వ్వా వనందనంగ,
ముఖముల్లెత్తుకొని శారికవందిమాగధుల్,
బహుపరా, గొప్పర భళాభళియనంగ,
రభసంపు నెమ్మి వీరభటాళి ఝుళిపించు,
ఉక్కుకత్తులును తళుక్కునంగ- (నంగ).

శీతువుపిట్ట బంగ్రౌతు తుపాకి చ
ప్పుళ్ళు డెమిల్లు డెమిల్లుమనగా,
అంచలిరువంకచోపుదార్ తగడంగి
జరుగకుడు ఖబర్దార్ఖబరి యనంగ,
మారుడవ్వేళననికై సవారివెడల,
తనబలంబుతో శృంగారవనముచేరె. (IV 64.పుట557)

పై చూపిన పద్యమునుబట్టి 'బంగ్రౌతు' అనగా బంటులు (అశ్వమురౌతులు) -సవారిచేయువారు. నేడు సేవకులుగా కనబడు చున్నారు. శ్రీ క్రిష్ణదేవరాయలు, తన నమ్మకస్తులైనబంటులనుగురించి ఆముక్తమాల్యదలో ఇట్లు వ్రాసియున్నారు.

క॥ మేలగు ఘోటకమును శుం
డాలంబును నాప్తసుభటు। నకెయిమ్మతటి
న్మేలగు యేపునమందుర
బాలింపుము దొరలపాలు। పఱుపకు వెలపుడున్.

తా॥ గజా, అశ్వాదులకు, సుఖరక్షము చేయదలచితివేని, దాని నొప్పి, నెఱుంగక యారోహణము జేయునట్టి గొప్ప ఉద్యోగస్థులకాధీనము చేయక 'ఆప్తుండైన బంటు'నకాధీనము సేయుము. సమయము వచ్చినతటి నీకు మేలగును.[౧]

బంటులు మంచి శరీరదార్ఢ్యము గలవారు. వారు పూర్వీకులవలే ఎన్నియో విధానములను అనుసరించెడివారు. చంపబడ్డవారు, చంపిన వారిని పొలములోనే పూడ్చిపెట్టబడినట్లుగా యిప్పటికి నాటినుండి జరుగుచున్నవి. ప్రతివాడు కత్తి, కఠారు లేకుండ తిరిగేవారు కాదు. బంటు తెగలోని పురుషులు, స్త్రీలు ఆసియా ఖండము మొత్తముపైకి అంద సౌరాష్ట్రవము కలవారు. పురుషులు ఎత్తైన నొసలు, పొడవైన, ముక్కులు కలవారు.

"కనర" అను చిన్న పుస్తకములో ఈ క్రిందివిధముగా వివరించి యున్నారు. 'తులులో బంటు అను పదమునకు అర్థము బలమైనవ్యక్తి లేక సైనికుడు'॥ మలబార్‌లో నాయర్‌ల మాదిరిగా, బంట్లుగూడ మొట్టమొదటి ఒక వీరోచితమైనసైనికజాతికి సంబంధించినవారు. దక్షిణ కెనరాలోని ఉత్తరభాగమైన సైనికజాతికి సంబంధించినవారు. దక్షిణ కేనరాలోని ఉత్తరభాగములో 'బంటు'కు బదులు "నాడవలను" నామమునుపయోగించుటనుబట్టి, నాడులయొక్క ప్రాంతీయ వ్యవస్థీకరణ శ్రీ లాగన్‌గారు వివరించునట్టు మలబారులోని ప్రాంతీయవ్యవస్థీకరణకు పోలియున్నట్టు తెలియుచున్నది.

మొట్టమొదటివారు "ఆరువందలకు" ఒక జతగా పొందికపరుచుకొని, ప్రతి అరువందల జతకు ఒక నాడు లేక దేశము యొక్క ప్రజల భద్రత బాధ్యతను అప్పగించిరి. "నాడు"ను "తర"లుగా విభజించిరి. 'తరా' అనునది ద్రావిడపదము. ఇది పునాది లేక స్థాపించుట అను అర్థమునిచ్చును. ఇది యిట్లు పునాదిని సూచించును. కొన్ని గృహములు కలసి ఒక వీదిగా పేర్కొనబడినది. జసుల్ భాషలో "తెరు" తెలుగులో 'తెరును' మరియు కన్నడలో 'తులు' "తెరువు" అని అందురు "తరా" అనునది నాయర్ ప్రాంతీయ ఏకము లేక ఒకభాగము.

మలబార్ నాయర్ యొక్క ముఖ్యాధిపతికి ఒకనాడు మరియు ప్రత్యేకమైన రక్షణసిబ్బంది వుండెడిది. నూతన మలాబార్‌లోని కొన్ని తాలూకాలపేర్లు వారి ఫ్యూడెల్(Fudels) రాజరీకపు,(సామంతరాజరీకము) గతాన్ని వ్యక్తపరుచుచున్నవి. యిప్పటికి ధాన్యము...పండగ వేడుకలలో కత్తులు, కఠారులతో "జామిరిన్" అనువ్యక్తిని రక్షించడం చూయించెదరు.

కనరాదేశపు ఉత్తరప్రాంతములో బంటులు యిప్పటికిప్రాంతీయ నాడు పేరుగలిగియుండును. యిక్కడ వివరించవలసిన విషయమేమ

నగా, ఆరోజులలో "కెరలలు మరియు తులుల" కాడ దేశ రక్షణ బాధ్యతను స్వీకరించుచుండిరి. తక్కినవారు జమీందారులుగా, రైతులుగా, వ్యవసాయ కూలీలుగా, యితర పనివారలుగా అదే కులమునకు చెందియుండికూడ నివసించుచుండెవారు. ఆయినను అందరిలోను ధైర్య సాహసములతోకూడిన "ఆటల" -వినోదములపై ప్రీతికలిగియుండెను. పైన వివరించిన పద్ధతులన్ని మారిపోయి, విజయనగర సామ్రాజ్యకాలములో చాలా మార్పులు వచ్చియుండెను. విజయనగర ప్రభుత్వము క్రింద ప్రాంతీయ అధికారులు ఒక ముఖ్య అదికారికి లోబడియున్నను. మొదటికంటే వారు వారి ప్రజలతోగల సంబంధములో ఎక్కువస్వేచ్ఛ కలిగియుండిరి. "బెండూర్" అనగా (బేదర్) రాజుల కాలములో ముఖ్యముగా మైసూరురాజుల కాలములో ముఖ్యాధికారములు బలము, అధికారములను చాల వరకు క్షీణించిపోయెను. అయినా ఆ వ్యవసాయపద్ధతిని బొత్తిగా ఎత్తివేయకుండిరి.

"బంటుల పుట్టు పూర్వోత్తరాల గురించి ఖచ్చితమైన ఆధారము లేమి లేవు. కాని తులువులు, క్రీ. శ. మొదటి శతాబ్దములో ఒక్కొక్కప్పుడు స్వతంత్రరాజులుగాను, మరొకప్పుడు పల్లవుల, కదంబల, చాళుక్యల, హోయ్సల, బల్లాల రాజుల క్రింద (ఫ్యూడల్స్)గా సామంతులుగా వుండెడివారు." దీనిని బట్టి వారు యెప్పుడు యుద్ధ స్థితిలో వుండవలసి వచ్చినట్టు తెలుస్తుంది. కావున వారిలో ఒక ముఖ్య భాగమును "బంత్రు" లేక సైనికులు యుద్ధముచేయువారుగా వుండేవారు. గెలుపునొందిన తర్వాత క్రమేన పురోహితులకు కాని భూమిని వీరు స్వాధీనము చేసుకొనిరి. పురాతనపు శాసనములు తులువరాజుల గురించి తెలియచేయుచున్నవి. తులువల కాలము పన్నెండవ శతాబ్దము లోని శాసనములు కలాసలో లభించినవి తెలియచేయుచున్నవి. అళీయ సంతానపద్ధతిలాంటిదే ఒకటి మలాబార్ లోకూడ ఆచారములోనున్నది. ఈది కేరల మరియు తులువ పీడిపోకముందునుండే వుండెను. కొద్దిసంఖ్య

లోనున్న పరివారబంట్లు, మరియు జైన బంట్లు, అళియ సంతాన పద్ధతిని అవలంభించకుండిరి. వీరు మొదటి మతము మార్చుకొని హిందు మతము, జైనమతము స్వీకరించినవారి సంతతివారు. సాంఘిక సంబంధములలో మార్పును కోరినవారు. మతమును మార్చియుంటారు. వీరి వారసత్వ పద్ధతి చాల బాధలకు తగువులకు దారితీసియుండెను. తండ్రులు సమిష్టి ఆస్తిని నిర్లక్ష్యం చేసి వారి సంతానమునకు లాభము కలుగునట్లు ప్రయత్నించెడివారు. ఈ వారసత్వపద్ధతిలో మార్పునుకోరే వారు చాలమంది వున్నా, చిరాస్తిలో ఆసక్తి కలవారు, ఈ పద్ధతిలో ఏలాంటి మార్పుకుకూడ వ్యతిరేకులై వుండిరి. బంటులు సాధారణముగా మాంసహారమును వ్యతిరేకించువారు కారు, వారు జంధ్యమును తప్పని సరిగ వేసుకొనవలెనను ఆచారము లేకుండెను. కాని బంట్లులలో ఒక వర్గమైనవారు బల్లాలుగ ఆ యింటి యజమానులు, మాంసము తినువారు కారు, మరియు జంధ్యముకూడ ధరించువారు.' వీరు సామాన్య బంట్లుతో భోజనము కాని, వివాహాములు కాని చేసుకొనువారుకారు. బంట్లలలో బలవంతులైనవారు 'బల్లాలు'గా మారిపోయిరని కథలో చెప్పుకొందురు. బంట్లలో "పట్టము" అను నామము కలవారిని 'సెట్టివాలులు', లేక 'హేగ్గడ' అందురు. వారుగూడ జంధ్యమును ధరించువారు. వారు దేవాలయములకు నిర్వాహకులుగా లేక ముక్తసర్‌లుగా నుండెవారు. బంటులలో సర్వసామాన్యమైననామము 'చెట్టి' లేక సెట్టి కాని చాల యితర నామములు కూడ కలవు. ఉదాహారణకు హేగ్గడ నాయక్, బంగెరరాయ్, బల్లాలిలోను మొదలగునవి ఈ విధముగా యున్నవి. (౧) బెల్లతనోన్నియాలు, జాగరి (పు. 210). (౨) భూతి అన్నయ్యా. అషేన్ (పుట. 217). బంటులు –చెట్టిలు, సెట్టియని కలవు, ఈ సెట్టిరాజుల శాసనములు చాల గలవు, ఈ చెట్టి మద్రాసు ప్రాంతమున చెట్టియార్ అని పిలువబడుచుండిరి, మరి కేరళప్రాంతమున చెడ్డి

యని కూడ యున్నది. కాన బంటులు తెలంగాణములోన, నల్గొండ జిల్లా, మరియు హైదరాబాద్ జిల్లాలే కాక అంధ్ర జిల్లాలలో కూడ చాలగలరు. బంటుల విషయము శ్రీ ఎడ్గర్ థ్రస్టన్‌గారు 36 పుటలను వ్రాసియున్నారు. కాన నేను క్లుప్తముగా తీసుకొన్నాను. బంటు చూడుడు.

Note : The caste & Tribes of Southern India.

— ० —

# తలయారి లేక తలారి - తలవరలు

తలారి - తలయారి అను పర్యాయపదములతో పిలువబడె ముత్త రాసలకు, వృత్తిరీత్యా గ్రామములందుగల ఉన్నతస్థానము, కాలంతరమున నెట్లు రూపుదాల్చినదో శ్రీ ఎడ్గర్ థర్స్టన్ మహాశయుని యొక్క నివేదికను పరిశీలించిన, జాతి జీవనపరిణామము స్పష్టమగును.

తెలుగుదేశములో ముత్తరాచలను లేక ముత్తరాస అనుబడు వారిని తలారియని పిలుతురు. తలారి అనుకులమును పలుచోట్ల తలారి అనికూడ పిలుచుట కద్దు. అట్టితలారి లేక తలయారి గూర్చిన వివరణము ఇట్లు కలదు. "తలయారి అనగా గ్రామాధికారి (Talayari) (Talai - chief or Headman). వీరు ఒక విధమైన గ్రామ పోలీసు మనిషి మాదిరిగా, ప్రభుత్వమునకు జెందనివాడు. వీరిని సహజముగా తలారి అందురు. వీరి ఆధీనములో గ్రామ చావడి లేక లాకప్ (Lock-up) ఉండెడిది. వీరు ఇతర పన్నులతోపాటు దొంగలింపబడిన పశువులను పట్టుకొనుట, దొంగలుగా పరిగణింపబడినవారిపై పర్యవేక్షణ చేయుట వీరి విధులు." వీరి క్రింద యిద్దరు లేక ముగ్గురు తలయారిలుందురు. (౧) ఒకడు పరియాణకు జెందినవాడు. పరియాణ అందురు. పరియాణ అనువాడు పరియాణులుండు చోటు తలయారిగ పనిచేయును. మిగిత వారు తెలుగుదేశములో కొన్ని ప్రాంతములయందు, ముత్తరాసలను గ్రామ కావలిగా మరి తలారిగ తెలియనగును. కాపు ప్రజలు, మరి మన్నె, బెడర్లు, కర్నూలు జిల్లా, బల్లారిజిల్లాలో ముత్తరాసలను కూడ తలారియందురు. వీరిని గూర్చిన మరియొక వివరము ఇట్లుకలదు. వీరు గ్రామ తలయారిలుగా కనబడుచున్నారు. అందుచే వీరిని తలయారి (తలారి) కులమందురు. వారికి వారు సగర్వముగా పాళెగార్లని

చెప్పుకొందురు. చంద్రగిరిలో మాత్రము (దొరలు) అనిపించుకొను చున్నారు.

తలయారివారికిన్ని బ్రిటిషువారికిగల సంబంధమును గూర్చిన ఈ క్రింద వివరణ పరిశీలింపుడు.

తంజావూరు గెజెటు (1906) ప్రకారము బ్రిటిషువారు హిందు దేశమును, ఆక్రమించినదాదిగ, తలయారులకు కొంత రుసుమును చెల్లించెడివారు. మరియు 1816 నాటి పోలీసు చట్టము ప్రకారము తలయారీలు పోలీసు సిబ్బందిలోని వారుగా, వారు బ్రిటిషు పరిగణించిరి.

## తలారిశబ్ద నిర్వచనము - నిఘంటువు

తలయారి : **Head** - లేక సిరము - యారి - అధికారి - పెద్ద అధికారి, లేక గ్రామాధికారి.

తలారి : అనగా గ్రామాధికారి (un Depart mental polieman)

తలారిలు : ముత్తరాసులంటివారు.

తలారిలు : బంటులు.

తలారిలు : గ్రామకావలి.

తలారి : అనగా తలవర, మహాతలవర.

ఈ తల శబ్దము "స్థల - తల" అనుపదములునుండి వచ్చినది.

స్థలమనునది సంస్కృతము - తలయనునది ప్రాకృతము.

తలవర : ఇక్ష్వాకుల నాటి సామంత ప్రభువు కుటుంబములలో ముఖ్యమైన వారు ధనికులు.

తలవర : అనగా ధర్మాధికారి, ప్రధానన్యాయమూర్తి, ఈ తలవరలే తలారిశబ్దము, ఇక్ష్వాకులనాటి సామంతప్రభువు కుటుంబములలో ముఖ్యమైన ధనికులు. పూగేయులు, హిరణ్యకులు, కులహాకులు, మొదలగు వీరు ఇక్ష్వాకులతో సంబంధము చేయుచు రాజబంధువులైయుండి

రాజ్యమునందలి ఉన్నత ఉద్యోగములలో వీరు నియుక్తులై యుండి వీరి బిరుదులతో "మహాతలవర, మహాసేనాని, మహాసేనాపతి వంటి పదములు కాన్పించును."

తలార్లు: గ్రామరక్షకులు, గ్రామ రక్షణకై ౧౦ మంది 'వీరభద్రులు'.

తలార్లు: (గ్రామభద్రతకు బాధ్యులగు వీరభటులు) ఉండిరి. ౨౧ మంది భటులు (తలార్లు) ఉండిరి. వీరిని వీరముష్ఠివారని పిలువబడుదురు. శబ్దార్థమునకు అర్హతకలిగినవారు, వీర ముష్ఠివారని యుహింపవచ్చును.

తలవరి: మంటపమున పోలీసుస్టేషన్ (police Station).

తలవరి: దండనాయకుడు (Sub-Inspector of Police-ఆమీన్) ఉండెను. వారి హోద లేక (దరా) కూడ ఇప్పటి పోలీసు ఆమీన్లకు తక్కువదికాదు. దీనిని గురించి నొక పద్యముగలదు.

సీ॥ "చలదయః ప్రతికోజ్జ్వలదండకాండముల్,
ఘల్లుఘల్లగుచుముంగళ చెలంగ,
సునుపారిచికిలిచేసిన విచ్చుకత్తులు,
తపనదీప్తుల తళ త్తళయనంగ,
హోనుమదాకృతులు వ్రాసినకంచుటరిగలు,
జూళించురవళీచేడాలుమించ,
ఆదరుక్రోవ్వుల మ్రోతకదిరినల్దిక్కులు,
నర్తరావములవాయసములురుగ,
ముందటను కంచుకొమ్మమిన్నందిమొరయ,
జారచోరుల గుండెయల్ ఝల్లనంగ,
వెడసికోలాహోలంబుగావేళ్వవాటి, జేరియప్పటిణము
తలవారిగాంచె॥"

తా॥ తలార్లకట్టెకు చిన్నచిన్న ఉక్కు ఇనుము బిళ్ళలగు గుత్తులను కట్టి, చేతబట్టెడివారు; అరిగెలినిన కేడము అన్నారు. నిఘం

టుపుకారులు. డాలులను తోలుతోను, ఇత్తడితోను, కంచుతోను ఇనుముతోను, చేయించెడివారు. ఇచ్చట తెలిసినది "కంచుడాలు" దానిని మూడు కాని. నాల్గుకాని గుడుపలుండును. ఆ గుడుపలలో సన్నని ఇనుప గోలీలు లేక రవ్వలు వేసెడివారు అవియే 'రవళి' చేసినవి. ఉక్కుపై విగ్రహములు చేయించెడివారు. పలువురు సింహములు, పులులను వేయించెడివారు. ఇచ్చట హనుమంతుని వేయించినారు.

-(ఆ. చ. స. పుట- 295-296)

తలారి : మాస్టీడు, అనగా (శూరభటుడు) తలపాగ బొరమీద జెలిగెడు నాయుధార్చన సల్పినట్టిదాసనపు పూవు." ఏడమకేలగోలుసును, కుడిగేల పెద్దకత్తి, దట్టితో చెక్కునిద్దావంకి (కత్తి), దుప్పటి వల్లెవాటు, ముందరి బిరుదడ విణకలవాడు. (ఆ. చ. స. పు. 307).

ఆకాలమందు గ్రామాలకు, పంచాయితి సభలుండెను. ఆ పెద్దలే పన్ను వసూలు చేసెడివారు. "గ్రామ తలార్లె-పోలీసువారు." న్యాయస్థానాలు, పంచాయితీ సభలే వుండెను. తలార్లు అపరాదులను పట్టెడివారు. రాత్రివారు గ్రామమందు "కోలదిదిటి"తో సంచారము (గస్తు) చేసెడివారు. రాత్రి తప్పెట్లు (తమకు) వేసిన తర్వాత జనులు తిరుగాడకూడదు. అనుమానమున్నవారిని రాత్రియంతయు తమ ఠాణలో బండకొయ్యకు తగిలించి, కూర్చోపెట్టి, తెల్లవారిన తర్వాత వాడు "అచ్చో-ముచ్చో" తెల్చుకొని అపరాధికాకున్న వదలివేసేవారు. వెండి బంగారము దొంగతనమైతే మొట్టమొదట తలార్లు కమసాలి వారిని పట్టి విచారించి లేక దొంగ సొత్తులు వచ్చిన తెల్పుడని యొప్పించెడివారు.

-(ఆ. చ. స. పు. 337-338).

తలవరల గురించి ఒక ప్రాకృతశాసనము క్రీ. శ. రెండవ శతాబ్దము నాటిదిగా దోచుచు. మనకు దొరికిన శాసనభాగమున రాజు పేరు లేదు. ఇందు భార్యతోను, కోడలితోను, వచ్చి, "మహాతలవర" అనునతడు చేసిన దానధర్మములు, వర్ణితమైనది. దీని ప్రతిబింబమును,

ఇందలి సారాంశమును(ఇంగ్లీషున) చెన్నపురి శాసన శాఖవారు ౧౯౨౩-౧౯౨౪వసంవత్సరనివేదికలో ప్రకటించియున్నారు. శాసనపాఠము శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారిచ్చినది. ఈ శాసనము కృష్ణా జిల్లా నందిగామ తాలూకా, అల్లూరులో నొక శిలా స్థంభముమీద జెక్కబడియున్నది. శాసన కొంతభాగము విరిగిపోయుండెను. కాన రాలేదు.

౧. ...ల (సేమట) వ (సచ)·
౨. సరామొ విహారో దెయధమపరిచా
౩. నిగలసిమాయలె తరకుళోన
౪. తిభెతసారసపాపికలసిమాయ
౫. నివతనానిరాజ నతినిచార తెమచ (?)
౬. పటసిమాయబతినిసనివతనారా.
౭. వురసిమాయచసవిసనివతనాన.
౮. టలసగావినపచసతానిచొాయరిబలివా.
౯. సకటానిపెసరుపానిదాసిదాససచతాలం
౧౦. కుభికటాహాసచతరిలోహియొచెకటాహానికంస (౩)
౧౧. సభాయనానిచతరివదాలాభికారొకరొడాయొయొ
౧౨. కదివికాయొచఅతరగిరియపిచషాకెతళాకా
౧౩. కాహావనానచపురానంసహాసంఅఖయనివ
౧౪. ఏసమహాతలవరసదెయధమపరిచాకో
౧౫. అతషేటతరససెబాపననివతనాని
౧౬. ఏతసభారియస సపుతకససనసకస
౧౭. అయిరానపునసెలియానినిగాయస... (ఆ. చ. స.)

పై శాసనములో కనబడిన తళ్కాడ్వారు తలకాడి గంగులై యుండవచ్చును: (కళ్యాణచాళుక్య శాసనము - ఆలంపురము నం ౧౦ పు, ౨౮) చూడుడు. వీరు కళ్యాణ చాళుక్యల సమయమేగాక

అంతకు పూర్వము క్రీ. శ. నాల్గవ శతాబ్దములో 'గంగవాడి ముత్త రాసలు యుండిరి.' ఈ గంగులే తలకాడ గంగులని తెలియుచున్నది వీరు రాష్ట్రకూట రాజులకు సామంతులుగా పాలించుచుండిరి.

-(కన్నడసాహిత్యము)

తలవర : తలారి – తలవరశబ్దము తెలుగు పదము. నేడిది పూర్వపు గౌరవార్థమును పోగొట్టుకొని 'తలారి' గ్రామకావలి. (గ్రామపు కాపరి) యను సామాన్యార్థములోనికి దిగినను, ఇక్ష్వాకులనాడు తలవర శబ్దము గొప్ప పదవీసూచకముగా నుండెను. (ఆ. చ. స.).

పై తలవరగురించి శ్రీ ఎ నీలకంఠశాస్త్రిగారు క్రీ. శ. మూడవ శతాబ్దమున ఇక్ష్వాకుల నాటి శాసనములను బట్టి మరియు నాటి బిరుదములైన తలవరులగురించి వివరించుతు ఇట్లు చూపినారు. ఈ తలవర శబ్దమును విచారించుటకు బదులు ముందు దక్షిణభాషలలోని తమిళ భాషలో సంబంధము చూచె వరకు 'తలవై' అనగా (A. General) తమిళములో "తలైయారి" అనగా - గ్రామకాపరి (village watch man) లేక కన్నడలో తలవర అనగా ఒక 'బెడల్ కాపు'యని కలదు. కన్నడ తలవరకును, తెలుగు తలవరకును దగ్గర సంబంధము కలియుచున్నది. తమిళ తలయారి శబ్దము 'తలవర' శబ్దమునుండి వచ్చినట్లు తెలియుచున్నది. మహా సేనాపతిశబ్దము మహాతళవరనుండి వచ్చినట్లును తమిళ తలవై అనగా కమాండర్ (commander). ఈ తలవరశబ్దము ప్రాకృతమున తలయారి అని యుండవచ్చును. ఈ తలవర ఆనేవారు కల్పసూత్రప్రకారముగా పదినేనిమిది (18) గణరాజులుండిరని తెలియుచున్నది. ఈ తలవరశబ్దము ఒక సైనిక బిరుదమువంటిది. మరియొక చోట ఈ తలవరలను వైస్ రాయలు(viceroy)గాను లెక్కించిరి. వీరు శాతవాహనుల త్రొక్కుడికి, మహాభోజులు, మహారథులుగా పోయినట్లు పోయివుండిరి. వీరినే ఉత్తరప్రాంతమున 'తరవర' యనియు, "మహా ప్రతీహారి" యనియు (A great-chamberline) అని వైశాలిలో

కనబడుచున్నది. మరి కొండముది శాసనమున, 'మహాతరవర, మహా దండనాయక' యని కలదు. "(క్రీ. శ. 1173) ఒక గవర్నరు కుమారుని పేరు తలవరకామదేయనాయక అనియున్నది." మరియొక శాసనములో కలాకురిరాజు, రాయముసిరిసోవిదేవరాజు కాలమునాటిశాసనము 'తలవర - స్థల - భూపాల - ప్రదత్త - పత్త - బమ్దవిభుసిత - రాజస్థమై యని కలదు."

శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో తలవరుల గురించి నొక చిన్న పరిహాసమున వ్రాసినది చూడగలరు.

మ : తలబతుచ్చట గ్రుక్కి-బాతువులు కే, దారంపుగుల్యాంతరస్థల ని ద్రింపంగ, జూచియారెకులుష, స్నాన్నత ప్రయాతద్విజావలిపిండికృత్త, శాటులన్న విదరా, వాసంబు జేర్పంగ, రేవులడిగ్గన్వేసంచాఅువానింగనిన వ్వున్నాలిగోప్యోఘల్.

తా॥ అప్పట్టణ సమీపమునందు పరిమళ్ళుకు దిద్దిన కాలువల యందు బాతులు వాని స్వభావగుణముచేత తలలు ఱెక్కలలోదూర్చి కొని నిద్రించుచుండగా, తలవరలు వాటిని జూచి యుషఃకాలమందు స్నానార్థమై, యా కాలువలకు వచ్చిన బ్రాహ్మణులు తమ వస్త్రములను బిండియచ్చటనుంచి మఱచిపోయిరని తలంచి వాని మరల వారి వారి గృహములలో నొప్పగించుటకై రేవులలో దిగగానే, యాపతులు పఱచుట చూచి యచ్చట బైరులను (పైరులను) గాపాడుచున్న 'గరితలు' "తలవరులను" బరిహసింతురని భావము.

తలవరులు : వోరుగల్లుకోట నిర్మాణము ౭౨ బురుజులతో కట్టబడినది. తూర్పుద్వారము సమీపమందలి మహోన్నత శిలాఖండమును ఆనుకొని యొక్క తటాకము గలదు. ఆ శిల ఖండ శిఖరమున అష్ట కోణాకృతిగల బురుజు గలదు. "తలవరులుండు" నీ బురుజుమీద నిలుచుండిన నలుదిక్కుల దృష్టిసాలించినచో పట్టణపు శిధిలాలు మనలను దిగ్భ్రమిముగావించును. (ఆంధ్ర నగరములు).

పై చూపిన కాకతీయుల కాలమునాటి "తలవరులు"ను గనపతిరాజు కాలమున తన సైన్యములో యిచ్చిన బిరుదమును, పదవులను గురించి సిద్ధేశ్వరచరిత్రలో పాల్కురి సోమనాధుడు జనాభా - గణన (census Report) నివేదికలో ఈ విధముగా చూపినాడు. (౭౭) డెబ్బదియేడు వెలమనాయకులును, వీరు లెంకనాయకులు, మూడులక్షల పదాతివర్గంబుతో పురంబులు, గూడములు గాచుచుండెడి 'పెద్దతలారియగు నిశంక వల్లభుండును' మరియు నానాదేశాధిపతులును, రాయబారులును, గజంబులకు పెద్దయయిన మహాంకాళీయను (దొర) యును, అశ్వంబులకు పెద్దసాహిణి మారయ్యా నవలక్ష ధనుర్ధులకు పెద్దకొలిపాక సీనయ్యయు మనుబోతులకు పల్లాలుకట్టి యెక్కి వచ్చెవారు నూర్వురు. సకలజనంబులను(చితస్థానము)ంబులకు పనిచి పెద్ద తలారియగు నిశంకవల్లభుడు పరివారసమేతంబుతో రెండు ఘడియలు కొలువు సేయుమని, అతని వీడుకొలిపి అభ్యంతరవర్తియైయుండెను. (పుట. 153-154).

పందొమ్మిదవ ప్రకరణము

# ముత్తరాచ - పాళెగార్లు

ముత్తరాచపాళెగార్లగురించి మరికొన్ని వివరములు ఇచ్చట పొందుపరచుచున్నాము.

(౧) పాండ్యరాజులను ఓడించినవాడు 'కళభ్ర' అను పేరుగల బాలుడగువాడు వేల్వకుడి గ్రామమును గల్చుకొనెనట. పిదప నెడుంజడియన్‌భూపతి కాలమున నార్కొర్కన్ సంతతివాడగు. కామక్కాని నర్సింగన్ అనునాతడు భూపతినుండి తిరుగవేల్వకుడిగ్రామము దానము వడసి. తామ్రశాసనము పూర్వక స్వాధీనము బడసెనని చెప్పబడినది. (E. P I. XVIII సం॥ పుట. 291) యందుగల వేల్వకుడిశాసనము నందీవిషయము లిఖింపబడియున్నది. వేల్వకుడి గ్రామము, ముదికుడిమి భూపతి దానమిచ్చినది, కనుక ఈ కళభ్రలకు జెందిన కళభ్ర అనుపేరు గల బాలుడు పై గ్రామమును కల్చుకొనుటవల్ల ఇతను పై భూపతులకు జెందినవాడై యుండవలెను. (ఆ. వి. స. ).

౨. ముద్దరాజు రామన్న - పాళెగారు : కాకతీయ రుద్రదేవుడు, సారము రచించినట్లు, శ్రీముద్దరాజు రామన్న తన రాఘవ డీయ వాఖ్యానమున పేర్కొన్నాడు. కనుక ముద్దరాజు రామన్న యని తెలియునగును. వీరెక్కడి వారో తెలియరాలేదు. (సా. వా. . 247).

(౩) 'పికిలి చెన్నప్ప నాయకుడు'- ఇతడు పత్తికొండ తాలూకా లోని, కోటకొండను పాలించిన పాళెగారు. ఇతని తాత గోనేగండ్ల వెంకన్న క్రీ. శ. ౧౬౨౧ సం॥ ప్రాంతమున ఉళిందకొండలో "కావాలి కాడు"గా నుండెను. అనగా (సరిహద్దులు కాపాడు పాళెగారు అని

అర్థము). పికిలి చెన్నప్ప మనుమడు 'మాదప్పనాయకుడు' క్రీ. శ. ౧౬౭౬ సం॥ న బ్రాహ్మణులకొక అగ్రహారమును దానమిచ్చినాడు. ఆ దానపత్రమున, పికిలి వారి వంశము వర్ణింపబడినది. పికిలి చెన్నప్ప బీజాపురము నవాబులకు లోబడిన పాళెగాడు. కావున సిద్దియంబరుతో గలసి తిమ్మభూపాలునితో పోరాడి మరణించెను. (సా. వా. పుట. 515).

(౪) మట్లవారు : మట్ల అనంత భూపాలుడు - మట్ల యింటి పేరు. విజయనగర సామ్రాజ్యము వైభవము తఱిగినపిదప. పదునారవ
శతాబ్దియంతమున, నామమాత్రులైన రాయలయొక్క
సర్వస్వతంత్రులుగానో, కొంత స్వతం
భారమును నిర్వహించిన వానిలో
చున్నది.

మట్ల ప్రభువులు విజయనగరాధీశులకు
సంస్థానాధిపతులు. మట్లవారిలో నొక్కడగు
దేవరాయల అల్లుడు. మట్ల వంశజులు వీరి మూలపురుషుడు. 'తిమ్మ ప్రభుడు' చాటు పద్యములనుబట్టియు కకుత్స్థ విజయ అభిజ్ఞ త్త రాఘవములనుబట్టియు చూడ, మట్ల వంశోద్భవులు, విద్యాప్రియులను, రక్షణ ప్రియులునుంబు కన్పడుచున్నారు. అందు అనంతభూపాలుడు.

మట్ల అనంత భూపాలుడు, ఇతను పెనుగొండకడమల్క బలముల సాధించినట్టును, గుత్తిముకొండను స్వాధీనము పఱుచుకొనినట్టును, రాయలచే 'సురమాయి' బిరుదమందినట్లును తెలియుచున్నది. యుద్ధ వీరుడుగను, కావ్యకర్తను ప్రఖ్యాతిగాంచిన, ఈ అనంత భూపాలుడు, యెల్లధరరామణునకు రంగామాంబకును పుత్రుడు. తిరుమళతోళ్లప్ప చార్యుల శిష్యుడు. క్రీ. శ. పదునాఱవ శతాబ్ది యుత్తరార్థమున లేక పదునేడవ శతాబ్దియాదినుండినవాడు. ఇతడు కకుత్స్థ విజయమును గ్రంథము రచించి తన తండ్రియైన యెల్లభూపాలునికి అంకిత మొన

ర్చెను. ఇతని రాజధాని కడప మండలమునందలి సిద్ధపట్టణమును సంస్థానమును పాలించియుండెను. కకుత్స్థ విజయమునకు మూలమైన కథ స్వల్పమైనను, అనంతభూపాలుడు దానిని వర్ణనాకల్పనా చమత్కారములతో పెంచి గ్రంథమను చక్కని నాటక శైలిలో రచించెను. సంస్కృత భాషయందు తనికి అపారమైన పాండిత్యమునట్లు అతని పద ప్రయోగమునుబట్టి తెలిసికొనవచ్చును. (సా.వా. 671 + ఆ.వి.స.పు.15. మట్లువారికిని, బొమ్మవారికిని, మరియు పునంతరాజులకును, ముత్త రాజులకును సంబంధములునట్లు, మృత్‌రాచకుల కట్టు శాసనములో తెలిపియున్నాము.

(ఠ) ఆర్వీటివంశము: ఆర్వీటివంశము రాజులు, మట్లవారి మా... రిగా విజయనగర రాయల సామంత ప్రభువులు. ఆర్వీటి శ్రీరంగారాజ కుమారుడు అళియరామరాజు, శ్రీక్రిష్ణాదేవరాయల యొక్క మొ... టల్లుడు. ఇతనిని రాయలవారు తన వద్దనుంచినందున, అళియ పద్ద... ఏర్పడెను. అందువల్ల అళియ రామరాజుగ పిలువసాగిరి. వారి వంశావ... మొదటివారు. ఆర్వీటి బుక్కరాజు, ఇతని కుమారుడు రామరాజు ఇతనికి తిమ్మరాజు పెనకొండరాజు (కోనమ్మ), ఇతనికి తిమ్మరా... (వెంగళాంబ), ఇతనికి కోనేటి రామరాజు యని కనబడుచున్న... (ఆ. వి. పు. 105). ఆర్వీటి అళియరామరాజు, మట్లవారి వరదరా... శ్రీకృష్ణాదేవరాయిల అల్లుండ్లు, కనుక ఆర్వీటి - మట్ల, బొమ్మ, మాక... పునంతరాజులు, ఒకరినొకరికి సంబంధములు గలసినందువల్ల వీరంద... ఒకే ముత్రాజ పాళెగార్లుగ తేలియనగును.

(డ) గుంటుపల్లి ముత్తరాజు మంత్రి: ఇతను 'సర్దారు' గో... కొండ సుల్తానుల తుది కాలములో ఉండెను. తెనుగుదేశములో వినో... విశిష్టత కానవస్తువున్నది. అది విప్రవినోదము అనునట్టిది. ఒక జా... బ్రాహ్మణులు ఏదో శూద్ర దేవత ఉపాసనవలననో, మంత్ర తంత్రా...

వలనో, చిత్రమగు గారడీ చేయుదురు. ఇప్పటికినీ ఆ వినోదముచేయు విప్రులున్నారు. అతనిని గూర్చియొక చాటునిట్లు కనబడుచున్నది.

సీ॥ "సంతత మారగించునెడ
సజ్జనకోటుల పూజసేయు శ్రీ
మంతుడు గుంటు పల్లికుల
మంత్రి శిఖామణి ముత్తమంత్రిదౌ
బంతి, యెబండిగాకకడుముద
గూలముల బంతులెల్లనూల్
బంతులు, దుక్కిటెడ్లయెడ
బంతులు, విప్ర వినోదగారడీ,
బంతులు, దొంగవాంఛ్రములు
బంతులు, సుమ్మధరాతలంబునన్ (ఆ.సా.చ.పు. 375)

మరియు ఇతనిని గురించి నిడుబ్రోలు - పొన్నూరు గ్రామము యొక్క చరిత్రలో వ్రాయబడియున్నది. (చూడుడు) ఇతనిని బ్రహ్మణుడని కూడ చెప్పుదురు.

(౬) ముత్తరాచ - పాళెగార్ల - అమరకము: ఈ పాళెగార్లను గురించి, అమరకము పద్ధతిన చూపబడినది. వీరి వంశావలిలను ఎక్కువగ తెలియనందువల్ల, తెలిసినవారిని మరియు వీరి వ్యవస్థ గురించి చూపబడినది.

ఉత్తర సర్కారులని పిలువబడు ప్రదేశమునందు, మహమ్మదీయ ప్రభువుల వలనను అంతకుపూర్వపు హిందు రాజువలనను, చెందబడిన భూములుగాని, అట్లు భూములు చెందిన భూ నాయకులవలన జెందిన భూములుగాని, అనేకములుండుటవలన వీటి విషయమున, అంగ్లేయ ప్రభుత్వమువారికొక విధమగు "అమరకము" చేయవలసిన అవసరము కలిగినది. భూనాయకులవలన జెందబడిన భూములుకలవారిని "పాళెగాండ్రు" అని పిలుతురు. వీరు మూడువిధములుగా నుండివవారు.

(అ) పూర్వపు రాజ్యము లేలిన విజయనగరము, కంచీపురము, మధుర మొదలగు దేశాధీశుల సంతతిలోని వారు కొందఱు.

(ఆ) పూర్వపు రాజులయొద్ద సేనాధిపతులుగానుండి, మహామ్మదీయుల దండయాత్ర నడ్డగించుకొని స్వశక్తివలన కొంతదేశమునకు నాయకులై తర్వాత నాయా ప్రదేశములకు ప్రభువులుగా నంగీకరింపబడినవారు కొందఱు. (ఇ) జిల్లాకధికారులుగనుండి కాలక్రమమున మహామ్మదీయుల యధికారమునకు లోబడక స్వతంత్రులై ఆయా జిల్లాలపైని ప్రభావమును సంపాదించుకొన్నవారు కొందఱు.

మహామ్మదీయులు ఈ భేదమెంచుకయు, గనబఱుపక ఈ ముత్తెగల పాళెగాండ్రనొక విధముగానే చూచు పాళెగాండ్రబలాబలములను బట్టియు కప్పముగొనుచుండిరి. కాని ఒక పద్దతి ననుసరించి ఆమరకము జేసి, సిస్తుగాని, కప్పముగాని వసూలు చేయవలదు. ఈ పాళెగాండ్రు తమ యిచ్ఛవచ్చినట్లు, తమ క్రిందనున్న ప్రజలను, గ్రామములను పరిపాలించుకొనుట కధికారముకలిగి, మహామ్మదీయులకంతగా లోబడక యుండిరి. వీరు సర్వాదా బందోరులలో బోరాడుచు, మహామ్మదీయ ప్రభువులతో బోరాడుచు కాలము గడుపుచుండిరి. మహామ్మదీయులకు కట్టవలసిన కప్పము బఱువు అని తోచినప్పుడు, సాధ్యమయినంతవఱకు సిస్తు చెల్లింపకుండ ప్రయత్నము చేయుచున్నట్లు అపహరించుటకు వీలుగానప్పుడు తామీయవలసిన సిస్తు చెల్లించి తమ "ఎస్టేట్లకు" ప్రాంతములయందున్న సర్కారు గ్రామములను దోచుకొని, తాము సొమ్ము వసూలుచేసికొనుచుండిరి. ఇట్లు దోచుకొనబడు గ్రామములుయందున్న సర్కారు రైతులు అడునిడుగునకే బాధపడలేక తమ్ము బాధింపకుండ విడచిపెట్టినందులకు "కావల్" అను పన్ను ఇచ్చుచుండిరి. (కావల్-కావలి-అని అర్థము). కాని ఇక్కడ కావల్ అన్న పదము (కౌలు) (Tenant) అని యుండనగును. తర్వాత నాంగ్లేయ ప్రభుత్వ దినములలో, సిపాళేగాండ్ర ఎస్టేటుమీద వీరికన్న, న్యాయ

మైన హక్కు విషయమును మాత్రము నిశ్చయముగా తెలిసికొనుట కవకాశము కలిగినదికాదు. అప్పుడు వారితో శాశ్వతమైన "అమరకము" పద్ధతినొకదానిని ఏర్పరచుకొని, వారి ఎస్టేట్లమీద వారికిరాదగిన మొత్తమున, మూడవవంతు తమకిచ్చు పద్ధతిని చిత్తూరు, కాళహస్తి, వేంకటగిరి, బొమ్మరాజు, మట్లరాజు, నూకరాజు, మాకరాజుపాళెము మొదలగు ఎస్టేట్లు అమరకముగావించిరి. వీరి సంఖ్య నానాటికి క్షీణించి యిప్పుడు కొందఱు మాత్రమే మిగిలిరి. మనదేశము స్వతంత్రము అయిన తర్వాత పూర్తిగా లేకుండెరి.

(౧౦) అమరకములో, కట్టుబడి యుండెవారు. గంజాములో, నాయుధముధరించు, జమీన్‌దారులకు నౌకరిచేయువారికిచ్చు భూములు "కోలపాయకో" కట్టుబడులనియు యుండెను. (ఆ. వి. స.)

(౧౧) బంట్రౌతు: అనగా (గుఱ్ఱపురౌతు). బంట్రౌతు ఉద్యోగము చేసినందులకు ముత్రాసు జాతివారికీయబడినవి ముత్రాసుకట్టుబడులనియు, గంజాముజిల్లాలో మిలటరీ, నౌకరీ నిమిత్తమీయబడిన భూములు (పాయక్) కట్టుబడులనియు. విశాఖపట్టణముజిల్లాలో దేశమునందు దొంగతనములు, దోపిడులు, మొదలగు అలజడిలులేకుండగా, కాపాడినందులకు నాయుధముల ధరించిన బంట్రౌతులకు పర్వత ప్రాంతములందలి జమీన్‌దారులచే నీయబడిన భూములు "తిరస్తు "కట్టుబడులనియు చెప్పబడును. (ఆ. వి. 272).

-:0:-

## ఇరువదవ ప్రకరణము

# శ్రీకృష్ణ దేవరాయలు

క్రీ.శ. ౧౩౨౩ సం॥న వోరుగల్లును, ఢిల్లీసుల్తాను ప్రధమ సేనాని, మిల్లికాఫర్ ద్వంసముచేసి కొల్లుకొట్టుకపోయెను. ఆ సమయమునందు సాళువ నర్సింహ్మరాయలు పరిపాలనకువచ్చిన తర్వాత కొన్నాళ్ళకు మరణించెను. తుళువ నరసనాయకుడు, ఇతని కడసేనాని ఆయన తర్వాత తుళువ నర్సింహ్మరాయలు రాజ్యమునకు వచ్చెను. అప్పుడు అల్లకల్లోలములుండెను. తుళువ నరుసయ్యా నాయనకు ముగ్గురు భార్య లుండిరని కొందరందురు. కాని తిప్పంబా, నాగమాంబ ఇద్దరే కనబడు చున్నారు. ఓమాంబను ఎక్కువగ చేర్చిరి. తిప్పంబాకు శ్రీ వీరనర్సింహ్మ రాయలు, నాగమాంబకు శ్రీకృష్ణాదేవరాయలు అచ్యుత రాయలనిమరి కొందరి వాదము. ఓమాంబకు పుట్టినాడని చెప్పుదురు. రాయల వంశము యొక్క పూర్వోత్తరములును గూర్చి తెలుసు కొనుటకు యాధారములు లేవు. రాయలవారు వ్రాసిన ఆముక్తమాల్యదయను ప్రబంధమునందును చూపిన ఆధారముబట్టియే, వీరి మూలపురుషుడు ాలసముద్రమునందుబుట్టి, శివుని జాటాజూటిములకరించి మహోప ారిహై గొప్ప యాభిజాత్యముకల్గి కాంతికాముండైన చంద్రుడనియు, ి వంశము చంద్రవంశమనియు, రాయలవారు అత్రిమహోఋషి, తని కుమారుడు చంద్రుడు, ఇతని కుమారుడు బుధుడు, ఇతని ుమారుడు పురురవు, ఇతని కుమారుడు వాయువును, లేక నహుషుడు, నహుషనకు యయాతియు వరుసగా యయాతికి మరి దేవయానికి పుట్టిన వారు యదువు - తుర్వసులను నిద్దరు యుండిరి. అందు తుర్వసుడు గుణనిధి విశత్వకీర్తి వహించెను. ఈ తుర్వసుని వంశమే తుళువ వంశమని పేరుగాంచెను. ఆ తుళువ వంశమునకు మూలపురుషుడు తిమ్మదేవరాయ

రాజు. ఇతనికి ఈశ్వరదేవరాయలకు నాగమాంబను, తిప్పమాంబయను ఇద్దరు భార్యలుండిరి. తిప్పమాంబకు వీరనర్సింహ్మరాయలు, మరి నాగ మాంబకు శ్రీకృష్ణదేవరాయలు, ఆచ్యుతరాయలుపుట్టిరి. వీరనర్సింహ్మ రాయలు మరణించిన తర్వాత శ్రీకృష్ణదేవరాయలు పట్టాభిషేకము నకు వచ్చెను. శ్రీకృష్ణదేవరాయల జన్మదినము, శాలివాహన శక ౧౩౮౭ యనియు మరియు ౧౩౯౭ శకమనియు తేది ౧౬-౧-౧౪౭౧ వ సంవత్సరముగ ననియు వ్రాసియుండిరి. వీరు పట్టాభిషేకమునకు వచ్చినది క్రీ. శ. ౧౫౦౯ ఫిబ్రవరి ౪ తేదియని వ్రాసియున్నారు. వీరి ముఖ్య రాజాధాని 'కబ్బరిగ' పట్టణము. అనగా కబ్బలిగిరి యని యుండ వచ్చును. శ్రీకృష్ణదేవరాయలకు యిరువురు భార్యయులు, తిరుమలదేవి, చిన్నారిదేవి యనియు గలరు. తిరుమలదేవికి నొక కూతురును, యిద్దరు కుమారులు గలిగిరి. కూతురు తిరుమాంబిక, వివాహము ఆర్వీటి శ్రీరంగరాయలు పెద్దకుమారుడైన రామరాయలకు యిచ్చి వివాహము చేసిరి. ఇతనికే అళియా సంతాన రామరాయలు అని అంటారు. శ్రీకృష్ణదేవరాయలు తుళువ వంశమనియే యున్నది. కులమును చూప లేదు. వీరు కన్నడ కబ్బరిగ రౌతులుయనియు, మరినొకచోట ముత్తర వారనియు కనబడుచున్నది. నెల్లూరు ముత్తకూరు జమీందారుడు ముత్తయ్యకు వీరు బంధువులని చూపనైనది. ఇదియేగాక వారి చరిత్రలో నొక పద్యమందు ఇట్లు చూపబడినది.

తే॥ "నతిశితకృపాణకృత్తమత్తారివీర,
మండలేశనకుండలమకుటనూత్న.
మస్తమాల్య పరంపరామండనార్చి,
తేశ్వరుండగు నారసింహ్మేశ్వరుండు (పుట. 14-15).

ఇక్కడ కృతముత్తరి వీరయని యుండవలెను. కనుక వీరు తుళువ ముత్తరాజులైనవారని మరి కబ్బరిగరౌతులు, తుళువరౌతులు, వారి స్వంత అశ్వదళములుగానుండెను. వీరిని చతుర్థకులజులనియు, తర్వాత ...కులనియు చూపిరి. ఈ కబ్బరిగ, బంటులు, తెలంగాణ ముత్త

రాజులకు సంబంధములు కలవు. ఆర్వీటి వారికిని, మట్లవారికిని, సంబంధములు కలవు. మట్లవారిని కులకట్టు శాసనములో (మృతరాచలనియు చూపినాము). కనుక శ్రీకృష్ణదేవరాయలు తుళువ ముత్తరాజులై యుండనోపు. మరి వారి పాలన కాలమున 'గ్రామ కావలిగారు యనియు', మహానాయకాచారి' యని పిలుచుచుండెడివారు. గ్రామ కావలి అనగా సరిహద్దుల కాపుచేయువారు, (Defence Frontier) వారు. వారియొక్క సిధ్యుక్త ధర్మములు క్రీ.శ. ౧౫౧౬ వ సంవత్సరమున రాయలవారు, కూనపల్లి పెద్దనాయకుడును, వారిని మల్లెల సంతకు 'కావలి' గారుగ నేర్పరచి దానిని 'తాలారులపై' యధిపతిని జేసెనని శాసనములవలన తెలియుచున్నది. ప్రతిగ్రామమునకు గ్రామ స్థలమునకు నొక కావలిగారు వుండెడివారు. వీరు గ్రామ తలారి పై యధికారులు, తలారులు గ్రామమున జేసెడిపనులను పరీక్షించి వారి మంచి చెడ్డనాలోచించుటయు (స్థల) ప్రదేశమునందలి రక్షణకు సంబంధించిన పనులు నిర్వహించుటయు, నీకావలి వారి ధర్మము. దీనినిబట్టి ప్రతినాడునకు నొక కావలిగారు వుండినట్లూహింపనగును. తర్వాత వీరినె పాళెగార్లని పిలువబడినారు' (పు. ౧౮౩).

మరి శ్రీకృష్ణదేవరాయలవారి వంశ పరంపరా చాల పెద్దది. కనుక నెక్కువగ వ్రాయనవసరమనుకోను. వీరు క్రీ.శ. ౧౫౦౯ నుండి ౧౫౨౯ వరకు అనగా (౨౦) యిరువై సంవత్సరములు పరిపాలన జరిపినట్లు మరియు మృతినొందినవారైరి

వీరి కాలమున అళియరామరాయలు తెలంగాణ మండలమును తన అధీకారము నుండెననియు, మరి రాయలవారు స్వర్గస్థులైన తర్వాత విజయనగరము నందుండెను. శ్రీకృష్ణదేవ రాయలు, చంద్రవంశము తుర్వసు సంతతివాడైనందున తుళువ కబ్బరిగలైయె యుండవచ్చును. మరి నెల్లూరు ముత్తకూరు జమీందారుడైన ముత్తయ్యకు బంధువని నెల్లూరు జిల్లా మాన్యువెల్ లో Fare & Feastwell అను గజిట్ లో కనబడినది.

ఇరువది ఒకటవ ప్రకరణము

# ముత్తరాచ కోలీలు

కోలీ, తారు, ధీమర్, దీవర్ (aboating) మరియు చేపలు పట్టెడితెగ. వీరిలో చాలమంది గ్రామ కాపలదారులుగా నీటి పంపిని దారులుగా, పనిచేయుచుండెడివారు. కోలీలు యెక్కువగా సమీపమున బాలఘాట్ పర్వతశ్రేణికి పశ్చిమ ప్రాంత నైజాం రాష్ట్రి సరిహద్దుల లోను, నిజాంబాద్, నాందేడ్ జిల్లాల మధ్యభాగములోను, గోదావరి మరియు హైద్రాబాద్‌కు మధ్య నివసించెడివారు. మరియు నెక్కువ సంఖ్యతో నాగపూర్, బెంగాల్ నాగపూర్, గాక ఉత్తరప్రాంతము లైన రాజపుత్ర స్థానము, మధ్యప్రదేశము, ఉత్తరప్రదేశము, గుజరాత్, మహారాష్ట్రి, ఆస్సాం, ఇతర ప్రాంతములలోను గలరు. వీరి ముఖ్య స్థానము కపిలనగరము. కోలీరాజపుత్ వంశావలి చరిత్ర చూడుడు.

ముత్తరాచలే - కోలీలని శ్రీసిరాజుల్‌హాసన్‌గారు నిజాం రాష్ట్రి కులములు లేక తెగలు అనే గ్రంథమందు వ్రాసినారు.౧ మరియు ౧౯౪౧ జనాభగణన శాఖ నివేదిక (Census Report) వారు ఆదిలా బాద్ జిల్లాలోని కోలీలు. ముత్తరాసలమని చెప్పుకున్నట్లు చూపినారు.౨ మహారాష్ట్రిము (బొంబాయి) రాజాధానియందు, "రీవాకాంత" అను ఏజన్సీ యందలి యొక్క చిన్న సంస్థానము, ఇచ్చట రాజుకోలీ, అనగా ముత్తరాసజాతివాడు. పేరు తెలియదు. దీని విస్తీర్ణము ౪౨ చదరపు మైళ్లు. ఈ సంస్థానమునుదొకటే గ్రామము కలదు. జనసంఖ్య ౨౨౭౯. డౌలు ౫౧౬౧ ఈ సంస్థాన ప్రభువు సంవత్సరమునకు రు. ౧౩౪౪ బరోడా రాజైన గైక్‌వాడ్‌నకు చెల్లింపవలయును. ఈ గ్రామము పేరు అంఘాడ్‌యని యున్నది. పైరీవాకాంతజిల్లాలో అరుగురు పాళేగార్లు న్నట్లు కనబడుచున్నది ౩ క్రీ. శ. ౧౩౯౬ హరిహర II రాయచూరు

దొఁబెపై వున్నప్పుడు క్రిష్ణాకు ఉత్తరము ఒడ్డున (North bank of the Krishna) పైన కోలీవంశపు రాజులు ఎదురించువాండ్లుగ, ఒక హిందు నాయకుడుండెను. ఆ ఏదురించు కోలీనాయకులను అణచాటానికై హరిహర II వారిని గోండ్ రాజులైన కేరలవారి సహకారము తీసుకొనుమని మహమ్మద్ బిన్ తుగ్లక్ చెప్పినట్లు కనబడుచున్నది.* నిజాం రాష్ట్రి మందుండు తెలింగ లేక తెలుగువారు, తమిళులు, కన్నడలు, మలబార్ లోని మళాయాలీలు ఈ ద్రవిడజాతికి చెందినవారు, వింధ్య పర్వతములలోని గోండ్లు సీలోన్ లోని సింహ్మాణులు, వడ్డాలు మంగోలియన్ జాతియులు, మొదలగువారు కాకేసిక్ మాదిరిగ పొడుగన రక్త సంబంధముననుండి యుండువారు. పై తెలంగాలు మరియు గోండ్లు ఒక కోవకు జెందినట్టుగా కనబడుటకు నిదర్శనము కనబడుచున్నది. ద్రావిడులు ఎవరు? పుట. ౩౧ చూడుడు.

కోలీశబ్ద నిర్వచనము: కోలీ, కోల్, కోల, కోలార్యన్. ఒకే పదమునకు జెందినవి.

కోల: సం॥ రేగుపండు వి.దా.క.త (నిఘంటువు).

కోలీ: రేగుచెట్టు సం॥ కోలః, కోలిః, కోల్, బదరికా, బదిరి యనులు. రేగు సామాన్యమునకు బదర సేవిపలం అను పదములు.

అనగా కమ్మటి రేగుపండు అని చెప్పబడినది.= (ఆ.వి.పు.2780).

కోలీపురము: ఈ పేరు వరాహక్షేత్రము నుంచి వచ్చినది. వరాహక్షేత్రము తొల్లింటి (వ్యాఘ్రపురము). పురాణములందు విష్ణు దేవుడు, వరహ అవతారమెత్తిన తావు లేక (స్థలము) వ్యాఘ్రపురమని చెప్పబడినది. తర్వాత వరహావతారమునుండి దీనికి వరాహక్షేత్రమని పేరయ్యేనందురు పిదప కొంతకాలమునకు దానికి లేక నాపరిసరము నకు 'కోలీ' పురమని పేరయ్యేనని పరిశీలనలవలన తెలినది. కోలీపురము ను ప్రపటడ భూపాలుని రాజధాని. జవుసుడు బుద్ధమహాపతి, బుద్ధ

భగవానుని తల్లియగు మాయదేవికి తండ్రి. ఇప్పుడు బెంగాల్ నార్త్ స్టేషన్ రేల్వే, (B N.R.) పెనిచె, అను స్టేషనునకు తూర్పున రెండు మైళ్ళదూరమునకు "వాహోనది" యొక్క కుడివైపున.నదిపై కట్టబడిన రేల్వే వంతెనకరమైళ్ళు (అరమైలు) దూరమున "భారచతు" మను పేరుగల చిన్న గ్రామము. తొల్లింటి వరహాక్షేత్రమనీని (తొల్లి వ్యాఘ్రపురము)పొందియున్నారు.౭ ఆ.వి. (పు. 2909 - 10 Vol-6).

వీరి పుట్టు పూర్వోత్తరముల వివరములు, పై శబ్ద నిర్వచనమే గాకుండ శబ్ద వుత్పత్తి ననుసరించి కోలీ అనుపదము ఏలా వచ్చినదో అస్పష్టముగా నున్నది. మరికొందరు ఈ క్రిందివిధముగా తెలియ పరుచుచున్నారు.

"కోలీ" -కుల లేక "కున్బి" అనగా కుటుంబయజమాని, లేక కుటుంబ అను పదము నుండి వచ్చినట్లు అభిప్రాయపడిరి. కాని ఇది ఋజువుపరచలేనటువంటిది ఈ తెగ సభ్యులు వారి తేగ, రామాయణ గ్రంథకర్త అయిన వాల్మీకి వంశమునుండి వచ్చినదని చెప్పుదురు. మరి కొందరు వారి తెగ పురాణములోని సూర్యవంశరాజు భుజములోనుండి పుట్టినవాడు అనగా (నిషాద్)యొక్క సంతానమునుండి వచ్చినవారని. వారిని నూతనయుగములో (కిరాతకులు) అనుబడువారని చెప్పుకొందురు. పౌరాణిక కథలలో ఈ తెగయొక్క పుట్టుపూర్వోత్తరాలు కను గొనుటలో తోడ్పడలేవు.

కోలీల పూర్వ చరిత్ర :

కోలీతెగగురించి మొదటిసారిగా క్రీ. శ. ౧౩౪౦ సంవత్సరములో పేర్కొనబడినది. మహమ్మద్ తుగ్లక్ మొదటిసారిగా, పూనా దక్షిణ భాగములో పదిమైళ్ళ దూరములోనున్న (కొండన-లేక సింహ్మగడ్) అను కోట కోలీ తెగకు చెందినవారి అధిపత్యములో నుండెను. ఇతని పేరు "తానాజీ మాళవసూరే"(తానాజీ చూడుడు.) క్రీ. శ. ౧౩౪౭

సంవత్సరములో మరొక కోలీ తెగకు జెందినవారు "జహర్" అను పరిపాలించుచున్నట్లుగా కనుగొనిరి. తొమ్మిదిలక్షలరాబడి గలముప్పయి దుర్గములు గల (ఠాన ప్రాంతము) ఈ ఠానకు జెందిన రాజు H. H. యశ్వంత్‌రావు మఖ్వాన. ఇతను 1972వరకు పార్లమెంటు మెంబర్‌గా వున్నారు. వీరిని గురించి కోలీరాజపుత్ వంశవాలి చూడుడు. ఈ ఠాన ప్రాంతము బహుమాని రాజులకాలములో కోలీరాజుల అధీనములో నుండెను. కోలీరాజ్యమును "బావన్‌నావల్స్" లేక ఏబదిరెండు (౫౨) లోయలు గల ప్రదేశముగా పేర్కొనబడెను. ప్రతిలోయ ఒక నాయక్ అధీనములో నుండెడిది. ఈ నాయకులు బహామానిరాజుల కాలములోను అహమ్మద్‌నగరరాజుల కాలములోను, కూడ మంచి స్థానమును కలిగి యుండిరి. సర్దారులుగా, మన్‌సబుదార్లుగాను, చెలామణి అవుతుండెడి వారు, పదహారుశతాబ్దమధ్యకాలములో షాహజహాన్ చక్రవర్తి అహ్మద్ నగర రాజుల పతనముతదుపరి "టోడర్"మల్ సర్వేపద్ధతిని ఆక్రమించు కొనిన ప్రదేశములలో అమలులో పెట్టెను, దానిపై కోలీలు వారు భూములను అంతసూక్ష్మపద్ధతిలో కొలుచుటకు పన్నునునిర్ధారించుటను సహించలేక, కోపోద్రిక్తులైరి. 'భేనినాయక్' నాయకత్వంలో కోలీలు మొగల్ పరిపాలకులకు వ్యతిరేకముగా తిరుగుబాటు చేసిరి. దానిని మహా కఠినపద్ధతిలో అణచివేయవలసివచ్చెను. ఈ తిరుగుబాటును అణచి వేసినపిదప ఔరంగజేబ్, కోలీలనుదయాదాక్షిణముతో చూసియుండెను.

పేష్వాకాలములలో కోలీలకు పేరుప్రసిద్ధులు ప్రాప్తించెను. వారు కొండలపైనున్న దుర్గములను పట్టుటలో నేర్పు నైపుణ్యము, ధైర్యసాహసములు ప్రదర్శించి కీర్తిని సంపాదించుకొనిరి. పద్దెనిమిదవ శతాబ్దముచివరిభాగము బ్రిటిషు పరిపాలన ప్రారంభమయిన తర్వాత పేరుగాంచిరి.

ఈ కోలీలు ఎన్నో ఉప తెగలుగా విభజింపబడియున్నట్లు కుల ములు-తెగలు నిజాం డొమినియన్ అను గ్రంథమునందు చూడగలరు.

వారు ప్రదర్శించే ధైర్యసాహసములు అన్యోన్యమైనవిగా పేర్కొన బడెను. బ్రిటిషువారి అసలు సైన్యాని క్రీ. శ. ౧౮౬౦ లో ఉపసంహ రించుకున్నప్పుడు వారిస్థానే కోలీల పటాలాలను నియమించిరి. క్రీ. శ. ౧౮౬౧ సంవత్సరమువరకు వీరు కాపలసైన్యము బాధ్యతలను నిర్వహిం చిరి. ఈ పటాలమును రద్దుచేసినప్పుడు కొద్దిమంది పోలీసు బల్గములో చేరిరి. మిగతవారు గ్రామములలో పూర్వపు వృత్తులను స్వీకరించి ప్రశాంత జీవితమునకు అలవాటు పడిరి. (క్యాస్ట్ అండ్ ట్రైబ్స్, నిజాం డొమినియన్), మరియు వీరిని గురించి సెంట్రల్ ప్రావిన్స్ క్యాస్ట్ అండ్ ట్రైబ్స్ శ్రీ రస్సల్ వ్రాసిన గ్రంథమందు కూడ వివరముగా జూడగలరు. మరియు కోలీ వంశావలి చరిత్రయందు అతి ప్రాచీనచరిత్ర దొరకగలదు. (పుట. ౧౪-౧౫లో చూడుడు.)

Note : ౧ కులములు-తెగలు. నిజాండొమినియన్.

౨. ౧౯౪౧ సెన్సస్ రిపోర్టు హైదరాబాదు.

౩. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము Vole 6

౪. దక్షిణభారతచరిత్ర by ప. నీలకంఠశాస్త్రి.

౫, ౬, ౭. ఆంధ్రవిజ్ఞానము Vole 6. పుట ౨౭౮౦, ౨౯౦౯.

౮. కులములు-తెగలు, నిజాం డొమినియన్.

ఇరవై రెండవ ప్రకరణము

# సామ్రాట్ చక్రవర్తి యయాతి మహారాజు చరిత్ర

ముత్తరాచలు, ముత్తరాసలు, ముత్తరాజులు, ముత్తరయర్‌లు, అతిప్రాచీన రాజవంశముగా మనకు కనబడుచున్నది. కాని శ్రీ సామ్రాట్ చక్రవర్తియగు యయాతి మహారాజు యొక్క కథను, చంద్రవంశమునకు జెంది, ముదిమి మోసిన ముదిరాజు, షట్‌చక్రవర్తు లలో నొకరగుటచే, ముదిరాజులు, యయాతీ వంశీయులైన, తుర్వాసు నకో, లేక పురువు, మరియు పాండవుల సంతతీవారని చరిత్రకారులు చూపిన ఆధారములపై ఈ కథనుదహరింపవలసి వచ్చెను. తెలుగు గోంకచోడలు, వైదుంబ ముత్తరాసలు, గంగవాడి ముత్తరాసర్‌లు కూడ వీరి వంశమువారనుటచే మన చరిత్రలో చూపనైనది.

## యయాతి మహారాజు చరిత్ర

బ్రహ్మ మానసపుత్రులలో రెండవవాడు శ్రీ అత్రిమహా ఋషి, భార్య అనసూయ, వీరికి చంద్రుడుదయించెను. ఆతనికి బుధుడు భార్య ఇలాదేవి, సూర్యుని చెల్లెలు వీరికి పురూరవుడు జన్మించెను. పురూరవు-భార్య ఊర్వశీ, వీరికి ఆయువు లేక నహుషుడు పుట్టెను. నహుషునకు - భార్య శ్రీదేవికి సామ్రాట్ చక్రవర్తి యయాతి మహా రాజు కలిగెను. నహుషుడు ఇంద్రప్రస్థానము పై రాజ్యపాలనము చేసెను. యయాతి షట్‌చక్రవర్తులలోనొకండు. యయాతి మహారాజు నకు ఇద్దరు భార్యలు, (౧) శ్రీ దేవయాని, శుక్రాచార్యుల కూతురు. (౨) శర్మిష్ఠ తండ్రి ధనుజేంద్రుడు లేక వృషభుడు. దేవయాని శుక్రా చార్యుల యాజ్ఞానుసారము పెండ్లాడెను. శర్మిష్ఠ క్షత్రియ వంశీయు రాలు, దేవయానితో, దాసిగా నుండుటవలన, యయాతికి అమెపై

వున్న అనురాగముతో గంధర్వ వివాహమాడెను. దేవయానికి యదు, మరియు తుర్వసుడను ఇద్దరు కలిగిరి, శర్మిష్ఠకు (౧) దృహ్యుడు (౨) నుహ్యుడు (౩) పురువు ముయ్వరును పుట్టిరి. యయాతి రెండవభార్య క్షత్రియకులమునకు జెందిన శర్మిష్ఠకు పుట్టిన మొదటి కుమారుడగు దృహ్యునకు పట్టాభిషేకముకట్టుటకు దేవయానితో తెలిపెను. దేవయాని తన కుమారులకు అన్యాయము జరుగుచున్నదని, న్యాయముచేయుమని తన తండ్రి శుక్రాచార్యులతో తెల్పెను. నంత శుక్రుడు తన కూతురు కొడుకులకు అన్యాయము జరిగినదని ఆగ్రహావేశుడై శ్రీయయాతి మహారాజును, "నిన్ను వనితాజనహేయంబయిన ముదిమి నొందుడని శపించెను."

(మహాభారతము -పుట. ౫౪౮).

యయాతి తనమామయైన శుక్రునితో, 'నీ కూతురున నింకయు వయస్సు, నామే కోరికలెట్లు నొనర్తును' యని అడిగెను నంత దేవ యాని, నిజమును తేలుసుకొని తన తండ్రి శుక్రునితో తన భర్త శాప నివారణకు బ్రతిమాలుకొనగా, శుక్రుడు తన తొందరపాటును తెలుసు కొని తన ముదిమిని, తన కుమారులలో ఏవరు గైకొందురో, వారిలేత ప్రాయము నొసగుదురో నప్పుడు శాపము నివారించునుగాక, యని చెప్పెను. యయాతి తన కుమారులతో తన ముదిమితనమును తీసు కొనుటకు వేడుకొనెను. వారందులకు వొప్పుకొనలేదు. యయాతి తన చివరి కుమారుడగు పురువును ఈ విధముగా వేడుకొనెను. 'పిన్నవు గాని నీవు కడు పెద్దబుద్ధులయందు రమ్ము, నా యాజ్ఞ దాటవుగదా! నీతిమంతుడివి నీవు, నీ యన్నలు చెప్పినట్లు పరిహారము చెప్పవుగదా ! నా ముదిమిని గైకొని నీ తల్లితో నుండునట్లు చూడు పుత్రకా ! యని పలికెను.' పురువు తన తండ్రి యయాతితో, అయ్యా ! నన్ను ఎందు లకు వేడెదవు, నీవు తండ్రివిగదా ! ఆజ్ఞాపింపుము, పరిహారము చేకొను టకు ఆశీర్వదించుము. అన్యాయిని గాను, నీ ముదిమిని తప్పక దాల్చి

కొని నా లేత శరీరమును నీకిచ్చెదను, నా తల్లితో నిన్ను చూచెదను. అని పలికె పురుండు.

ముదిమి సేకొని తన లేత ప్రాయంబు యయాతికిచ్చెను. యయాతి ధన్యుండయ్యెను. (మహా భా. పుట. ౫౫౯).

"యయాతి తన భార్య దేవయానితో ముదిసెను. దంతావళీయును, ముదిసెను వెంట్రుకలు, తనువు ముదిసినది. కాని ముదియనివి రెండు చిక్కనవి బ్రతుకు తీపియు, విషయపక్షములున్ అని తెల్పెను" దుహ్యునకు పూర్వభాగము, యదువునకు దక్షిణభాగము, తుర్వసునకు పశ్చిమభాగము. ననువునకు ఉత్తరభాగము సంరక్షింపుడని ఇచ్చివారల సమక్షమునందు నాలుగుదిక్కుల అగు నేలయు, పాలింపుమని నలుగురికి పంచెను. భూలోకము నేలుమని పురువునకు పట్టాభిషేకము కట్టెను. యయాతి పురువునకు రాజ్యంబిచ్చిన తర్వాత పెక్కు వర్షములకు బ్రతికి ఇంద్రియసుఖంబుల విసర్జించెను.

భారతదేశమా ! నీవు జన్మమిచ్చిన పురునివంశంబున బుట్టిన వారి యశోలంకారుల ధీరత్వము, తేజోధనులను వినుపింతును, శ్రీపురువునకు జనమేజయుడు, నతనికి ప్రాచీన్వాసుడు, నతనికి నాప్రాచీన్వాసుడు, నతనికి ప్రవిరోధనమనువు, నతనికి జారువు, నతనికి సద్యువు, బహుళయరుడు, శర్వతియు' సంయాతియు, రౌద్రాశ్వుడు, ఘ్నవాచియును, (మహా భా. పుట. ౫౯౩).

వీరేగాక ఋతేపువునుండి-దుష్యంతునివరకు పుట్టినారు. దుష్యంతుడు పురువంశమునుండి తుర్వసుని సంతతివారికి దత్తుగా పోయెను. దుష్యంతునికి భరతుడు, ఇతని కాలమునుండి భరతఖండముగా పేరు వచ్చెను. భరతునికి -భుమన్యువుడు, నతనికి బహత్క్షత్రుడు, నతనికి సుహోత్రుడు, నతనికి హస్తి మహారాజు, ఇతను హస్తినాపురమును కట్టించెను. నతనికి అజామీడుడు, నతనికి ఋశెతుడు, నతనికి సంవరు

ణుడు, నతనికి కురువు, నతనికి జహ్నువు, వీరి సంతతివారు శంతనుడు, నితని వంశము వారు కౌరవులు, పాండవులు), (౨) పరీక్షితుని వంశము వారు రెండవ జన్మేజయుడు, వీరినుండి అశ్రితునివరకు పాండవ వంశీకులుగా నేంచిరి. నప్పటికి కలియుగము ఏర్పడినట్లును. తర్వాత కలియుగమున, అశ్రితునకు చేర, చోర' పాండ్య వంశీయులు పుట్టిరని, వారివారి రాతి శాసనములలో వ్రాసుకొనిరి.[౧] మరియు ముదిరాజులు సామ్రాట్ యయాతి చక్రవర్తినుండి ముది తనము వచ్చినది. కనుక ముదిరాజులు అనగా ముత్తరయన్లను తమ తమిళ శాసనములలో పాండవవంశీయులనియు వీరు యిప్పుడువున్న పాండ్యులకు చెందనివారని చూపినట్లు చోళ శాసనము విశదీకరించిన వ్యాసములో చూపనైనది. ఈ శాసనమును ధృవకరించినవారు శ్రీ ప్రొఫెసర్ S. T. E N. Know PhD. and F. w. Thomas, M A. (Hons)PhD. No. 10 Sendalai piller Inscription. మరియు By K. V. SubramaniyamAiyar, B. A. M. R. A. S., Ootakamund. (EPI Vole. No. XIIl, 1915-16 Pages 113 to 149). మరి కొందరు తుర్వసుని సంతతివారని చూపినవారు, రాజగోపాలరావు, మరియు శ్రీ ఎడ్గర్ థర్స్టన్, కులములు లేక తెగలు చూడుడు.

(ఆంధ్రవిజ్ఞానము.)

మొత్తముమీద ముదిరాజులు పాండవవంశము అయినను, కాకున్నను వారి శబ్ద నిర్వచనముతో చూచిన, కృతాయుగము నుండి పదవి అలంకరించినవారుగా శబ్ధధాతువే ఋజువుపరచుచున్నది.

మహాభారతమందు చూపిన యయాతి నలుగురు కుమారులను జాతిభ్రష్టులుగా, అగమ్యగామి, మాంసాహారి, పశువుల వృత్తివారుగా, మ్లేచులుగా మారిరి. మరియు ఐతేరేయ బ్రాహ్మణములో ఈ విధముగా జూపిరి.

---

Note : ౧. మహాభారతము పుట. ౨౪౮, ౨౫౩.

మహాఋషి విశ్వామిత్రుడు ఎక్కడనుండియో ఒక పిల్లవానిని తెచ్చుకొనిరి. అతనిని తనవందమందికుమారులలో ముఖ్యునిగా చూచెను. అందుచే ఏబదిమంది కుమారులు తండ్రి మాటకు బద్ధులు గానందున మహర్షి క్రోధియై వారిని దక్షిణ దేశమునకు పంపెను. వీరే ఆంధ్ర, పుండ్ర, పులింద, శబరులు అనే రాక్షసులుగా మారిరి. ఇది బ్రాహ్మణులతో, ఈ బ్రాహ్మణులనుండి రాక్షసక్షత్రియులుగా మారిరి మరియు కిరాత, యవ్వన, శఖాః: వీరు నేపాలు, భూటాన్, మరియు మంగోలీయాలో మూలపురుషులుగాయైరి. (వైదిక్ సంపత్తి పుట. 330). మరియు ఆంధ్రులు ఆంధ్రాలయ అనగా ఆస్ట్రేలియా ప్రదేశమునకు పోయిన రాజు 'తృణబిందు'. మరియు ఆస్ట్రేలియానుండి కోలార్యన్‌లు మరియు ద్రవిడులుగా, రామాయణ కాలమునకు పూర్వమే వచ్చిరని చూపియుండిరి.౩

— o —

౨ E P. I. Vole. No. XIII. 1915-16. pages-133 to I49.

౩. వైదికసంపత్తి పుట- 330.

## ఇరవైమూడవ ప్రకరణము

# ముగింపు

ముత్తరాజుల చరిత్ర ముత్తరాజ వర్ణమును గురించి నా చిన్న తనము నుండి తెలుసుకొన వలెననియు మరియు తెలుగుదేశము నకు తెలియపరుచవలెనని నాకు చాలకాలమునుండియే కుతుహలముగా నుండెను. ఒకరోజు నేను ఆంధ్రసచిత్ర వారపత్రిక ఉగాది సంచిక ౧౯౬౮ ప్రచురించిన సంచికలో గాక తేది ౪-౪-౧౯౬౮ మరియు తేది ౧౫-౪-౧౯౬౮ సంచికలలో శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు (తెలుగు వారెవరు?) అను వ్యాసములో ముత్తరాజులు అనగా (ముత్తరయర్ - ముదిరాజులు) మూడుతరములవారు అనియు. వారు పాండ్యరాజులను అణచిపెట్టి ఆరవశతాబ్దమున మధుర నేలిన వారని తెలిపియున్నారు. తర్వాత ౧౯౨౨లో ప్రథమ ముద్రవేసిన పుస్తక ములో ముదిరాజుల ప్రారంభచరిత్ర చూడుడు.

ఆనాటి మహాభారతము, భాగవతములలోని కథలును, మరియు కులములు లేక తెగలు దక్షిణభారత ప్రాంతము మరి నిజాంరాష్ట్రము, మరియు సెంట్రల్ ప్రావిన్స్ యొక్క ప్రభుత్వ సమాచారములు సేక రించి నివేదించి. చూపిన కథలను, సరియైనవి అని నమ్మిన - నమ్మక పోయినను ఈనాటి తామ్ర - శిలాశాసనములద్వార లభించు ఆధార ములు, మరియు శబ్ద నిర్వచనములతోను, తెలుగు, తమిళ పండిత పరిశోధనాధారములుతోను. చరిత్రకారుల భిన్నభిన్న అభిప్రాయముల తోను, పాశ్చాత్య పండితుల గ్రంధములనుండి వెలికితీసిన వాఖ్యానము లనే గాక గ్రామ నామములుతోగల వీరికి సంబంధములు, తెగకు - తెగ కలుపుట వారి మూలనివాసము, అధికారములు, పరిపాలన యోగ్యతలు మున్నగువానిని పరిశీలించిన, తర్వాత ఈ చరిత్ర వ్రాయ

నైనది. గత పదిసంవత్సరములలో ఈ పరిశోధనలవలన దొరికిన సమాచారము కొండను త్రవ్వితే ఎలుక బయటపడినట్టుల కనబడుచున్నది. రమారమి ఐదువందల గ్రంథములేగాక ప్రభుత్వపు జనాభా - గణన నివేదికలు (Censes Report) ౧౮౫౧ నుండి ౧౯౫౧ వరకు మరియు జిల్లా మాన్యువెల్స్‌నుండికూడ సంకలను చేయవలసి వచ్చినది. అప్పటికి అసలు చరిత్ర పూర్తికాలేదు. ఈ కుల చరిత్రకు సంబంధించిన రాజుల, వారి పరిపాలించిన భూభాగములు, తెలుగుదేశము చరిత్రలలో దొరకనందున, నిరాశ చెందినవాడనైతిని. తర్వాత మద్రాసుకు చెందినవారు కీ. శే. వరదరాజులుగారికి ఒక పోస్టుకార్డు వ్రాసినతోడనే రూ. ౧౮౦ (ఒకనూట ఎనభై రూపాయలు) తమిళ గ్రంథములు మరియు చరిత్ర పుస్తకములు స్వయముగా తీసుకొనివచ్చి యిచ్చినాడు. అట్టి తమిళ గ్రంథములు, మరి చరిత్రములనుండియే సరియైన చరిత్ర దొరికినది. వారికి నేను మరియు మనకులము వారు ఋణముయున్నమని చెప్పక తప్పదు, వారికి నా హృదయ పూర్వ జోహార్లు.

కనుక కాలము నెక్కువ తిసుకొనుట, మరియు తమిళగ్రంథ ముల నుండి - ఇంగ్లీషు మరి తెలుగు భాషలోకి అనువదించుటవలన ఆలస్యము జరిగినది. మనకు కావలసినది మూలము, కనుక అమృత ధారాళముగా ఇందులో చూపబడినది.

కులములు లేక తెగలు దక్షిణభారతదేశము యొక్క గ్రంథములు మరియు కులములు లేక తెగలు నిజాండోమినియన్ గ్రంథములలో చూపిన ప్రకారమునే, వేరువేరు పేర్లతో చూపబడినది. మరి ఈ అన్ని తెగలుకూడ నొకటిగా నెంచవలయును. మరి ఉరలీలు, వారన్‌లు, జెడరు, కబ్బలగిరిలను చూపబడలేదు.

ముత్తరాచలు (ముత్తరయర్) అనగా ముదిరాజులు, భగవాన్ గౌతమబుద్ధునికన్న పూర్వీకులని తెలియుచున్నది. కులములు లేని

సమయమున అధికార హోదానుకలిగి ప్రజారక్షకులుగా నిలిచి, 'ముత్తదా' యను బిరుదముతో కొనసాగినవారు. కృతయుగమునుండి ద్వాపరయుగమువరకు వీరుఎవరన్నది తెలియదు.కాని భగవాన్ బుద్ధుని నిర్యాణమునకు పూర్వము మధురైలో "ముత్తర వంశరాజు" వున్నట్లును, అతని కూతురు, 'ముత్తరవంశ కన్యను', ఇక్ష్వాకుల విజయాలుడు వివాహమాడినటులను, బుద్ధుని నిర్యాణము అయినతోడ ఇక్ష్వాకుల విజయాలుడు తన దూతచే రప్పించుకున్నట్లు మధురై మాన్యువెల్ చరిత్రలోను, మరియు మద్రాసు మాన్యువెల్ చరిత్రలోను కనబడినది. మధురై రాజ్యపాలకులయందు చూడుడు. మరి త్రేతాయుగమునకు పూర్వము ఇక్కడ కోలీలుగా, లేక కోలార్యన్లుగాను కనబడిరి. ఈ కోలార్యన్లు ద్రావిడులు ఆస్ట్రేలియానుండివచ్చినట్లు చూపినముగదా, అందుముందాలును గాక వీరితోపాటు శబరులు, యక్షులు, శిశుదేవులు, మరి మృద్రవాచ(రాజులనే)వారుకనబడిరి. అప్పటికి నాగులనేవారువచ్చియుండిరా ? కాని ద్వాపరమునకు దక్షిణభారతదేశములో చేర, చోళ, పాండ్య అని కనబడుచున్నారు. పాండవులు రాజాసూయయాగమును చేయునప్పటికి కావేరి అవతల వొడ్డునయున్న ఉరయూరును రాజధానిగా చేసికొనియున్న మొదటి చోళ రాజుకూతురైన ఊలూచీని అర్జునుడు వివాహమాడినట్లు కనబడుచున్నది. చోళులు ద్వాపర యుగమున కనబడినప్పటికి, కలియుగమున వీరు కావేరి ఆవుతల వొడ్డున నున్నవారు. వీరు 'కరికాలచోళుల' మని, సూర్యవంశము వారమని శాసనములో చెప్పుకొనిరి. మరియు క్రీ.శ. రెండవశతాబ్దమునకో లేక మూడవ శతాబ్దమునకో, వీరు కళభ్ర ప్రభువులతో పోట్లాడి, పుహారునకు రాజాధానిగ మార్చిరి. తర్వాత తెలుగుదేశము రేనాడునకు పాకి, తెలుగుచోళఎలుకలముత్తరాజులుగా చలామణిగనైరి. వీరిశాసనము క్రీ.శ. ౬వశతాబ్దమున మొట్టమొదటి తెలుగుశాసనముగాకనబడుచున్నది. వీరు 'అరవలు' అరవమనగా తమిళములో (పాము) యని చూపి

యుంటిమి. కాన చోళులు కరికాల వంశమువారగుటచే, 'కరి - నల్ల - కాల - నాగు'లని అర్థము నిచ్చును, కాన వీరు కూడ నాగులని తెలియనగును.

పాండ్యులు మధురై పరిపాలకులు. ద్వాపరమున మొదటి పాండ్య రాజుకూతురగు 'ఉర్మిల'ను అర్జునుడు వివాహమాడినట్లు మహాభాగ వతమందు కనబడియున్నది. ఊర్మిల నర్జునకు పుట్టినవాడే బభ్రువాహ నుడు. అతని సంతానమే నేటి పాండ్యరాజులు, తమ శాసనములో చెప్పుకొనిరి. ఈ పాండ్యులను 'ఫణిలు'గా శ్రీ పండిత రఘునందన్ శర్మ చూపిరి. ఫణి అనగా పడిగే లేక పాముయని చెప్పుదురు. మరియు ౧౧వ శతాబ్దమున దొరికిన నాగభీమరాజు శాసనములో, వారి వంశము పరంపరా చూపుతు "ఫణీశ్వర"యనియే తెలిపియున్నారు. కాన పాండ్యులు నాగజాతికి జెందినవారనియు తెలియనగును. చోళులు, పాండ్యులు వీరు ద్వాపరమున దేవనాగులనియు, కలియుగమున మణి నాగపుర వాసులనియు, వారి శాసనములద్వార తెలియుచున్నందున చరిత్రకారుల సమ్మతము.

కరికాల చోళుడు మొదట ఉరయూరు నుండి పాలించెను. కాని ఉరయూరును వదలి రాజాధానిని కావేరి పట్టణమునకో లేక పూహార్ నకో మార్చినట్లుగా తమిళ గ్రంథములు తెలుపుచున్నవి. ఈ విధముగా రాజాధానిని మార్చుటకు తగిన కారణములు లేకపోలేదు. ముఖ్యముగా రాజకీయ రక్షణ అవసరమునుబట్టి ఈ పని జరిగియుండవచ్చును. ఈ కరికాల చోళుడు కోదంబలూరు అధిపతి అయిన ఇరుంగోల్లవతో పోట్లాడినట్లు తమిళ గ్రంథమందు గలదు. కొదంబలూరునకు ఉత్తర ప్రాంతము ఇరంగులకు - చోళులకు రణరంగముగా నుండెను. ఇరంగు లను కరికాల చోళులు వోడించిరి. ఇక్కడ ఇరుంగు లను వారు ఎవరు ? ఇరుంగులును వారు కళభ్రులకు జెందినవార ? ఇరుంగు వేళార్ లనియు కలరు.

ఇలంగో ఆరైయన్ (అలియాస్) మారన్ - పరమేశ్వరన్ అను
ముత్తరయర్ కలదు. వీరు కొడుంబలూరు సర్వస్వతంత్రులుగా నుండి
ననో, మరి పాండ్యరాజ్యమువరకు పాకిన దువల్లనో, కరికాలుడు
వారితో యుద్ధములు చేసెను. తర్వాత వీరు చోళ ప్రాంతమును వదలి
పుహార్ నకు వచ్చిరి. అటునుండి క్రీ. శ. రెండవ లేక మూడవ శతాబ్ది
మున తెనుగు రేనాటికి వచ్చిరని శిలాశాసనములో కనబడుచున్నట్లు
చూపియుంటిమిగదా, మరి వారు తెలుగు రేనాటి చోళ ముత్తరాజుల
మని వ్రాసుకొనిరి. ఇక్కడ పరిశీలించవలసియున్నది. చోళులు కావేరి
నివాసులు, అనగా తమిళులు. ఎట్లు తెలుగు ముత్తరాజులుమని సంబో
ధించుకొనిరి ? కరికాల చోళులు అనగా "నల్లనాగులని" అర్థము. (కాల
కంఠీశ్వరయని ఈశ్వరునికి యొక పేరు.) కనుక చోళులు ఆరవలనియు
కూడ కలదు. మరియు తిరువలుంగలు - చోళులు పాండ్యులు ఒకటైన
ప్పటికి, వంశములు వేరుగా చూపుకొనిరి. క్రీ.శ. తొమ్మిదవ శతాబ్దమున
తెలుగు రేనాటి చోళుడైన విజాయాలుడు, తంజావూరును రాజా
ధానిగా చేసుకొనుటకు సమయమును చూసి, తంజావూరు ప్రభువైన
(శ్రీ) విడెల్ విడుగు ముత్తరయర్ రాజు V వానితో యుద్ధముచేసి,
తంజావూరు రాజాధానిని ఆక్రమించుకొనిరి. పల్లవులు మరి పాండ్య
రాజైన వర్గుణవర్మ వారికి ఎట్టి సహాయము, ముత్తరయర్ రాజులకు
లభించనందువల్ల వోడిపోయిరి. మరి ముత్తరయర్ రాజుకూడ ఎవరి
సహాయమును కోరలేదు. తర్వాత చోళరాజుల పరిపాలనలో, ఇరుక్కు
వేళార్, ఒక రైతు కుటుంబము (వ్యవసాయకులము) వారు వారితో
సంబంధములు చేసుకొని, తర్వాత చోళ రాజ్యములో ఉన్నత పదవు
లకు నాక్రమించియుండిరని తెలియుచున్నది. వీరు కొడుంబలూరులో
నుండినందున, పాండ్యులతోను, మరి చోళులతోను సంబంధము కలియుట
చేత వీరు నాగవంశము (Nagarace) వారని కావేరికి ఉత్తరమునున్న
తంజావూరు కంచీలోనున్న పల్లవులతో నున్నందున పల్లవరేస్ (palla-

va-race)యనియు వారే తెలుగు ముత్తరాసలు లేక (తెలుగు ముత్త రాచ) యని శ్రీశ్రీనివాసయంగారు తమిళ వరరులను గ్రంధమందు తెలిపినారు. కళభ్రులు చోళులకు, పాండ్యులకు దొడ్డవిరోధులనియు తెలియుచున్నది.

మధురనేలిన కళభ్రులు, మరి చోళులతో కూడ యుద్ధములు చేసి పుహార్‌ను మరియు కొడుంబలూరును నాక్రమించిరని తెలియుచున్నది. అప్పుడే ఈ చోళులు దక్షిణమునుండి ఉత్తరమునకు వలసవచ్చి యుండిరనియు మరియు దక్షిణమునకు వలస పోయిన తెనుగు కళభ్ర ముత్తరయర్ రాజులతో సంబంధములు కలియుటచే, వారుకూడ తెలుగు రేనాటి చోళముత్తరాజులమని చెప్పుకొనియుండవచ్చునని తేలినది.

కళభ్రరాజులు పైముగ్గురు గాక క్రీ. శ. రెండవశతాబ్దమునుండి ఆరవ శతాబ్దమువరకు మధురైకు వలసపోయి రాజ్యము చేసినట్లు కన బడుచున్నది. పేర్లు కానరాలేదు. వారి కాలమానము, ముందే చూప బడియున్నది. మరియు 'పెరుముత్తరయర్' అను రాజు తంజావూరును పరిపాలించినట్లును, ఇతను పూర్వపు రాజవంశమునకు జెందినవాడని శ్రీ టి. వి. సదాశివ పండరాత్తర్ గారు చోళచరిత్రలో చూపిరి. మరియు 'నాలడియార్' అను గ్రంధమందు జైనసన్యాసి వ్రాసినాడు. ఇతను క్రీ. శ. మూడవశతాబ్దమువాడని తెలియుచున్నది. ఇతని సంతతి వారు (౧) పెరుంబిడుగు ముత్తరయర్(అలియాస్) కువహన్-మారన్ (౨) ఇలంగోవాల్ ఆరైయన్(అలియాస్) మారన్-పరమేశ్వరన్, (౩) పెరుంబిడుగుముత్తరయన్(అలియాస్)సువరన్-మారన్, ఇతనికి కళవర కావలన్, కళభ్రకావలన్ అని ఐదుబిరుదములున్నవి. ఇతను పల్లవసామం తుడై పాండ్యరాజులను అణచిపెట్టి మధురనేలినవాడు. క్రీ. శ. మూడవ శతాబ్దమునకు పల్లవులు కంచికి బయటినుండి వచ్చియుండిరని, మరి వారి సామంతులుగా నుండిన ముత్తరయర్లుకూడ ఆ శతాబ్దమువారని తేలినది. మరి వీరి సంతతివారు క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దము వరకు

తంజావూరు పట్టణమును పాలించినట్లు కనబడుచున్నారు. వారి కాల మానము ఆరవశతాబ్దమునుండి తొమ్మిదవశతాబ్దమువరకు డా॥ రాజ మాణిక్యంపిళ్లేగారు నిర్ణయించినట్లు, పాండ్యరాజుల చరిత్రలో కనబడు చున్నది. ఇదియంతయు నిజము కనబడుటలేదు. కంచిలో పల్లవు మల్ల రాజునకు కిరీటము ధరించు ఉత్సవములో గొప్పగా పేరు పొందిన "కడక్క ముత్తరయర్" ప్రాముఖ్యత చెప్పుకోదగ్గది. కాన వీరు పల్ల వుల కన్న పూర్వ నివాసమే యుండినట్లు కనబడుచున్నదని నా ఊహ. కాని వీరి సమకాలికులు, గంగవాడి ముత్తరాసలు. వీరి మూలపురుషుడు "శ్రీపురుషముత్తరాసర్" క్రీ. శ. నాల్గవ శతాబ్దము వారు. చాలుక్య రాజు క్రిష్ణ I శ్రీపురుషముత్తరాసర్‌ను వోడించెననియు మరి అతని కుమారుడు శివరామ ముత్తరాసర్ చాలుక్యులనుండి తిరిగి సంపాదించె నని తెలియుచున్నది. మరి వీరి సంతతివారు గట్టిగా తెలియరాలేదు. కాని గంగవాడిముత్తరాసలు చాలుక్యలతోటి మరిపాండ్యులతోటి వోడి చిందరవందరంగానై పోయిరి. తంజావూరు ముత్తరయర్ రాజు, వర్గుణ వర్మ పాండ్యరాజుతో సంబంధములు ఏర్పడినందువల్ల, పల్లవులతోట కొంతస్నేహము సన్నగిల్లినందున, చోళరాజైన విజయాలుడు తంజ వూరు నాక్రమించి చోళరాజ్యమును విస్తరించెను.

కళభ్రరాజులు తెనుగుదేశమునుండి క్రీస్తుకు పూర్వము వ[illegible] పోయి, చోళరాజ్యమును సంపాదించి రాజులుగా నేలిరి. తర్వా[illegible] పాండ్యదేశమునునాక్రమించి మధురైను పరిపాలించినవాడు ముత్రిన[illegible] నార్ యని పెరియ పురాణము వల్ల తెలియుచున్నది. ఇతని స[illegible] వారే కళభ్రరాజులు. వీరు క్రీ. శ. రెండవశతాబ్దము నుండి ఆరవ[illegible] బ్దమువరకు చోళ, పాండ్య రాజ్యములను నేలిరి. వీరినిగురించి ౨వ[illegible] రణమున చూపియున్నాము. తర్వాత క్రీ. శ. మూడవశతాబ్దము పూర్వము పెరుముత్తరయర్ తంజావూరు పాలించినట్లు(నాలడియా[illegible] గ్రంథము చూపుచున్నది. ఇతని సంతతివారే తొమ్మిదవ శతా[illegible]

వరకు చోళులను, పాండ్యులను వోడించి పరిపాలించినటుల ముత్తర యర్ నాడును బట్టి తెలియుచున్నది. వీరు మూడు ప్రాంతభాగము లను పరిపాలించినందున, ముత్తరయర్ నాడు యనియు మరి వీరిని ముత్తరయర్ రాజులుగా ప్రబలిరి. ఈ కళభ్రలు ముత్తరయర్లు తెనుగు దేశమునుండి వలస పోవుటకు ఎవరును కారణం చూపలేదు ? కారణం లేకపోలేదు. కనుక పై చరిత్రలు, శబ్దనిర్వచనము, విభిన్న అభిప్రాయ ములు కులము లేక తెగలు యొక్క ననుసరించి చూచినచో, ముత్త రాచలు తెనుగువారిలో మొదటి ఆధిపత్యము వహించువారగుటచే, వీరిని ముత్తరాస, ముత్తరాచ, ముత్తరాజు, ముత్తరయర్ అనగా ముది రాజులు రాజ్యములను పరిపాలించిన పూర్వపు లేక ప్రాచీన రాజ వంశముక్షత్రియులని చరిత్రకారుల సమ్మతమునొందినట్లు చెప్పవచ్చును. ముత్త=కుల పెద్ద అనగా (చౌదరీలు) యనియు లేక గ్రామపెద్దయ నియు తమిళ గ్రంథముల ద్వార, శాసనములద్వార తెలియుచున్నది. వీరు తెనుగు ముత్తరాజులు యని చరిత్రకారుల సమ్మతము." నేటి మద్రాసు పట్టణము ముందరాజ పట్టణమని, మద్రాసు చరిత్రయందు కనబడినదిగాన దీనికి ఒక నిదర్శనమని తెలియుచున్నది. శ్రీ విడెల్ విడుగు ముత్తరయర్ V, చోళవిజాయాలునితో వోడిపోయిన తర్వాత వీరు చిందరవందరమై, ఇరుక్కు వెళ్ళార్‌లతో కలియుటచే, వీరిని రాజవంశము కానివారలుగా పేర్కొనబడినట్లు కనబడుచున్నది. ఇదియేగాక నాటి వెళ్ళార్లు అనగా కాపులు (కృషివలులు) భూస్వాం దులు. వీరు ఆర్థికములో బలముగా నున్నందువల్ల వారిని శూద్ర జాతిలో గొప్పవారని, నేడు చూపుచుండిరి. ముత్తరయర్‌లు లేక (ముత్తరాజులు) తమ రాజ్యములు పోయినతర్వాత భూములు పోగొ ట్టుకొని ఆర్థికముగాను మరి ఆచారవ్యవహారములయందు క్షీణించియుండి నందున, దిగజారిన శూద్రులనియు, నిఘంటువులలోను, మరి తెగలు లేక కులములు అను గ్రంథములయందు చూపబడిరి. యజ్ఞకాలము

నందును, మరియు నేటి వృత్తులతో పరిశీలించి జూచినట్లు అవుతే వీరికి, నాటి క్షత్రియ వృత్తియే కలిగియుండిరి. ఇదియే గాక గ్రామముల యందు దసర ఉత్సవమున, గ్రామ జండావద్ద ఒక మ్యాకను కత్తితో బలి చేయుట వీరి హక్కుగా భావించుట నేటికి కలదు. ఇక్కడ ఒక చిన్న కథ. చిందులవారు లేక చిందులవారు జాంబవంతుని వేశము ధరించి అన్ని కులములను లెక్కించుచు, "నావారు" యని చెప్పును. ఈ ముత్తరాసలను అన్ని కులములకన్న ముత్తమంత పెద్ద కులముయని చెప్పును. ఇదియంతయుచూడగా వీరు క్షత్రియులనియేచెప్పవలెను. మరి వీరి శాసనములోకూడ, పెద్దకులమువారని(Higher class)అని కలదు. ఇదియునుగాక శ్రీకృష్ణదేవరాయలు వీరికి సరిహద్దులుకాపాడువారుగా (కావల్ గార్) అని కన్నడములో బిరుదము లిచ్చి యుండెను. వీరు సామంతరాజులని (Feudals) అని చెప్పవచ్చును. క్రీ. వె. ౧౪వ శతాబ్దమున పాళెగార్లుగాను తమ కులకట్టు ధర్మశాసనమున కనబడి యున్నారు, అట్టిపై చూపినరాజవంశమువారు, లేక రాజబంధువులుగా బిరుదములను అలంకరించినవారిని, నేడు గ్రామ కావలి కార్, బంటు రాజులను, బంటుగాను, మన్నెదొరలను మన్నెవారుగాను, త లను గ్రామ తలారిగా పిలుచుట తప్ప, కులవృత్తియన్నదికాదు. చిన్నజూపుగా నెంచిరి. ఈ ముత్తరాజులు, కశ్రథలు, మరియు స రాజులు తమరాజ్యములను పోగొట్టుకొని, నేటిరోజున రాజ్య గాను, భ్రూభ్రష్టులుగానువారైరి. రాజ్యభ్రష్టులైన రాజులు, వా పతులు, మంత్రులకు అడవియే శరణ్యమగును. అరణ్యములో చుటచేత, మృగములను వేటాడుట, వ్యవసాయ, నానావృత్తి చేపట్టుటవలన వీరు అడవిజనులుగా (Aboriginists)గా లెక్క తర్వాత వారి భూములన్నియు పెద్దజమీందారులు, మరియు భూ ముల స్వాధీనము అగుట వలన వీరికి ఆర్థికమున అధ్వాన్నస్థితిని నే వారికి వారికే తగాదాలు, ఈర్షలు పురిగొల్పి సంఘటిత భావన

రాకుండ, మెలగకుండ వారితో వట్టిచాకిరీలు, వారి యింటిముందు బంటులుగా, నమ్మదగినవారుగ, విశ్వాసము జూపి, వారిని రాచకార్యములయందు రాకుండ అనగద్రొక్కి, వారికి వారే రాజకీయములలోగాని, అధికారములోగాని ముందంజవేయుచుండిరి. పెద్ద సంఖ్యగల ఈ తెలుగు ముత్తరాచలు (ముదిరాజులు) నొకటిగా నుండుట దుర్లభము, మైనారిటి (స్వల్ప) వారైన పెద్దలు సామ్యావాద వ్యవస్థలో ఆశలు జూపి, వర్గవర్గములుగా విభజించి, వారికి కావలసినవారినే దగ్గరగాదీయుట, నేటికి సామ్రాజ్యవాదులు ప్రజాప్రభుత్వములో అలంకరించుచున్నారు. ఘంటసాల జూడుడు. కనుక ముదిరాజులు ఇప్పటికైన కన్ను విప్పి విద్యావంతులు, విజ్ఞానదీక్షులు, ధనవంతులు, మరిరాజకీయ నాయకులు తమ ఈర్ష్యద్వేషములు త్రెంచుకొని, ఏకతాటిపై వచ్చి మునుముందు కాలయ మార్పులలో ముందంజ వేయవలసినది ఏమిటి? యని తెలుసుకోవలసియున్నది. ధనవంతులు, రాజకీయనాయకులు మరియందరు మన పూర్వ ఆధిపత్యములను అలంకరించగలరని నమ్ముచున్నాను. ఇది నా అంతరాత్మ తెలుపుచున్నది. ప్రభువుకూడ కాలచక్రమును మార్పుతేగలరని విశ్వసించుచున్నాను. అన్నిటికన్న విశ్వాసమే గొప్పది. విశ్వాసము గల మన జాతి సోదరులు తప్పక ఈ పుస్తకము చదివి, చదివినిపించినతర్వాత జాతిలో విప్లవము తేగలరని, ఆ విప్లవమే సంఘసంస్కారముగా మారవచ్చని, మళ్ళి ప్రజాప్రతినిధిగా, ప్రభుత్వములో రాజ్య పాలకులుగా నిరూపించగలరని నమ్ముచున్నాను. "ఇదియే నా సందేశము. ఇదియే సమర్ధరామదాసు శివాజీకి యిచ్చిన పిలుపుగా నేంచగలరు. దేశమును, జాతిని, ధర్మమును కాపాడువారము నాడు-నేడు మనమే. మనకు స్వరాజ్యము దొరికినది. కాని స్వాతంత్రము దొరకలేదు. దేశములో జనాభాపద్ధతిప్రకారముగా జరిగిననాడే, మనదేశము ప్రజాప్రభుత్వమనియు నిజమైన స్వాతంత్రము దొరికినదని భావించగలము. భగవాన్ బుద్ధుడు, దయానందసరస్వతి, మహాత్మగాంధి

చూపిన పోరాటమును సలుపుచుండవలెను." దున్నుటకు భూమి, కొలువులు దొరకని అభాగ్యులు కూటికి గుడ్డకు, నిలువ నీడయు లేక అల్లాడుచున్న ధీరులు ఎందరో గలరు. పట్టములు చదువు విద్యా వంతులకు, నాడు-నేడు (చోటు) సీట్లు దొరకని దీనులు చాల కలరు. మరి ఎట్టిచాకిరి, నిస్వార్థ సేవచేయువారు నెక్కువగలరు. స్వార్థపరులైన పెద్దల బానిసత్వము చేయువారు చాల గలరు. బానిసత్వము వదులు కొని స్వయశక్తితో విద్యావంతులుగా, విజ్ఞానవంతులుగా, రాజకీయ సమర్థులుగా, ఇతర వెనుకబడిన హరిజన, గిరిజన, స్వల్ప మైనారిటి జాతులను వెంటతీసుకొని చైతన్యమునుతీసుకరాగలరనిఆశిస్తువున్నాను.

ఈ ముదిరాజు చరిత్ర ఇంతటితో ముగియలేదు, యింక అన్వే షణ చేయవలెను. ముందుముందు ముత్తరాజ సాహిత్య ద్వార అందీయగలము. ముత్తరాజవంశావలి మూలము దొరికినదేగాని, యింక తమిళచరిత్రలోను దానిని వెలికి తీయవలసియున్నది. మరికోలీ రాజ పుత్, ముత్తరాసకోలీ వంశములు మహారాష్ట్రమున చూడవలసియు న్నది. ఇదియేగాక ఈజాతికి చెందినవారు బర్మా, సిలోన్, సెంట్రల్- ఏసియామరి పశ్చిమముననున్న 'మీడియన్' అనువారిమూలమునుగూడ అన్వేషించవలసియున్నది. సాహిత్యము నిస్వార్థ సేవ, అన్వేషణకు- అచ్చుకు అర్థికము చాల అవసరము, గాన ధనమూలం ఇదమ్ జగత్ అని అన్నారు.' మరి ప్రతి ముదిరాజు జాతీయునికి సాహిత్యము అంద వలెనుగదా, ముదిరాజవర్ణముపై అభిమానముగల ప్రతి ముదిరాజు స్వయంగ ముందుకువచ్చి ఆర్థికమును విరాళముగా యిచ్చి సాంఘిక, సాహిత్యప్రచారమునకు తోడు-నీడగా నిలబడగలరని ఆశిస్తున్నాను. ఒకే జాతి, ఒకే నాయకత్వము, ఒకే ధర్మధ్వజముక్రింద, ఐక్యముగా నిలబడి సాదించగలరని ఆశించుచున్నాను. యింతవరకు చరిత్ర లేదని అనుకొన్నవారు చాల గలరు.మరి యిప్పుడు దొరుకుచున్నదానిని

జారవిడువకూడదు. చరిత్ర మనకు సూత్రధారి. చరిత్రతోనే మాన వుడు ముందుకు పోగలుగును. చరిత్రలేనివారు చరిత్ర హీనులుగా నేంచుదురు. తెలుగుదేశమేగాక యావత్ భారతదేశము, మరి ప్రపంచ ములో నున్న ముదిరాజులు మనజాతిని వెలుగులోకి తీసుకరాగలరని విశ్వసించుచున్నాను.

**కృణ్వంతోముత్తరాజైక్యం**

**చెట్టి లక్ష్మయ్య**
ముత్తరాజు.
లాలాపేట, సికింద్రాబాదు.
ఆంధ్రప్రదేశ్.

-:O:-

# HISTORICAL SOURCES


1. Thc caste & Tribes of Southern India 1907 -by Edgcr Thrustan (C & T - S. 1)
2. The Caste & Tribes of Nizam dominian 1920 -by Sirajul Hassan.(C & T Niz)
3. The Caste & Tribes of Central Province of India -by R. V. Russal. (C & T C. P.)
4. The Caste & Tribes of Ancient -by T. Rajagopal Rao. (C & T -T. R)
5. South Indian History -by K. A. Nilakanta Sastry.(.S I H)
6. Thc Early History of Andhra Country-by -do- (E. H. A. C.)
7. The Pandyan kingdom History -by -do (Pan. K. H.)
8. The Cholas History - Second Edition. -do- (Ch. H.)
9. Rashtrakutas and their times -by Anante, Sadasiva Alteker, M. A. 1967. (R- Sh. K.)
10. Ancient Karnataka Vole. I & II History of Tulva - -by Baskranand Saletore, M. A, Ph.D. 1936.(H T L V)
11. Ancient India and South Indian History and culture Vole. II -by Diwan Bahadur Dr. Krishnaswamy Aiyangar. (A I. S & H. Cult.).
12. Epigraphia India vole. XIII-1915-16 -by Prof S T E N. know. (PHD) and F. W. Thomas, M. A. (Hons) (Ph.D) and No. I on endalai I. piller Inscription -by Subramaniyam Aiyyar B A. M. R S S. Ootacamund (E. p. I. vole. XIII)
13. Epigraphia India vole XXII, part v. 1948. -by Dr B C. H. Chabra, M. A. M. O. L. (PhD) 1950 -(EPI vole XXII)

14. South Indian Inscription Vole 1 - IV -by Rao Bahadur, A Krishnasastry, B A. 1923 (S.1. 1.)

15. Inscriptional glossary of Andhra Pradesh -by Kundur Eswar Dattu- శాసనశబ్దము-కోశము.(S 1. 1.)

16 Epigraphia India Vole. XXXI - 1955-56. No 1 Salanka-yana charters from Kanukollu by B V Krishna Rao Rajmanar Edit -by Dr. D. C. Sircar, M. A. (Ph.D.) 1957. (EPI. Vole. XXXI).

17. Appendix-E, Madurai - Thala - Varalaru, account of the sacred city of Madura (Madurai Mannual) (M. M )

19. Mutharair-Nadu -by Mithic society. The Quarterly Journal Vole XL. IV. New series No 2 October 1953, -by K. S Vaidyanathan B. A, (M. N.)

19. Madras Census Report of 1911 to 1931 according Madurai Manual (M C. C.)

20. Madras Census Report of 1857 to 1951. (M. C. R.)

21. Madras Mannual of History - Madras, page 161, 162. (M. M. H.)

2. Hyderabad State Census Report of 1891 to 1951. (HSCR)

3. Tamil Varaluru, -by Dr. Rajamanikyam page 146-147. (T. V )

24. Tamil Naladiar, -by T. S. Balasundaram Pillai, page 157 (T. N )

25. History of the Later Cholas, Part 1 -by T. V. Sadasiva pandarathar, Annamalai Univercity, Tamil 1958. p. 16-17) (H Ch.)

26. History of Tamil - Nadu from Ist Century - AD to 3rd Centu ry AD was facing invasionly pallavas and Kalabras

according to Tamila Varalaru page 176-178 -by Sri A. M. Parama Sivanandam. (T V H)

27. Tamil - Studies, or Essay on the History of the Tamil-Nadu people, Languages, Religion and Literatures according to Tamil-Studies, Sri H A. Stuart, -By M. Srinivasa Aiyangar, M. A, 1914. (T. S.)

28. ప్రాచీన విద్యాపీఠములు -(తమిళసంఘములు) -by చిలుకూరి సత్యనారాయణపంతులు M A. L. T. (ప్రా. వి.)

29. ఆంధ్రవిజ్ఞానము Vole. 1-7, -by శ్రీ ప్రసాదభూపాలుడు. డా॥ కట్టమంచి రామలింగారెడ్డి. (ఆ. వి.)

30. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము -Volc. 1, 2 -by శ్రీ కొమ్మరాజు లక్ష్మణరాజు 1932. (ఆ. వి. స.)

31. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి -by ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఖండవల్లి బాలేందుశేఖరం M A (ఆ. చ. స)

32. ఆంధ్రుల సాంఘిక చరిత్ర-by శ్రీ సురవరం ప్రతాపరెడ్డి. B A., LLB. (ఆ సా. చ.)

33. రామాయణ విశేషములు -by శ్రీ సురవరం ప్రతాపరెడ్డి, BA., LLB. (రా. వి.)

34. సాహితీ వాల్లభ్యము -by ముల్లపూడి తిమ్మరాజు 1968. (సా. వా. భ్య)

35. భారతి మాసపత్రిక - నవంబర్ 1969 - పు. 4-14. (భారతి)

36. ఆంధ్ర సచిత్ర వారపత్రిక - ఉగాది సంచిక, లేక తేది. 8-8-1969, తేది. 15-8-1969 వ్యాసము, తెలుగువారెవరు? -by శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రి. (తెలుగువారెవరు? ఆ. స. వా. ప.)

37. విజయనగర చరిత్రము -by ఎన్. వేరరాజు, 1941. (విజ. చ.)

38. కౌండిన్య గ్రంథమాల - 4వ పుట, ఆర్వేలనియోగులు చరిత్ర. గ్రంథము -by కల్లూరి వెంకటసుబ్బారావు - గోత్రములు, పుట.44. (ఆ. ని. గో.)

39. మన లిపి పుట్టుపూర్వోత్తరాలు-by తిరుమల రామచంద్ర. (మన. లి. పు.)

40 ఆముక్తమాల్యద - సవ్యాఖ్యానము. -by వావిళ్ళ రామస్వామి శాస్త్రులు (ఆ. మాల్యద.)

41. మహారాష్ట్ర చరిత్ర -by శ్రీ చిల్లరిగె శ్రీనివాసరావు (మ. రా. చ.)

42. ఘంటసాల చరిత్ర -by శ్రీ గొర్రెపాటి వేంకట సుబ్బయ్య, 1947. (ఘంటసాల. చ.)

43. సిద్ధేశ్వర చరిత్రము -శ్రీ కానే సర్వప్ప, సంపాదకుడు, ఖండవల్లి లక్ష్మి రంజనం. M A (సిద్దే. చ.)

44. బసవపురాణము -by పాల్కురికి సోమనాధుడు, (బస. పు.)

45. విద్యార్థి కల్పతరువు. (నిఘంటువు) -by శ్రీ ముసునూరి వేంకటశాస్త్రి (వి. క. త.)

46. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము -by కుందూరి ఈశ్వరదత్తు. B. A. (ప్రా. ఆం. చా భూ.)

47. వైదిక్ సంపత్తి -by శ్రీ పండిత రఘునందనశర్మ. (వై. సం.)

48. కోలీ వంశ కా ఇతీహాస్. -by చౌదరినానక్ చంద్‌కోలీ జగ్రవాల్ న్యూఢిల్లీ 1968. (కో. వ. చ)

49. తెలంగాణ శాసనములు 1, 2 భాగములు. by శ్రీ లక్ష్మణ పరిశోధన మండలి, హైదరాబాద్, (తెలంగ. శా. స)

50. కన్నడ సాహిత్య దర్శనము-మూలము -by శ్రీ పాండురంగాచార్యులు వైద్య, అనువాదము -శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి 1956.(క. సా,.

51. హిందు విశ్వ - మాసపత్రిక-అక్టోబర్ 1974. Vole 10, No 2) page. 13-15. (హి. విశ్వ.)

52. దక్షారామము - by శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

53. తెనుగుదుక్కి -by శ్రీ K. లక్ష్మీరంజనం.

54. చార్లస్ బ్రౌన్ - నిఘంటువు.

-0-

# తప్పు - వొప్పుల - పట్టిక

| ప్రకరణము- | పుట. | తప్పు | వొప్పు |
|---|---|---|---|
| ౧ వ | ౧ | లంకా | లంక |
| ,, | ౪ | శ్రౌత | శ్రౌత్ర |
| ,, | ౫ | పయోగించెడి | ఉపయోగించెడి |
| ,, | ౬ | వివరించి | వివరించుట |
| ,, | ౭ | పూర్వపుకూలీలు- | పూర్వభారతకార్మికులు |
| ,, | ౧౪ | సుందరరభాతవని | సుందరభారతవని |
| ౨ వ | ౧౮ | కౌమార | కుమార |
| ,, | ,, | పున్నవట్టికిన్ని | పున్నపట్టికిన్ని |
| ,, | ౧౯ | కౌమారుడు | కుమారుడు |
| ,, | ౨౨ | No. 10 N. S A. tribe of Soodra descanded | N S A tribe of Soodra descendant. |
| | | AdJ : Appctaining to a tribe of Hindu descendants from feudal tenants who wcre holders in black mail a species of milcitia who oftcn are free Booters. | Adj : Appertaining to a tribe of Hindu descendants from feudel tenants. who were holders in black mail a species of mi citia who often are free Booters. |
| ,, | ౨౨- No ౧౨ | mutuda wood seems to be the village Headman. | mutuda would seems tobe the village Headman. |
| ౩ వ | ౨౫ | connoying | conveying |
| ౪ వ | ౩౦ | ఆరివారినవారు | అవసరముగలవారు |
| ౬ వ | ౪౭ | ఖారతచరిత్ర | భారతచరిత్ర |
| ౭ వ | ౫౮ | విష్కకవిపాదులు | విష్కకనిపాదులు |

| ప్రకరణము | పుట. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౭ వ | ౬౦ | తెలుగువారువరు | తెలుగువారెవరు |
| ,, | ౬౩ | సందివర్మ | నందివర్మ |
| ,, | ,, | పగ్గసిహాయ | పగ్గసింహ్మాయ |
| ,, | ౬౪ | తీర్థము | తీరము |
| ,, | ౬౬ | ప్రథావ | ప్రధాన |
| ౯ వ | ౮౩ | ఆధికారముసకు | అధికారమునకు |
| ,, | ౧౧౨ | శ్రీనృష్ణదేవరాయలు | శ్రీకృష్ణదేవరాయలు |
| ,, | ౧౧౪ | కావులు | కాపులు |
| ౧౩ వ | ౧౧౮ | బ్రశ్మాక్షత | బ్రహ్మాణక్షత్ర |
| ,, | ౧౨౦ | యుయాతి | యయాతి |
| ,, | ౧౨౨ | నీరియందు | వీరియందు |
| ,, | ౧౨౩ | విరాజిల్లునని | విరాజిల్లుమని |
| ౧౪ వ | ౧౨౮ | వివహ్లాము | వివాహము |
| ,, | ౧౨౮ | శ్రీ ఏడ్గర్థ్రస్టర్ | శ్రీ ఎడ్గర్ థ్రస్టన్ |
| ౧౮ వ | ౧౪౪ | fudels | feudals |
| ,, | ౧౪౫ | జమీంనారులుగా | జమీందారులుగా |
| ,, | ,, | అదికారి | అధికారి |
| ,, | ,, | వన్నెండవ | పన్నెండవ |
| ౧౭ వ | ౧౫౩ | గొప్స | గొప్ప |
| ,, | ,, | తమళ | తమిళ |
| ౧౯ వ | ౧౫౭ | మట్లు | మట్ల |
| ,, | ౧౬౧ | (తిరస్తు లేక చిరస్తు) | |
| ౨౧ వ | ౧౬౯ | వటాలము | పటాలము |
| ౨౩ వ | ౧౮౫ | పాండ్యురాజు | పాండ్యరాజు |